The one and only Magazine devoted to Humour & Music

పేజీలు : 68 + 8

వెల : రూ. 10

16 - 30 జూన్ 2002

# హాసం

హాస్య-సంగీత పత్రిక




జూన్ 19
జంధ్యాల
తొలి వర్థంతి
సందర్భంగా
హాస్య ప్రియులందరి తరపున
నివాళులు అర్పిస్తూ
హాసం
విశ్వ రంగస్థలమ్మీద
ఆయన పాత్ర ముగిసినా
'అంతరంగస్థలం' పై 'ఆయన నవ్వులు'
కొనసాగుతునే ఉంటాయి ...

# ఇవీ సంగతులు

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# హాస్యం - సంగీతం

## హాస్యం



**సీరియల్ :**





**కథ :**



**కామెడీ స్కిట్ :**





**క్లాసిక్స్ రీటోల్డ్ :**



**బాపూరమణీయం :**





**శీర్షికలు :**



**హ్యూమరథం:**





**ప్రత్యేక వ్యాసాలు :**





## సంగీతం



**శాస్త్రీయం:**



**లలితం:**



**సినిమా:**



**ఆపాతమధురం** - రాజా



**అర్థం చేసుకుందాం-ఆస్వాదిద్దాం**





**ప్రత్యేక వ్యాసాలు :**





**శీర్షికలు :**







సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
'నీతో'
'అల్లరి'
సినిమా పాటల పుస్తకాలు
'సెంటర్‌స్ప్రెడ్'లో



అనుబంధంగా కె.వి.మహదేవన్, మల్లాది, ముళ్ళపూడి వెంకటరమణ పాటలు...71,64,60 పేజీలలో

ముఖచిత్రం:'అల్లరి రాముడు' సినిమాలో ఎన్టీఆర్

నేను ఏ పత్రికలు మా ఇంట్లో వుండటానికి ఇష్టపడను. 'హాసం' is the first Magazine which I want to be in my House. మా కుటుంబ సభ్యులంతా చదవాలని ఆశతో దీనికి చందా కట్టాను.

-తేజ
(సినీ దర్శకుడు)
హైదరాబాదు-33

# ప్రియ జనవాక్యం

మంచి కథలు - జోక్స్ - సీరియల్ అన్నీ ఒక దాంతో ఒకటి పోటీపడుతున్నాయి. హిందీ రాని వారికి సైతం హిందీ భాష పట్ల ఆసక్తి - అభిరుచి కలిగేలా అర్థాలతో సహా హిందీపాట పరిచయంతో ఒక కొత్తవరవడి సృష్టిస్తున్నారు. ఏ నెలకానెల ఎన్నో మంచిపాటల నందిస్తున్నారు. మా చిన్నప్పుడు సినిమా చూడగానే పాటల పుస్తకం కొనుక్కొనే వాళ్ళం - అలాంటి పాటల పుస్తకాలిప్పుడు మృగ్యం - అలాంటి తరుణంలో మళ్ళీ పాటల పుస్తకాలు 'హాసం'లో చూస్తుంటే కలిగే ఆనందం చెప్పనలవి కానిది.

-వాలి హిరణ్మయీదేవి, హైదరాబాద్

1-15 జూన్ 'హాసం' పత్రికలో ఈసారి సినీ ప్రముఖ గేయ రచయిత అయిన కైఫీ ఆజ్మీ గూర్చి, ఆయన పాటలను గూర్చి, మరియు ఆరుద్ర వర్థంతి సందర్భంగా అందించిన ప్రత్యేక వ్యాసం, ఆయన వ్రాసిన పాటలు, సంగీతాభిమానులకు అందించటం హర్షించదగ్గ విషయం, అభినందనీయం. అదేవిధంగా మా ఫేవరెట్ మ్యూజిక్ డైరెక్టర్ అయిన 'ఇళయరాజా' 60వ యేట అడుగుపెడ్తున్న శుభసందర్భంలో ఆయనకు శుభాకాంక్షల రూపంలో వ్యాసం, ఆయన స్వరపర్చిన పాటలు కొన్ని ఇవ్వడం ఆనందదాయక విషయం. సంగీతంలో సమ్రాట్, విలక్షణ సంగీత దర్శకుడైన 'ఇళయరాజా' స్వరపర్చిన అసంఖ్యాక హిట్ గీతాలుండగా కొన్ని మాత్రమే ఇవ్వడంతో కొంతబాధ కలిగించింది. దాదాపు 800 చిత్రాలకు సంగీతాన్ని అందించిన 'ఇళయరాజా' ప్రస్తుతం కొన్ని చిత్రాలకే సంగీతం ఇవ్వడం బాధాకరం. అదేవిధంగా ఈ సంచికలో "అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం" శీర్షికలో పాకీజా చిత్రంలోని పాటను అందించటం చాలా బాగుంది. సంగీతానికి విలువనిచ్చి, బ్యాక్‌గ్రౌండ్ ఆర్టిస్టులకు గుర్తింపునిస్తున్న 'హాసా'నికి ఉజ్వల భవిష్యత్తు ఉండాలని ఒక సంగీతాభిమానిగా నా కోరిక.

-ఎం.డి.ముస్తఖీమ్, కొల్లాపూర్

'మే' నెల రెండో సంచిక 57వ పేజీలో నా అభిమాన కథకుడు అవసరాల రామకృష్ణారావు గారి 'జోక్'లో నిజానికి గ్రామరు ప్రకారం ఆ సర్దార్జీ అనువాదం కరెక్టే! ఎందుకంటే 'To marry' అన్న పదానికి 'To give in marriage' అన్న అర్థం కూడా వుంది. మన తెలుగులో అలా వాడం. అంతే!

-నిశాపతి, హైదరాబాద్

జూన్ మొదటి సంచికలోని వంశీగారు చెప్పిన ఇళయరాజా విశేషాలు ఎంతో బావున్నాయి. చెరగని ముద్రవేస్తూ నిలిచిపోయిన శ్రవణ పేయమైన బాణీలు కూర్చిన ఇళయరాజాను తెలుగు పరిశ్రమ ఇంకా ఎందుకు సరిగ్గా వినియోగించుకోలేక పోతుందో అన్నది విచారకరమైన ప్రశ్న. అరకులోయ పచ్చదనాలు, విలక్షణమైన స్క్రీన్ ప్లేతో ప్రేక్షకుల్లో ఉత్కంఠను రేపే వంశీ సినిమాలు కూడా కరువు అవటం దురదృష్టకరమే. త్వరలోనే ఈ 'హిట్‌ఫెయిర్' నుంచి ఓ మంచి సినిమా వస్తుందని ఆశిద్దాము.

ఆరుద్రగారి వర్ధంతి సందర్భంగా ముళ్ళపూడి వారి వ్యాసాలు ఆయన అభిమానులకు మీరిచ్చిన మంచి కానుకలు. అయితే పాటలు బహు స్వల్పంగా ఇచ్చారు. వీలువెంబడి మరిన్ని ఆరుద్ర హృద్య గీతాలు ఇస్తారని ఆశిస్తాము.

-వై.రాజేష్, విశాఖపట్నం

అలనాడు ఎప్పుడో చరిత్రలో స్వర్ణయుగం అనబడే కృష్ణదేవరాయలు కాలంలో "సాహిత్యం" "సంగీతం" కలిసి విశ్వవ్యాప్తమై విలసిల్లినాయట. సూపర్ కంప్యూటర్ యుగంలో అంతరించిపోతున్న "సంగీత" సాహిత్యాలను మరలా పునర్జీవింపచేస్తున్న "హాసం"కు మా ధన్యవాదాలు. ఆరుద్రగారి గురించి అతని రచనాశైలి గురించి ముఖ్యంగా అతనిలోని ముక్కుసూటితనపు చలోక్తులు గురించి హ్యూమరథంలో రావి కొండలరావు గారి వ్యాసం ఎంతో కమనీయంగా ఉంది. ఆరుద్రగారిని అక్షరరమ్యంగా "హాసం" ద్వారా అందించినందుకు మనస్సుమాలు.

అలాగే వంశీగారు అందించిన మరో సుమధుర సంగీత సామ్రాట్ ఇళయరాజా గారి జీవిత విశేషాలు. కుటుంబ పరిచయ వేదిక ఎంతగానో ఆకట్టుకుంది. ఇళయరాజా గారి సంగీత నేపథ్యం విశ్వవ్యాప్తం అయి సంచలనాలు రేపింది సామాన్య స్థాయి నుండి అసమాన స్థాయికి ఎదిగిన తీరు దీనిని వంశీ'హాసం' పాఠకలోకానికి అందించిన క్రమం సుమధురంగా సాగింది. ఇలా "సంగీత ఆభరణాల భరణి" గారి శాస్త్రీయం, అందులో వ్రాసిన మనసూరి వేంకటలక్ష్మమ్మ గారి సంగీత వ్యాసం చక్కగా సాగింది. కథల హోరు సరేసరి ఇన్ని అచ్చమైన చక్కనైన శీర్షికలు అందిస్తున్న "హాసం" పత్రిక తెలుగు పత్రికా జగత్తులో నిత్యనూతన కాంతిపుంజమై విలసిల్లాలని మనస్ఫూర్తిగా అభినందన నీరాజనలందిస్తూ.

-సముద్రాల వేణు, ఖమ్మం

వెన్నెల జల్లులా గజాలా చిరునవ్వులు నిజంగా వారి అభిమానులకు అదృష్టాలే! ముఖచిత్రం పేజీ త్రిప్పగానే మధురగాయకులు డా. ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం గారి చిత్రాలు రమణీయాలు. అంతేకాదు బాలూ జన్మరహస్యం కథ చాలా బాగుంది. బాలు గారి పాట కనుల ముందు నవ్వుంటే కవిత పొంగి పారదా - అంటూ వారు పాడినపాట మరుపురానిది. మరువలేనిది - సాధనా వారి సంతానం - విశేషాలు అలనాటి జ్ఞాపకాలు ఆపాత మధురాలు వాటి సేకరణకి మీకు ధన్యవాదాలు - సాహిత్యసారధి ఆరుద్రగారి జీవిత విశేషాలు చక్కగా ఉన్నాయి. వారు రచించిన పాటలు ఇచ్చారు. అభినందనీయులు. ఆరుద్ర గారి చిత్రం బాగుంది.

-ఎం.కె.వి.వి.సత్యనారాయణమూర్తి, తుని





సంపుటి :1 సంచిక: 18

16 - 30 జూన్ 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200



HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 18

ఈ రోజుల్లో తరచుగా వినబడే మాట-"ఇప్పుడు పుస్తకాలు ఎవరు చదువుతున్నారండి... అందరూ టీవీకి అతుక్కుపోయే వాళ్లే కదా"! ఈ పరిస్థితే కొనసాగితే పుస్తకాలనేవి క్రమంగా కనుమరుగయి పోతాయని, చదవడమనేది అరుదైన అవధానం అయిపోతుందని ఊహాగానం చేస్తున్నారు కూడా.

మరి అమెరికా వంటి దేశాలలో ఎన్నాళ్ల నుండో ఎలక్ట్రానిక్ మీడియా వున్నా పబ్లిషింగ్ ఇండస్ట్రీ మూత పడ లేదు కదా అనే ప్రశ్న ఉదయిస్తుంది. దానికో కారణం ఉంది. చిన్నప్పటి నుండి పిల్లలకు పఠనాసక్తి కలిగించే పద్ధతి అక్కడ వుంది. ఆట వస్తువుల్లో ఉన్నట్టుగా ప్రతీ ఏజ్-గ్రూపుకి తగిన పుస్తకాలు ప్రచురించడం జరుగుతుంది. అందువల్ల ఎంతో కొంత చదివే అలవాటు ప్రతీవారికీ ఏర్పడుతుంది.

చదవడం ద్వారా ఆనందం పొందిన వారికి ఆ ఆనందం వేరే ఏ ఇతర వ్యాపకం ద్వారా లభించదు. అందువల్ల చదివే అలవాటు, ఏదో ఒక స్థాయిలో కొనసాగుతూనే ఉంటూంది.

చదివే అలవాటు లేకపోతే నష్టమేమిటి అని ప్రశ్నించే వారు కూడా ఉండవచ్చు. విజ్ఞానం కానీ, ఆహ్లాదం కానీ పుస్తకాల ద్వారానే పొందాలన్న నిబంధన ఏముంది? దృశ్య రూపంగానో, శ్రవణ రూపంగానో ఆస్వాదించకూడదా అని అడగవచ్చు. వాటిన్నిటి కంటె పుస్తకం ద్వారా పొందే ఆనందం విభిన్నమైనది. దానిలో వ్యక్తిగతమైన సృజనాత్మకత మిళితమయి వుంటుంది.

సినిమా ద్వారాగానీ, టీవీ ద్వారా గానీ ఒక విషయం గురించి తెలుసుకుంటున్నప్పుడు అది సృష్టించిన వారు బిగించిన ఫ్రేము ద్వారానే దానిని మనం చూడ గలుగుతాం. వారు నియమించిన పరిమితులకు లోబడి మన ఆనందాన్ని కుదించుకుంటాం. కానీ పుస్తకం చదివినప్పుడు మనకు కలిగే ఊహలకు పరిమితులు ఉండవు. ఎంత గొప్ప కళాకారుడైనా తను ఊహించిన దానినంతటినీ తన కళలో ప్రదర్శించ లేడు. 'కానుక' కథలో ముళ్లపూడి వెంకటరమణ అంటారు. "ఊహ కందే సంగీతంలో పాట కందేది శత సహస్రాంశం ఉండదు" అని. అలాగే 'ఆరాధన' సినిమాలో ఆత్రేయ అంటారు. 'కన్నదాని కంటే కల్పించుకున్నదే తీయగా ఉంటుంది' అని. అంచేత పూర్తి స్థాయి ఆనందం కళారూపంలో కాక, ఊహలోనే ఎక్కువగా లభిస్తుంది.

పుస్తక పఠనం మన ఊహాశక్తిని పెంచుతుంది. సృజనాత్మకతను ఆవిష్కరిస్తుంది. గొప్ప రచయితలంతా సాధారణంగా మంచి చదువరులు అయి వుంటారు. 'జీవితాన్ని చదివాను' అని ఎంత గొప్పగా చెప్పుకున్నా - తాము నేర్చుకున్నది, గ్రహించినది - అక్షరాల ద్వారా ఇతరులతో పంచుకునే కళ సొంతం కావాలనుకుంటే - పూర్వులు రాసిన పుస్తకాలు చదవటం తప్పనిసరి.

టీ.వీ. ప్రేక్షకులుగా మిగిలిపోయే వారు కొందరయితే వారిని టీవీకి కట్టి పడేసేటంత గొప్పగా కార్యక్రమాలు తయారు చేయగల సృజనాత్మకత స్రష్టలకి - ఆ సృజనాత్మకత అబ్బేదీ, అభివృద్ధి అయ్యేది పుస్తకాల ద్వారానే.

మరి ఈ రెండు కేటగిరీలలో మీరు ఏ కేటగిరీలో ఉండదలచుకున్నారో ఎంచుకోండి. మీ పిల్లలు ఏ కేటగిరీలో చేరాలని అనుకుంటున్నారో నిర్ణయించుకోండి. అమెరికా వంటి అభివృద్ధి చెందిన దేశాలలోలా ప్రతీ ఏజ్ గ్రూపుకి పుస్తకాలు తయారయ్యే భాగ్యం మనకు ఇప్పట్లో కలగక పోవచ్చు. కాబట్టి ఆరోగ్యకరమైన పత్రికల నుండి కొన్ని భాగాలైనా చదవండి. పిల్లలకు చదివి వినిపించండి.



# చచ్చేదాకా... చచ్చే చావే..!

**- వాలి హిర్మణయీదేవి**



నా గురించి చెప్పు కోవాలంటే ఈ రచన వ్యాసంగం అనే సింధువులో - ఒక బిందువుని మాత్రమే. 1984 నుండి రాస్తున్నాను - నూటయాభై కథలకి పైగా వివిధ వార, పక్ష, మాస పత్రికల్లో వచ్చాయి. కొన్ని రేడియోలో ప్రసార మయ్యాయి. కొన్ని బహుమతులను అందు కొన్నాయి. కానీ ఇంకా ఇప్పటికీ రాసే ప్రతీసారీ మధనపడుతూ రాయడమే. రాసే ఈ కథలకు ప్రయోజనం ఉంటోందా అన్న అనుమానం - ఏ కథ రాసినా అందులో ఓ సందేశం ఉండేలా చూడాలన్న తపనల వల్ల!


**వాలి హిరణ్మయీదేవి**
**కేరాఫ్: యాంకర్ హౌస్,**
**4-1-7 ఎ/6,**
**తిలక్‌రోడ్, హైదరాబాద్-1.**


**"సత్యమూర్తీ - ఒరేయ్ సత్యమూర్తీ - లేవరా నాయనా! పాపం కోడలొక్కర్తీ వంటింట్లో అష్టావధానం - శతావధానం చేస్తోంది. కాస్త పన్లో సాయం చేయరాదట్రా - నాకా ఈ కీళ్ళ నొప్పులతో చచ్చే చావొచ్చిందాయె." కొడుకు తలమీద నుండి దుప్పటి లాగుతూ అంది శాంతమ్మ- "అహ్ బా - ఓ హరగంట - పడుకోనిద్దూ - నిదొరొచ్చేస్తూందికా" అంటూ మళ్ళీ ముసుగుతన్నాడు సత్యమూర్తి - "ఒరేయ్ - నాయనా - లేవరా - కోడలికి స్కూల్లో చాలా పనుందట్రా." పాపం కోడలి తరపున వకాల్తా పుచ్చుకొంటూ మళ్ళీ లేపబోయిందామె.**

"అత్తయ్యగారూ! శుద్ధ వేస్ట్ - రాత్రి పన్నెండింటి దాకా టీ.వి. చూట్టం - తొమ్మిదింటిదాకా ముసుగెట్టడం ఆయన కలవాటేగా. లేచినా సాయం చేసే మాటేమోగానీ కాలికీ - చేతికీ చిన్న పిల్లాడికన్నా అన్యాయంగా అడ్డొస్తుంటారు" అని ఆవిడ చేతికి కాఫీ అందించి పిల్లల రూమ్‌లోకి వెళ్ళింది సావిత్రి.

"పిల్లలూ - వేణ్ణీళ్ళు రెడీ! తొందరగా లేవాలి. లేదంటే నాన్నగారు బాత్‌రూమ్‌లో దూరతారు" అంటూ పిల్లల్ని లేపింది.

"అమ్మో - నాన్నగారు బాత్‌రూమ్‌లోకి దూరితే గంటల తరబడి ఉండిపోతారు" అంటూ చటుక్కున లేచింది కావ్య. ఉన్నది ఒకే బాత్‌రూమ్. మరి ఒకరు వెడితే మరొకరు అలా ఉండిపోవల్సిందే.

అక్క కన్నా ముందు నే వెడతానంటూ మొదలెట్టింది నవ్య.

"చెల్లి లోపలికెళితే నాన్నగారిలాగే నిద్రపోతుంది. నేను ముందు వెడతా" అంటూ పరుగున బాత్‌రూమ్‌లో దూరిపోయింది కావ్య. అది చూసి ఏడ్పు లంకించుకొంది నవ్య. అప్పుడే నిద్రలేచిన సత్యమూర్తి - సావిత్రి వంక కొరకొరా చూస్తూ- 'చూశావా - బాత్‌రూమ్‌లో దూరి గంటల తరబడి ఏం చేస్తారు - నిద్రోతుంటారా' అంటుంటావ్ - ఇప్పుడు చూడు ఆ పెద్దది ఎంత కన్‌ఫర్మ్‌డ్‌గా చెప్పేసిందో - చిన్నది నాలా బాత్‌రూమ్‌లో నిద్రపోతుందని" అన్నాడు.

"బాబూ! పొద్దుటే మీతో వాదనేసుకొనే ఓపిక - టైమూ రెండూ లేవు - ఉన్నమాటంటే ఉలుకెక్కువని..." - ఇంకా ఏదో అనబోతున్న సావిత్రి కుక్కర్ విజిల్ వింటూ వంటింట్లోకి పరుగెత్తింది.

'పొద్దుట వంటొక్కటే అయితే బావుండేది - ఈ కాఫీ టిఫన్లతో బోలెడంత టైమ్ వేస్టయిపోతుంది. అత్తగారికి మావగారికి తప్పనిసరిగా ఇడ్లీలు చేయాలి. తేలిగ్గా అరగడానికి మంచిదని అలా అలవాటయి పోయింది - వారితో పాటూ ఇక ఇంటిల్లిపాదికి అవే అలవాటయ్యాయి. ఇడ్లీలు అయ్యాయి - ఇక పచ్చడి చేసి చావాలి" అనుకొంది విసుగ్గా.

ఆమె అడ్రస్ వెదుక్కొంటూ



వస్తున్న యమభటులకామె మాటలు విన్పించి టక్కున ఆగిపోయారు. "అరె - ఈమెకి మనం ఇవాళ వస్తున్నామని ఎలా తెలుసంటావ్? 'పచ్చడి చేసి చావాలి' అంటోంది" అంటూ యమాశ్చర్యం పొందాడు మొదటి యమభటుడు.

"నుదిటిరాత ఆమెతో అలా అన్పించి ఉం టుందిలే. ఇప్పుడు ఆవిడ పచ్చడికోసం మిక్సీ ఆన్ చేయ బోతూందిగా - కరెంట్ - షాక్ కొట్టించేస్తే సరి - ఆ వంకన ఆవిడ ప్రాణాలు ఈజీగా



తీసుకెళ్ళిపోవచ్చు" ఉత్సాహంగా అన్నాడు రెండో యమ భటుడు. టప్పున కరెంట్ పోయింది. ఇద్దరి మొహాలొక్కసారే వెలా వెలా బోయాయి.

"హుఫ్, ఈ కరెంట్ ఇప్పుడే పోయిచావాలా? ఇలా పొద్దుటప్పుడు కరెంట్ కోత పెడితే ఇల్లాళ్ళందరికీ - ఎంత ఇబ్బందో ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్ వాళ్ళకి ఎప్పుడు తెలుస్తుందో కదా....!? రుబ్బురోలు ముందు ఓ అరగంట చావాల్సిందే'' అని విను కున్న ఆ అమాయకురాలికి. ఆ కరెంట్ కోతే తన ప్రాణాల్ని రక్షించిందని తెలీదు పాపం! "రుబ్బు రోలు దగ్గరికి వెడుతోంది గదా - ఆ రాయి తలకు తగిలి చచ్చేలా చేద్దామా" అన్నాడు మొదటి యమభటుడు.

ఆవిడ అటు కాలు పేసేంతలో కరెంట్ రావడం జరిగింది. సావిత్రి మిక్సీ దగ్గరకు వెళ్ళేలోపున - శాంతమ్మ వచ్చి 'ఆ పచ్చడేదో నేనే చేస్తానులే. నువ్వెళ్ళి పిల్లలకు జడలెయ్యి" అంటూ సావిత్రి చేతిలోని పచ్చడి సామాను తీసుకొంది.

ఉస్సురన్నారిద్దరూ యమభటులూ.

'సావిత్రీ'! వేణ్ణీళ్ళు రెడీయేనా? ముగ్గురూ కలిసి నీళ్ళన్నీ అవజేశారు' అంటూ కంప్లయింట్ చేశాడు సత్యమూర్తి.

"కరెంట్ పోయిందని - అదుగో గ్యాస్‌స్టవ్ మీదనే పడేసాను. ఈ కరెంట్ కోతతో - గ్యాస్ తొందరగా అయిపోయి చస్తోంది - రెండో సిలిండర్‌కి అప్లయి చేయమంటే 'ఇదుగో - అదుగో' అంటున్నారు - మీ బద్ధకంతో చచ్చే చావొస్తోంది నాకు - ఆ పంప్ స్టౌ పాడయి చచ్చిందావె...'' తన ధోరణిలో తాను చెప్పుకుపోతోంది సావిత్రి.

'నేరకపోయి అడిగాను - ఇక ఈ దండకం ఆపటం మన వల్ల కాదు' అనుకొన్నాడు మనసులో సత్యమూర్తి - పైకి పొరపాట్న అంటే మరో రెండు గంటలు క్లాస్ తీస్కోనే సావిత్రంటే యమభయం మరి.

'తొందరగా స్నానం చేసి రండి - ఆ నల్లా బందయ్యేలోగా బట్టలుతికి చావాలి' హెచ్చరిం చింది సావిత్రి.

"అల్లల్లాగే'' అంటూ బాత్‌రూమ్‌లోకి దారితీశాడు సత్యమూర్తి - ఆవిడందించిన బకెట్ అందుకొని.

"అబ్బ! ఈవిడెటు తిరుగుతోంటే - అటు తిరుగుతే 'అవ కాశం' కోసం చూస్తూ వెంట తిరుగుతూంటే అవకాశం మాటేమో గానీ ఆయాసం మాత్రం వచ్చేస్తోంది బాబూ" అంటూ ఉస్సురస్సురనడం యమభటుల వంతు అవుతోంది-

"అవున్రా - ఆడాళ్ళు - ఇంట్లోనే ఇన్నేసి కిలోమీటర్లు నడుస్తారని మనం ఎప్పుడు ఊహించలేదు కదూ" అన్నాడో మహాసత్యం కనిపెడుతూ మొ. య. భటుడు.

"నిజమేరా... నాకైతే కాళ్ళు పీకేస్తున్నాయ్ - ఆవిడేమో చకచకా గదులన్నీ తిరిగేస్తూ పనులన్నీ చక్కబెడుతోంది - బెడ్‌రూంలో దుప్పట్లు మడతబెట్టి ఇల్లూడ్చేసిందా - వంటింట్లోకొచ్చి పిల్లలకు ఇడ్లీలు పెట్టేసి - వాళ్ళకి టిఫిన్ బాక్స్‌లు రెడీ చేసిందా - అదే చేత్తో మావగారి గదిలోకి వెళ్ళి అక్కడంతా శుభ్రం చేసి ఆయనకి కాఫీ టిఫిన్లందించిందా - మళ్ళీ భర్తగారికి స్నానం చేసి వచ్చేలోపున బట్టలందించిందా- అదుగో - బట్టలన్నీ ఉతికి - ఆరేసిందా? అదుగో మళ్ళీ ఇటొస్తోంది - అవకాశం దొరుకుతుందేమో చూద్దాం" అన్నాడు రె.య. భటుడు.

"సావిత్రీ - నువ్వూ కాస్త టిఫిన్ తిన రాదటమ్మా - మళ్ళీ అలాగే వెళ్ళిపోతావ్ - ఏదో గబాగబా ఈ రెండిడ్లీలూ నోట్లో వేసుకో" అంటూ పిలిచింది శాంతమ్మ.

"ఐడియా - ఆవిడ గబాగబా తింటూంటే పొలమారేలా చేసి ప్రాణాలు తీసేసుకొందాం" అన్నాడు మొ. య. భటుడు.

ప్లేట్లోని ఇడ్లీ నోట్లో పెట్టుకోబోయేంతలో- 'ఆటో' వచ్చిన చప్పుడు విన్పించి ఆ ప్లేట్‌నలాగే వదిలేసి - పిల్లలకు బ్యాగ్‌లూ - వాటర్ బాటిల్స్ అందించి టా టా చెప్పే కార్యక్రమంలో పడింది సావిత్రి.

యమభటులిద్దరూ మొహాలు చూసుకొన్నారు.

"సావిత్రీ - ఇవాళ నాకు మార్కెట్ వెళ్ళడం కుదర్దుగానీ సాయంత్రం నువ్వే కూరగాయలు పట్రా - నాకసలే మంచివి ఏరడం తెలీదు" అన్నాడు సత్యమూర్తి.

"మీకు తప్పినా నాకు తప్పదు కదా - ఇప్పటికే లేటైంది - లేట్‌గా వెళ్ళి మళ్ళీ సాయంత్రం షాపింగ్‌కి తొందరగా వెళ్ళడానికి పర్మిషన్ ఇవ్వమని ఏ మొహంతో అడగను!?" అంది సావిత్రి బ్యాగ్ సర్దుకొంటూ.

"షాపింగ్ కార్యక్రమం ఏంటి" అయోమయంగా అడిగాడు సత్యమూర్తి.

"అబ్బ - ఎంత మతిమరుపండి - మన పెళ్ళిరోజిక వారం రోజులే ఉంది... బట్టలు కొనాలి - మిమ్మల్ని కొనమంటే సరిగ్గా కొనరు. మంచి సెలెక్షన్ రాదు మీకు - అన్నీ నేనే చేయాలంటే చచ్చేచావొస్తుంది" తనదైన ధోరణిలో అంది.

"నిజమే. నా సెలెక్షన్ బాగోదు - బాగుంటే నిన్నెలా సెలెక్ట్ చేసే వాడినిలే" అన్నాడామెని ఏడ్పించటానికి.

"నన్ను సెలెక్ట్ చేసింది మీ అమ్మానాన్న గార్లు - చూసి తలూపింది మాత్రం మీరు. నాలా సెలెక్ట్ చేయడం మీకు రాదని ఒప్పుకోరాదటండీ" నవ్వుతూ అంది సావిత్రి.

"నిజమే నీ సెలెక్షన్ మంచిదని మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నా" అన్నాడు సత్యమూర్తి తమాషాగా కన్నార్పుతూ.

"గొప్పేలెండి - నేను మిమ్మల్ని కోరుకున్నా ననేగా ఆ బడాయి - అదిసరే గానీ సాయంత్రం లేట్ అవుతుంది. ఆ బస్సులు టైమ్‌కి వచ్చి చావవు. కాస్త చౌరస్తాలో నిలబడి ఉంటే నేను షాపింగ్ ముగించుకొని ఎనిమిదిన్నరకల్లా వస్తాను - నన్ను తీసుకొని ఇంటికి వద్దురుగాని" అంది సావిత్రి.

"అమ్మో - వెయిటింగా - ఎనిమిదిన్నరంటావ్ - అసలు చీరల ఎన్నిక నీకెన్ని గంటలు పడుతుందో".

"అదే మన పెళ్ళికాక ముందు - పార్కుల్లో గంటల తరబడి ఎలా ఎదురు చూశారో" దెప్పి పొడిచింది సావిత్రి.

"మనకు పెళ్ళవుతుందని ఇలా నన్ను మాటిమాటికి సాధిస్తారని తెలుసుంటే ఆ పొరపాటు చేసే ఉండేవాణ్ణా దేవీ" అన్నాడు సత్యమూర్తి.

"నేను మిమ్మల్ని సాధిస్తున్నానా - అలా సాధించే దాన్లా కన్పడుతున్నానా? అసలు మా ఇంటా వంటా లేదు సాధింపు అనేది. సాధించి చచ్చేదేముందని సాధిస్తాను? అయినా మిమ్మల్ని పొద్దస్తమానం సాధించడానికి నాకెక్కడ టైముండి చచ్చిందని - సాధిం...."

"తల్లీ - తల్లీ - బుద్ధితక్కువై - అల్లుణ్ణి నోరు జారాను. క్షమించు" ఆమె వాగ్ధోరణికి అడ్డొస్తూ - లెంపలు టప్‌టప్‌న వేసుకొన్నాడు సత్యమూర్తి. అతని వంక చురచురా చూసి, చెప్పులేసుకొని కదిలింది సావిత్రి.

అంతవరకూ ఊపిరి బిగవట్టి - బిగుసుకుపోయిన యమభటుల్లో కదలిక వచ్చింది.

"బాబోయ్! మొగుడని చూడకుండా ఎలా దులిపేసిందిరా" అన్నాడు రె. య.భటుడు.

"నీ మొహం ఆడవాళ్ళు మొగుణ్ణి కాక ఇంకెవర్ని దులుపుతార్రా పిచ్చిమొహమా - మన అమ్మగారు అయ్యగార్నెంత దడదడలాడిస్తారో తెలీదూ నీకు!? అన్నట్టు కొత్తగా చేరావ్ కదూ. అంతటి యమధర్మరాజుకే తప్పనప్పుడు ఈ మానవులకో లెక్కా" అన్నాడు మొ. య.మ. భటుడు.

"ఆవిడ ఆటో ఎక్కింది - ఆ మలుపులో లారీ వచ్చి గుద్దుకొనేలా చేస్తే సరి - మన పని అయిపోతుంది" అన్నాడు రె.య.భ.

మలుపు తిరగబోతుండగా లారీ టైర్ బర్స్ట్ అయిపోయి అది టక్కున ఆగిపోవడం - ఆటో మరో పక్కనుండి అతి మామూలుగా వెళ్ళిపోవడం జరిగింది.

యమభటులు మళ్ళీ తెల్లబోయిన మొహాలతో ఒకరినొకరు చూసుకొన్నారు. "ఛ వెధవరోడ్లు - ఆ కంకరరాళ్ళు కోసుగా ఉండి లారీ టైర్లు పంచరయ్యాయి" అని తిట్టుకున్నారు.

"అయితే రోడ్లు బాగాలేకపోవడం వల్ల కూడా మనుషుల ప్రాణాలు నిలిచే అవకాశం ఉందన్న మాట" అంటూ ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశాడు రె.య.భటుడు.

"అదుగదుగో - ఆవిడ క్లాస్ రూమ్‌లోకి వెళ్ళడానికి మెట్లు ఎక్కబోతోంది - దారికడ్డం నిలబడి ఒక్కతోపు తోద్దాం - పనయిపోతుంది" అన్నాడు మొ.య.భ.

సరేనను కుంటూ ఇద్దరు వెళ్ళి అడ్డం నిలుచున్నారు.

"అబ్బ - ఏంటి పిల్లలూ దారికడ్డంగా... కళ్ళు కన్పించటం లేదూ... ఎగ్జామ్స్ చూస్తే పట్టుమని పదిహేనురోజులన్నా లేవు - టైమ్ వేస్టు చేయచ్చా? ఈ ఫాన్సీ డ్రెస్ రిహార్సల్స్‌లో వెధవ కోరలూ - కొమ్ముమ్మలూ మీరూను. వాటిని పీకి అవతలిపారేసి - క్లాస్‌లోకి రండి" అంది సావిత్రి కోపంగా. తెల్లబోయారు యమభటులు.

"తల్లీ - మేం నిజమైన యమభటులమే. నీకోసమే... నిన్ను తీసుకెళ్ళాలని వచ్చాం" అన్నారిద్దరూ ముక్తకంఠంతో.

"ఏంటీ - నన్ను తీసికెడదామనా? ఇంట్లోనూ - స్కూల్లోను నాకోసం ఎన్ని పనులు కాసుక్కూర్చున్నాయో మీకేం తెలుసు? అసలే



పరీక్షలు దగ్గరికొచ్చి సిలబస్ పూర్తిగాక ప్రైవేటు క్లాసులు చెప్పి ఇంటికెళ్ళేసరికి రోజూ ఏడు దాటుతోంది. పక్కకి జరగండి నాయనా - ఇప్పటికే బోలెడంత లేటయ్యింది'' అంది తీక్షణంగా.

అప్రయత్నంగా జరిగారు ఇద్దరు య.భ.లు. "ఏంట్రా బాబూ నదురు బెదురూ లేకుండా అలా గసిరేసిందేంటి?''.

"అసలు మనం ఆవిడకి ఎలా కన్పించామో అర్థం కావటం లేదురా . సాయంత్రం మళ్ళీఆవిడింటికే వెడితే సరి'' అనుకొని వెళ్ళిపోయారిద్దరూ.

****

"అబ్బా ట్యూషన్ పిల్లలొచ్చేశారు. ఇక రెండు గంటల వరకు కుర్చీలోంచి జరగడానికి లేదు'' అనుకొంది సావిత్రి.

'తల్లీ - ఇప్పుడయినా వస్తారా' అడిగాడు మొ.య.భ.

'అర్రె - మళ్ళీ మీరెక్కడ్నుండి వచ్చారయ్యా - పానకంలో పుడకల్లా'

"తమరు మాతో రావాల్సి ఉందమ్మా - తీసుకెళ్ళిపోతాం... రా... తల్లీ''.

"ఏంటి ఏదో సిన్మాకి తీసుకెడతామన్నట్టు తీసుకెళతాం - రామ్మా రామ్మా' అంటున్నారు - నా పిల్లలతో హోం వర్క్ ఎవరు చేయిస్తారు? వచ్చే పిల్లలకు ట్యూషన్ ఎవరు చెబుతారు? వంటెవడు చేస్తాడు - మీరా - మీ తాతా? బుద్ధిగా ఆ పక్కన కూర్చుని ఆ చిక్కుడు కాయలు ఒలిచి చావండి. మా ఆడపడుచు వాళ్ళు రేపొస్తున్నారు. వాళ్ళందరికి చిక్కుడుకాయ కూరంటే ఇష్టం - కిలోలు కిలోలు లాగిస్తారు - తొందరగా ఒలవండి. వెళ్ళండి'' అంటూ ముందు రూమ్‌లోకి వెళ్ళిపోయింది సావిత్రి.

"బాబోయ్ - ఈవిడేంట్రా బాబూ - అందరూ మనల్ని చూసి గడగడా వణుకుతుంటారు. ఈవిడేమో మనల్ని ఇలా వణికిస్తోందేమిటి?''

"ఏమోరా బాబూ - భలే వింత కేస్ తగిలింది మనకు. గబగబా ఈ చిక్కుడు కాయలు ఒలిచేద్దాం - రేపావిడ వంట కాగానే తీసికెళ్ళి పోడానికి వీలవుతుంది'' అన్నాడు రె.య.భ.

ఇద్దరూ చిక్కుడుకాయలు ఒలిచే ప్రయత్నంలో పడ్డారు.

"అమ్మ బాబోయ్ ఈ నారల్ని తీసి చచ్చూ పుచ్చూ చూసి ముక్కలు చేసేసరికి నడుం పడిపోతోంది. ఈ ఆడాళ్ళంత చులాగ్గా ఎలా ఒలుస్తారో'' అంటూ నడుం పట్టుకొన్నాడు మొ.య.భ.

చిక్కుడుకాయల్ని ఒలుస్తూ ఒలుస్తూ - అలిసిపోయి నిద్రలోకి జారిపోయారిద్దరూ.

****

"అమ్మా - మరిక వెడదామా'' కొంచెం భయంగా అడిగాడు వంట పనిలో బిజీగా ఉన్న సావిత్రితో మొ.య.భ.

"కాస్తన్నా బుద్ధుందా! వంటింకా పూర్తి కానేలేదు. సింక్‌లోని అంట్లు అలాగే పడి ఉన్నాయ్. చుట్టాలొస్తున్నారని పప్పు నానబోశాను. యథాప్రకారం కరెంట్ పోయి చచ్చింది. ముందు ఆ పప్పు రుబ్బి తగలడండి'' అంటూ పప్పు గిన్నె వాడి చేతిలో పెట్టింది సావిత్రి.

"ఏంట్రా బాబూ! ఈవిడ చూస్తే ఇంత యమబిజీ. తీసుకెళ్ళకపోతే మన యములాడు వీరంగమేస్తాడు - మధ్యలో మనకొచ్చిందేంట్రా ఈ చావు'' బాధగా అన్నాడు మొ.య.భ.

"ఆవిడతో మాట్లాడీ - మాట్లాడీ ఆవిడ ఊతపదం నీకొచ్చేసిందొరేయ్'' అన్నాడు రె.య.భ.

చూస్తుండగా రాత్రయింది.

"అమ్మా ఈ రాత్రికైనా వస్తారా'' అడిగాడు మొ.య.భ.

"ఏంటయ్యా - అసభ్యంగా - అసహ్యంగా ఆ మాటలు'' కోపంగా అంది సావిత్రి.

"అమ్మమ్మా... తప్పు పట్టకండి తల్లీ. మా యమధర్మరాజు మా తాట వలుస్తాడు. కనికరించి మాతో రావమ్మా మహాతల్లీ'' దీనంగా అన్నాడు రె.య.భ.

"చూస్తున్నారుగా చావడానికైనా క్షణం తీరుబడిలేని జీవితం నాది - కాబట్టి నోర్మూసుకొని వచ్చిందార్నే పొండి'' గదమాయించింది సావిత్రి.

చేసేది లేక యమభటులిద్దరూ యముడి దగ్గరికి వెళ్ళి సావిత్రి వైనమంతా పూసగుచ్చినట్టు వివరించారు.

"హుం ఈ సావిత్రి పేరున్నవాళ్ళంతా మహా మొండి ఘటాలు. వాళ్ళ మొగుడి ప్రాణాలు తీయనివ్వక - తమ ప్రాణాలూ తీయనివ్వక ఇలా సతాయిస్తూంటే ఎలా? తక్షణమే బ్రహ్మదగ్గరికి వెళ్ళి 'ఈ సావిత్రి పేరుని బ్యాన్ చేయమని అడిగి వస్తాను - లేకుంటే నాకు చచ్చే చావొచ్చేలా ఉంది'. అన్నారు యమధర్మరాజు.

యమభటులిద్దరూ ఒకరి మొహం వంక మరొకరు చూసుకొన్నారు.

జూన్ 21 పరుచూరి వెంకటేశ్వరరావు పుట్టిన రోజు సందర్భంగా...



# అరిచే కుక్క కరిచింది



(నాటిక)

**రచన: పరుచూరి బ్రదర్స్**

(తెర తొలిగింది. LIGHTS ON - ఒక మధ్య తరగతి ఇంటిహాలు, రేడియోలో భగవద్గీత వస్తోంది. స్నానం చేసి తల తుడుచుకుంటూ ప్రకాశరావు వచ్చాడు)

1995 జులై నెలలో జరిగిన తానా సభలలో ప్రదర్శించటం కోసం రాసిన నాటిక యిది. చికాగో, డెట్రాయిట్‌లలో ఆ నాడు ప్రదర్శించిన నాటికలో

| | | |
|---|---|---|
| ప్రకాశరావు | పాత్రను | పరుచూరి వెంకటేశ్వరరావు |
| వరలక్ష్మి | పాత్రను | రంజిత |
| బాలు | పాత్రను | శ్రీహరి |
| అప్పలస్వామి | పాత్రను | కోట శ్రీనివాసరావు |
| ఏడుకొండలు | పాత్రను | బాబూమోహన్ |
| సూర్యం | పాత్రను | పరుచూరి గోపాలకృష్ణ |
| ఎస్.ఐ. | పాత్రను | కృష్ణారావు |

పోషించారు. ప్రదర్శన సమయంలో తీసిన ఫొటోలలో క్లారిటీ లేకపోవడం వలన ఆ ఫొటోలకు బదులు ఆ బృందంలో కొందరు ఆ సందర్భంగా విదేశాలలో తీయించుకున్న ఇతర ఫొటోలను మాత్రం ప్రచురిస్తున్నాం. - ఎడిటర్

ప్రకా : లక్ష్మీ... వరలక్ష్మీ... నాగవరలక్ష్మీ... అనంతనాగవరలక్ష్మీ... వీరవెంకట అనంత నాగవరలక్ష్మీ...

వర : (చేతిలో గిన్నెతో, గరిటెతో వచ్చింది).

వర : (వస్తూ) వస్తున్నాగా... ఎందుకలా సాగదీస్తారు.

ప్రకా : కొండవీటి చాంతాడంత పేరుపెట్టుకుంది చాలక నేను సాగదీస్తున్నానంటావా? నీ పూర్తి పేరు పిలవడానికి నా ఆయుష్షు సగం అయిపోతోంది.

వర : (తాళి కళ్ళకద్దుకుని) అవేం మాటలండీ.

ప్రకా : తెలుగుమాటలు. (అనగానే భర్తను అలాగే చూస్తోంది) ఏంటా చూపు... నిన్నెలావున్నానో ఇవ్వాళా అలాగే వున్నా.... నిన్న ఎంత అప్పుందో ఇవాళ అంతే వుంది.

వర : (ఆశ్చర్యపోతూ) తల స్నానం చేశారా?

ప్రకా : ఇంటర్వెల్‌లో కలిసి సినిమాకొచ్చారా అని అడిగినట్టు తల తుడుచుకోవడం చూస్తూ స్నానం చేశారా ఏవిటే! కాఫీ ఇవ్వు.

వర : పచ్చడి తినకుండా ఈ రోజు పచ్చి మంచినీళ్ళు కూడా తాగడానికి వీల్లేదు....

ప్రకా : ఉగాది పచ్చడా?

వర : మీరు భలే కనిపెడతారే.

వర : కనిపెట్టడం ఏవిటే నీ బొంద.... ఉగాది రోజు తినేదాన్ని ఉగాది పచ్చడి అనకుండా ఊరగాయ తొక్కు అంటారా? అరచేతిలో పెట్టు. (అనగానే భర్త చేతిలో పెట్టి ఆతృతగా అడిగింది.)

వర : ఎలా వుందీ?

ప్రకా : ఏదో పెద్ద పుల్లారెడ్డి స్వీటు పెట్టినట్టు ఏవిటా ప్రశ్న? ఎక్కడ నీ కొడుకు?

వర : రాత్రి పడుకునే సరికి లేటయింది.

ప్రకా : నేను అడుగుతోంది రాత్రి సంగతి కాదు. సూర్యుడొచ్చిన తర్వాత సంగతి.

వర : పడుకునే వున్నాడు.

ప్రకా : ఇంకా పడుకున్నాడా? కడుపుతో వున్నప్పుడు నిద్రో నిద్రో అని అఘోరించావ్. ఇప్పుడా జబ్బు వీడికి వచ్చింది... వెళ్ళిలేపు.

వర : లేచి ఏం చేయాలీ?

ప్రకా : గాడిదలు కాయాలి.

వర : ఏం మాటలండి అవి... చదువుకున్న కొడుకును పట్టుకుని.

ప్రకా : చదువుకుంటే చాలదే.... ప్రయోజకుడవ్వాలి. మన వీధిలో యార్లగడ్డ వారున్నారే, వాళ్ళబ్బాయి యుగంధర్ వీడితోపాటు నా దగ్గర ఓనమాలు దిద్దాడు... ఇప్పుడు అమెరికాలో వున్నాట్ట.... నీ కొడుకో అమ్మకొంగు పట్టుకు తిరుగుతున్నాడు. పర్వతనేని గంగాధరమని ఎప్పుడూ మాష్టారూ... మాష్టారూ అని నా వెంట పడేవాడే, అతనిప్పుడు డెట్రాయిట్‌లో వున్నాడట. నీ కొడుకో? ఎప్పుడు డెకాయిట్ అవుతాడోనని హడిలిచస్తున్నా.

వర : అమెరికా అమెరికా అని నా పేరులాగా సాగదీయక్కర్లా. అయినా, అమెరికా అంటే మన దేశం కంటే వెనకబడ్డ దేశమేగా.

ప్రకా : ఏంటీ.... అమెరికా మనకంటే వెనకబడ్డ దేశమా? (అటు ఇటూ చూసి) ఎవ్వడూ విన్లేదుకదా.... అసలు నీ ఉద్దేశ్యంలో అమెరికా మనకంటే ఏ రకంగా వెనకబడ్డ దేశమే...?

వర : ఇండియా జనాభా ఎంత?

ప్రకా : ఎనభై కోట్లు.

వర : అమెరికా జనాభాఎంత?

ప్రకా : పన్నెండు కోట్లు.



శ్రీహరి, బాబూమోహన్, పరుచూరి బ్రదర్స్, రంజిత

వర : చూశారా... మనకంటే జనాభాలో 68 కోట్లు. ఒకటీ రెండూ కాదు. 68 కోట్లు తక్కువున్నారు. మరి వెనకపడ్డట్టు కాదా?

ప్రకా : ఇంతేనా ఇంకేమైనా పాయింట్లున్నాయా నీ దగ్గర?

వర : చాలావున్నాయ్.

ప్రకా : ఇంకొకటి వదులు.

వర : అమెరికాలో ఎన్ని రాజకీయ పార్టీలున్నాయి?

ప్రకా : రెండు, డెమోక్రట్లు... రిపబ్లికన్స్.....

వర : అదే మన దేశంలో - కాంగ్రెస్ (ఐ), కాంగ్రెస్ (ఎస్), కాంగ్రెస్ (జె), ఎస్‌జెపి, బిజెపి, బిఎస్‌పి, ఆర్‌ఎస్‌పి, సిపిఐ, సిపిఎం, సిపిఎం (ఎంఎల్) ముస్లిం లీగు, అకాలీదళ్, డిఎంకె, ఎడిఎంకె, పిఎంకె, జార్ఖండ్ మోర్చా, అస్సాం గణతంత్ర పరిషత్తు, తెలుగుదేశం..... లేటెస్టా టి.ఆర్.ఎస్., టి.పి.ఎస్., ఇంకా మట్టిమశానం పార్టీలన్నీ కలిపితే 92 పార్టీలు... అమెరికాలో రెండు... ఏదెక్కువ. (చెప్పి అలిసిపోగానే మంచినీళ్ళు ఇచ్చాడు ప్రకాశం)

ప్రకా : ఇంకా ఏమైనా వున్నాయా?

వర : ఇవాళ పన్నెండో తారీఖు కదా... ఇప్పుడు ఇండియాలో టైమెంత?

ప్రకా : పగలు ఎనిమిది గంటలు

వర : అమెరికాలో

ప్రకా: : రాత్రి ఎనిమిది గంటలు

వర : అంటే, మనకంటే పన్నెండు గంటలు వెనకున్నట్టేగా.

ప్రకా : జనాభా పెరగటం గొప్పకాదే, దానితో పాటు దరిద్రమూ పెరుగుతుంది. అలా మనం వెనకబడున్నాం. పుట్టగొడుగుల్లా పార్టీలు పెరగటం ప్రగతి కాదే, వాటితో పాటు కులతత్వాలు, మతద్వేషాలు, ప్రాంతీయ భేదాలు పెరిగాయి... ఆ రకంగా మనం వెనకబడున్నాం..... పన్నెండు గంటలు మనకన్నా వెలుగు వాళ్ళకి వెనక వస్తుందని సంబర పడటం కాదే, వాళ్ళకన్నా మనకి పన్నెండు గంటలముందే చీకటి వస్తుంది.... అది గుర్తుంచుకో?

(అంటుండగా అలారం మోగింది. ప్రకాశం అటు చూశాడు)

వర : బిడ్డ రాత్రి లేటుగా పడుకున్నాడనీ నేనే అలారం పెట్టా (నిక్కరు వేసుకుని, కళ్ళు మూసుకుని బాలు వచ్చాడు)

ప్రకా : బాబూ.... ఎదురుగా దెయ్యాలూ, భూతాలు లేవు. కన్నవాళ్ళే వున్నారు. కళ్ళు తెరువు.....



బాలు : (కళ్ళు తెరిచి) తెరిచాను.. ఏంలాభం.... మూడు రోజులుగా అప్లికేషన్ ఫారాలకి మూడొందలు కావాలని అడుగుతున్నా ఇవ్వచ్చుగా.

ప్రకా : లేవు.




బాలు : లేవు లేవు లేవు.... నీలాంటి పిసినారి తండ్రి కడుపున పుట్టడం నా ఖర్మ.

ప్రకా : నేను పిసినారినా... (భార్యతో) చూశావా.... ప్రభుత్వం నాకు ఉత్తమ ఉపాధ్యాయుడు బిరుదు ప్రదానం చేస్తే నీ కొడుకు, నామెడకు పిసినారి తండ్రి అని బోర్డు కట్టేశాడు. నేను పిసినారినా?

వర : అవునేమో కదా....

ప్రకా : ఆ....

వర : ఒరే.... మీ నాన్న నిన్ను మరీ

తీసి పడేస్తున్నారు గానీ, ఒకసారి చూపించరా.

ప్రకా : ఏవిటి చూపించేది... కత్తులా?

వర : కాదు కసరత్తులు

ప్రకా : కసరత్తులా

వర : ఆ చూడండి... నేత్రాలు తిరిగిపోతాయ్. మొదలెట్టరా.

బాలు : ముందు నువ్వు కొట్టవే.

ప్రకా : ఏవిటి కొబ్బరి కాయా? అదెందుకే దండగ.

వర : కొబ్బరికాయ కాదు... తలకాయ... (అంటూ బాలు తల మీద గరిటెతో కొట్టింది)

ప్రకా : ఆరెరెరె అదేవిటే... వాడికేమన్నా స్టార్టింగు ట్రబులా?

వర : వేరే చెప్పాలా? అన్నీ మీ పోలికలే వచ్చాయి వాడికీ....

ప్రకా : ఆ.... (బాలు జిమ్నాస్టిక్స్ మొదలెట్టాడు. చేస్తూ తండ్రిని ఫట్‌మని కొట్టాడు. సంతోషంతో వరలక్ష్మి "మానాయనే" అంటూ మెటికలు విరిచింది. రకరకాల విన్యాసాలు చేస్తు ఫైనల్‌గా - ఇంట్లోకొస్తున్న అప్పల స్వామిని ఫట్‌మని కాలితోతన్నాడు. అప్పలస్వామి అవతల పడ్డాడు. అతన్తోపాటు వచ్చిన ఏడుకొండలు ఆశ్చర్యంగా చూస్తుంటాడు.)

అప్ప : (లేస్తూ) ఏవయ్యా ప్రకాశం పంతులూ.... అప్పు తీసుకునేటప్పుడు కాళ్ళట్టేసుకున్నావ్.... అడగడానికొస్తే నీ కొడుకుచేత కాళ్ళతో తన్నిస్తావా? అప్పియ్యడమే కాదు... అవసరమైతే ఆరడుగుల మనిసినైనా అప్పడం నాగ నలిపేసి కొంపకు నిప్పెట్టేస్తాను.

ఏడు : కొచ్చినే లేదు.

వర : అయ్యయ్యో... మావాడు... కాలెత్తింది మిమ్మల్ని తన్నడానికి కాదూ... ఉద్యోగం లేదని తిడుతున్న తండ్రి ముందు విద్యలు ప్రదర్శిస్తున్నాడు....

ప్రకా : ఈ విద్యల్తో సర్కారు ఉద్యోగం రాదు. సర్కసు కంపెనీలో పని దొరుకుతుంది.

ఏడు : కొచ్చినేలేదు.

వర : అడ్డమైన వెధవలముందు ఏవిటా మాటలు.

అప్ప : అడ్డమైన వెధవలా? ఎవర్నిరా అంది... మనల్నా?

ఏడు : కొచ్చినే లేదు. (బాలు లోపలికెళ్ళిపోయాడు)

అప్ప : ఏవయ్యా ప్రకాశం పంతులూ, నీకు అప్పిచ్చినపాపానికి బుద్ధిలేని, సిగ్గులేని, శరీరంలేని, చీమూ నెత్తురూలేని ఎదవనాగ దినానికి మూడుతూర్లు నీ కొంపసుట్టూ నాను తిరగాలాయేటి? తిరపతికెళ్లి గుండుకొట్టించుకోకపోయినా పర్వానేదు గానీ, లడ్డు పెసాదం తినక పోతే పాపం అన్నట్టు, అసలివ్వక పోయినా నాకు కోపం రాదు గానీ వడ్డీ కట్టకపోతే కోపం వస్తది.... కొంపకు నిప్పెట్టేస్తాను.



పరుచూరి సోదరుల మధ్య బాబూమోహన్

ఏడు : కొచ్చినేలేదు.

అప్ప : ఏంటయ్యా ఇది.... వచ్చినప్పటి నుంచి నేనే మాట్లాతన్నా... నువ్వు మాత్రం నో టాకింగ్ ... (వరలక్ష్మి కత్తి, కూరగాయలు తీసుకుని వచ్చింది) రూపాయి విలువ పడిపోయినట్టు మీ ఆయనకి మాట పడిపోయిందేటి.

వర : ఆయన మనుషుల్తోనే మాట్టాడుతారు.

అప్ప : అంటే నేను జంతువునేట్రా?

ఏడు : కొచ్చినేలేదు.

అప్ప : నువ్వు నోర్మూయ్.... జంతువునేనమ్మా.... నాను జంతువునే... మీరు మనుషులైతే అణాపైసల్తో అప్పు తీర్చేసియ్యండి.

బాలు : (వస్తూ) తీర్చం అంటే.

అప్ప : కొంపకు నిప్పెట్టడం కాదు..... కోర్టుకెళ్తా.....

ఏడు : కొచ్చినేలేదు.

ప్రకా : వెళ్ళు.... వెళ్ళవయ్యా కోర్టుకి... ఏంటి బెదిరిస్తున్నావా? మాకేవన్నా భయమా? ఏ కోర్టుకెళ్తావ్... జిల్లా కోర్టుకా.... హైకోర్టుకా.... సుప్రీం కోర్టుకా... ఏ కోర్టుకెళ్తావో వెళ్ళు..... వెళ్ళవయ్యా చూద్దాం. (అంటూ లోపలకు వెళ్ళిపోయాడు).

అప్ప : (ఏడు కొండలతో) నోటిమాట మీదిచ్చిన అప్పేగానీ, నోటు రాసుకో లేదన్న ధైర్యంతో పంతులెట్టా రెచ్చిపోతున్నాడో చూసినావురా ఏడు కొండలూ..... రాంగ్ రూట్లో ఆయనొస్తే తక్కువ తిన్నది మనమేనేటి? రాజీపడి పోగలం... రాజకీయం మనకి తెలుసు.





ఏడు : కొచ్చినేలేదు.

అప్ప : ఏవమ్మా.... వరలక్ష్మమ్మా.... ఏంకూరగాయలూ.... క్యారెట్టా... ఓ హో... (తింటూ) క్యారెట్ ఆరోగ్యానికి చాలా మంచిదంట. మా పశువుల డాక్టరు.... ఛ ఛ మా పర్సనల్ డాక్టరు చెప్పేడు (అంటూ తింటున్నాడు)

బాలు : వచ్చిన ప్రతిసారీ దొరికిందే చాలన్నట్టు పచ్చిదా, పండుదా అని చూడకుండా కనిపించిన ప్రతి కాయగూరనీ తినేస్తున్నావ్... ఇంతవరకూ నీకివ్వాల్సిన వడ్డీకన్నా ఎక్కువే తినుంటావ్.

అప్ప : తినేసినాటి గురించి మాట్లాడతావేటి? మర్చిపోవాల.

బాలు : నీ అప్పు మేం కూడా తినేశాం. నువ్వు కూడా మర్చిపో.

అప్ప : అయ్యేం కుదరవ్.... నానూరుకోను. బాకీల కోసం

బజార్లో ఒక రౌండేసొస్తా.... డబ్బు రెడీ చెయ్యండి... లేకపోతే నాకు మాచెడ్డ కోపం వస్తది... కోపం వస్తే నాను కొంపకు నిప్పెట్టేస్తాను.
ఏడు : కొచ్చినేలేదు.
(అంటూ ఇద్దరూ వెళ్ళిపోయారు)
ఓ.బి. : దగాపడిన తమ్ములారా ఏడవకండేడవకండేడవకండి.... వస్తున్నా యొస్తునాయొస్తున్నాయి.... జగన్నాధ రథచక్రా లొస్తున్నాయి.... (అని వినపడింది)
బాలు : అమ్మో సూర్యం బాబాయ్.... (అంటూ చాపతీసి చుట్టగా చుట్టి అందులో కూర్చున్నాడు)
వర : నేనూ దొరకను బాబోయ్... (అంటూ తనూ వెళ్ళి ఇంకోచోట దాక్కుంది.)
(సూర్యం వచ్చాడు. ఒంటి మీద ఎర్రశాలువా, తెల్ల డ్రెస్సూ వేసుకుని వున్నాడు)
సూర్యం: ఏవయ్యారబ్బా... వీళ్ళు? అన్నయ్యా....
ఓ.బి. : బెడ్‌రూంలో వున్నా.
సూర్యం: వదినా
ఓ.బి. : వంట గదిలో వున్నా.
సూర్యం: బాలూ....
ఓ.బి. : ఇంటర్వ్యూకి ప్రిపేర్ అవుతున్నా.
సూర్యం: ఇండియాలో ఎవడిపని వాడు చేసుకోడు. ఎదుటివాణ్ణి చేసుకోనివ్వడు అంటారు. ఇదేవిటబ్బా.... ఎవడి పన్లో వాడున్నాడు. (అంటూ కదులుతున్న చాప పట్టుకుని, చాటునున్న వదినని గమనించి మెల్లగా వెళ్ళి చాప తీసేశాడు.) (అమ్మో అని మళ్ళీ పారిపోతుంటే) రేయ్.... ఎందుకర్రా నన్ను చూసి అందరూ ఇలా పారిపోతారు... దాక్కుంటారు.
బాలు : నువ్వు కొట్టే కమ్యూనిస్టు సుత్తి వినలేక,
వర : (వస్తూ) ఒక ముక్క అర్థమై చావదు గనక.
సూర్యం: అర్థం కాకపోవడానికి ఇందులో ఏముందొదినా. కనురెప్ప కిందికి దిగితే వినయం... పైకి లేస్తే విప్లవం... రెప్పపాటు దూరంలో దోపిడీ జరిగిపోతోంది.
వర : అంటే....
సూర్యం: అంటే - భయపడి కళ్ళు దించితే కాపిటలిస్టు బలి చక్రవర్తిని తొక్కినట్టు పాతాళానికి తొక్కేస్తాడు... తలపైకెత్తి "ఏంటీ" అంటే తనే భయపడతాడు. అందుకే రెప్పపాటు దూరంలో దోపిడీ జరిగిపోతోందన్నాను.
వర : ఏవిటో కూరలో ఉప్పు తక్కువైనట్టు నువ్వు చెప్పిన మాటలో ఏదో తక్కువయిందయ్యా మరిదీ....
బాలు : బాబాయ్.... నీ సిద్ధాంతాన్ని విమర్శించనుగానీ, నిజంగా నువ్వు చెప్పే కమ్యూనిజమే గొప్పదయితే రష్యాలో, తూర్పు ఐరోపా దేశాల్లో ఎందుకని ముక్కలైంది?
సూర్యం: మనిషికి కావలసింది తిండి... స్వేచ్ఛ.... కమ్యూనిస్టు దేశంలో తిండి దొరుకుతుంది. స్వేచ్ఛ దొరకదు.
సూర్యం: మనదేశంలో తిండి లేదు... స్వేచ్ఛవుంది. మామూలు స్వేచ్ఛకాదు... నడిరోడ్డు మీద మనిషిని నరికి చంపే స్వేచ్ఛ.... అలానరికి చంపిన వాడు ఎన్నికల్లో నిలబడే స్వేచ్ఛ. మానభంగం చేసినవాడు కూడా మండలాధ్యక్షుడయ్యే స్వేచ్ఛ.
ప్రకా : (వస్తూ) ఇండియాలో మరో స్వేచ్ఛ కూడా వుందిరా.



పరుచూరి వెంకటేశ్వరరావు, రంజిత, గోపాలకృష్ణ, శ్రీహరి

మొగుడు సంపాదిస్తే పెళ్ళాం తినటం, తండ్రిని కాలరు పట్టుకుని కొడుకులు ఫీజులు వసూలు చెయ్యటం.
వర : ఎవరు కట్టుకోమన్నారు?
బాలు : ఎవరు కనమన్నారు?
ప్రకా : చూశావురా, ఇండియాలో ఇంటిపెద్ద ఈజ్ ఈక్వల్‌టూ ఒంటెద్దు.
సూర్యం: అదే మా కమ్యూనిస్టు గవర్నమెంట్ వస్తే ప్రతివాడూ ఒళ్ళు వంచి పని చెయ్యవలసిందే.
ప్రకా : కమ్యూనిస్టు గవర్నమెంటా... అసంభవం... ఈ దేశంలో విప్లవం కుక్కలాంటిది... అది అరుస్తుంది గానీ కరవదు.
సూర్యం: కరిచే రోజొస్తుంది. (అంటూ వెళ్ళిపోయాడు)
ప్రకా : ఎప్పుడ్రా వచ్చేది... డబ్బులు ఖర్చుపెట్టి వీణ్ణి డబుల్ ఎం.ఎ. చదివించా... ఉద్యోగం దొరికిందా? లేదు.... ఆ డబ్బుతో అప్పుడే ఏ ఆవునో, గేదెనో కొనుక్కుని దాన్ని నమ్ముకుని వున్నా ఈ పాటికి కాలుమీద కాలేసుకుని దర్జాగా కూర్చునుండే వాణ్ణి.... ఈ అప్రయోజకుడ్ని నమ్ముకుని అప్పుల పాలైపోయాను.
బాలు : అమ్మా... (అని గట్టిగా అరిచాడు)
వర : ఏవయ్యిందిరా?



బాలు : శిశుపాలుడికి శ్రీకృష్ణుడు ఎన్ని ఛాన్సులిచ్చాడు?

వర : వంద

బాలు : నన్ను ఈయన పనికిరాని వెధవ, సన్నాసి, అప్రయోజకుడు అని ఇప్పటికి వెయ్యిసార్లు తిట్టాడు.

ప్రకా : ఇంకో వెయ్యిసార్లు అంటా ఏం చేస్తావ్... ఇష్టం వచ్చినట్టు తిడతా... నువ్వొక యూజ్‌లెస్ ఫెలోవి... అప్రయోజకుడివి... తండ్రి సంపాదన మీద పడి బతికే బడుద్ధాయివి. బద్ధకిష్టువి. బతకడం చేతకాని చవటవి.. చట్టుబండవి.

బాలు : నాన్నా....

ప్రకా : అరుస్తావేంట్రా... కరుస్తావా? మాట్లాడవేం? ఏం చేస్తావ్?

బాలు : మర్డరు చేస్తా.

వర : (తాళిని కళ్ళకద్దుకని) అయ్యో అయ్యో ఇదేం పోయేకాలం?. తండ్రిని ఎవరైనా మర్డరు చేస్తారా? తప్పు.... చెంపలేసుకో.

బాలు : అబ్బ... నేను చంపుతానన్నది ఆయన్ని కాదు.

వర : మరి...

బాలు : ఎవడు కనిపిస్తే వాణ్ణి

ప్రకా : చంపి....

బాలు : జైలుకెళ్తా.

ప్రకా : వెళ్ళి.

బాలు : జైల్లో ఫ్రీ ఫుడ్డు విత్‌కోడి గుడ్డు తింటా, గంటకొట్టి తూకం వేసి మరీ పెడతారు. లైపు పడాలే గానీ, లైఫే మారిపోతుంది. ఇక్కడ తిట్లు చీవాట్లు తినేకన్నా జైల్లో గుడ్డు తిని పాలు తాగడమే బెటరు.

ప్రకా : వెళ్ళరా వెళ్ళు....

బాలు : నాన్నా నన్ను రెచ్చగొడుతున్నావ్....

ప్రకా : అంత రెచ్చిపోయే వాడివే అయితే (కత్తి తెచ్చిచ్చి) తీసుకో... తీసుకోరా.. వెళ్ళి చంపు....

వర : అయ్యయ్యో అదేవిటండీ...

ప్రకా : నువ్వూర్కో... వెళ్ళరా.... వెళ్ళి చంపిరా.. చంపడం అంటే తల్లిదగ్గర కూర్చుని సొరకాయలు కొయ్యడం కాదు... సర్కసు చెయ్యడం కాదు. వెళ్ళరా.....

బాలు : వెళ్తున్నా.... అమ్మాకొట్టవే....

వర : అయ్యో వద్దురా....

బాలు : నువ్వు కొట్టవే నేను చెప్తా.... (అంటుంటే ప్రకాశరావు ఫట్ అని బాలు తలమీద కొట్టాడు.... పెద్దగా కేక పెడుతూ వెళ్ళాడు బాలు స్పీడుగా)...

వర : అయ్యయ్యో... వాడెళ్ళిపోతున్నాడండీ... అన్నంత పని చేస్తాడేమో...

ప్రకా : ఏవిటే వాడు చేసేది... అరగంటయ్యాక ఆకలేసి వాడే ఇంటికొస్తాడు... నువ్వేం కంగారు....
(అంటుంటే బయట ఒక వెర్రికేక వినిపించింది. ఆశ్చర్య పోయి చూస్తున్నారిద్దరూ. చేతిలో కత్తితో, రక్తంతో బాలు వచ్చాడు.)

వర : రేయ్ బాలూ.... ఏవిట్రా ఈ రక్తం....

ప్రకా : రక్తమా పాడా, హత్య చేసినట్టు బిల్డప్ ఇవ్వడానికి రంగు పూసుకొచ్చుంటాడు.

బాలు : రంగు కాదు ప్రకాశం పంతులుగారూ.... రక్తం... మనిషి రక్తం ... మర్డర్ చేశా... ఎస్ ... మర్డర్ చేశా...

ప్రకా : బాలూ...

బాలు : అడిగింది ఇచ్చే అలవాటు నీకు లేక పోయినా చెప్పింది చేసే ధైర్యం వుంది నాకు.

వర : ఎవర్ని చంపావురా

బాలు : ఎవడో అడ్రసు తెలీదు.... బయటకెళ్ళగానే కనిపించాడు...చక్ అని కత్తితీశాను. కసక్కని పొడిచాను. ఢమాల్ అని చచ్చాడు. వాడెవడైతే మనకేంటి మర్డర్ జరిగిపోయింది. నువ్వు తొందరగా



శ్రీహరి, బాబూమోహన్, పరుచూరి గోపాలకృష్ణ, తదితరులు

సొరకాయ పప్పు నెయ్యి వేసి అన్నం పెట్టు. జైలు కెళ్తే మళ్ళీ నీ వంట తింటానో తిననో.... పైగా పోలీసులు కూడా వచ్చేస్తారు... తొందరగా పెట్టు.... (ఎస్.ఐ. వచ్చాడు.)

వర : బాబూ ఎస్.ఐ. గారూ... వాడొట్టి అమాయకుడు... వాణ్ణి వది లెయ్యండి... తండ్రేదో కోపంతో తిట్టాడని ఇంత పని చేశాడు అంతే....

బాలు : అబ్బ నువ్వు కాసేపు ఊరుకోవే... ఎస్.ఐ.... గారు నేను కావాలనే ఈ హత్య చేశాను.

ప్రకా : ఒరే బాలూ....

బాలు : ఏం... నేను హాయిగా బతకడం నీకు ఇష్టం లేదా? ఎస్.ఐ. గారు హంతకుణ్ణి ఎదురుగా పెట్టుకుని అలా నిలబడి పోయారేంటి... వెయ్యండి సంకెళ్ళు.... చెయ్యండి అరెస్టు.... తీసుకెళ్ళండి జైలుకి.

ఎస్.ఐ. : మేం వచ్చింది నిన్ను అరెస్టు చెయ్యడానికి కాదు.... అవార్డు యివ్వడానికి (ప్రకాశం, బాలు ఆశ్చర్యపోయారు).

వర : అవార్డా....

ఎస్.ఐ. : మీ అబ్బాయి చంపింది సామాన్యమైన వ్యక్తిని కాదు... వాంటెడ్ పర్సన్‌ని. అతన్ని ప్రాణాలతో అప్పజెప్పినా, చంపినా లక్ష రూపాయలిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. హెడ్డు మీద లక్ష రూపాయిలున్న తీవ్రవాది అతను. వాణ్ణి చంపి మీ అబ్బాయి లక్ష కొట్టేశాడు. ఇదిగోనయ్యా లక్ష రూపాయల చెక్కు (అంటూ చెక్కిచ్చాడు. చూసుకుని ఆశ్చర్యపోతుంటే)

వర : ఏవిటీ.... లక్ష రూపాయలా.... చూశారా.... నూటికి పదిసార్లు నోటికొచ్చినట్టు తిట్టేవారు. ఇప్పుడెంత ఘనకార్యం చేశాడో చూడండి. ముప్పయేళ్ళు ఉద్యోగం వెలగబెట్టి మీరు పాతిక వేలు అప్పు మిగిలిస్తే, మూడు నిమిషాల్లో నా బిడ్డ లక్ష రూపాయలు సంపాదించాడు
(అంటూ మెటికలు విరిచింది)

ఎస్.ఐ. : ఎనీహౌ - కంగ్రాట్యులేషన్స్ ... మిస్టర్...

బాలు : బాలు....

(లైట్స్ ఆఫ్)

**(తరువాయి వచ్చే సంచికలో)**

జూన్ 19 జంధ్యాల వర్ధంతి సందర్భంగా....

# అతని ఇంటి పేరు జంధ్యాల అసలు పేరు స్నేహం...

-ఆదివిష్ణు

ఇప్పటి మాట కాదు.

చాలా ఏళ్ల క్రితం... ఫలానా సంవత్సరమని ఖచ్చితంగా చెప్పలేను... అప్పట్లో-

జంధ్యాల విజయవాడలో కాలేజీ స్టూడెంటు.

శ్రీరామా బుక్ డిపో దగ్గర కనిపించాడు. అప్పట్లో అతని చెవిలో పూలు లేక పోయినా - చెవికి పోగులున్నట్టు జ్ఞాపకం!

నేను ఫలానా అని తెలీగానే - నన్ను అమాంతం కావిలించుకున్నాడు. మీరు నా అభిమాన రచయిత అన్నాడు. ఈ మాట అప్పట్లో నాతో ఎక్కువ మంది అనే వారు కాదు!

అతను అంతమాటన్నందుకు - బహుశా - గొప్పగా ఆనందించి వుంటాను. అంచేత అతనంటే యిష్టం ఏర్పడి వుండచ్చు!

మా పరిచయం స్నేహంగా మారేందుకు ఎక్కువకాలం పట్టలేదు. ఆ స్నేహం ఎక్కువ కాలం - మూడు దశాబ్దాలకు పైగా బతికింది!

ఇప్పుడు సీను మారింది!

అతను అక్కడెక్కడో వున్నాడు. నేను ఇంకా ఇక్కడే వున్నాను! అయినా - నేను చూచే ప్రతి నవ్వులోనూ అతను కనిపిస్తున్నాడు! హాయిగా పలకరిస్తున్నాడు!

వదిలేయండి!

చిన్న వయస్సులోనే అతని హోదా సరపతి గొప్పగా పెరిగేయి. రచయితగా సినీ దర్శకుడిగా అతను పెద్దపీట మీద కూచున్నా - అతను నన్ను ఏనాడు మరిచిపోలేదు! నా అభిమాన రచయిత ఛార్లెస్ లూయిసనో, క్లిఫ్ మార్టిన్ అనో అతను చెప్పలేదు. ఎప్పుడు ఏ సభలో చెప్పినా - అతని అభిమాన రచయితగా నా పేరు చెప్పి నన్ను గౌరవించేవాడు! రచయితగా అంతో యింతో పేరు తెచ్చుకున్నానంటె ఆదివిష్ణు అక్షరాలే కారణమని చెప్పేవాడు! ఇల్లాంటి సందర్భాల్లో నాకు కన్నీరుబికేది! మనిషికి ఆనందం ఎక్కువైనా కన్నీళ్లే వస్తాయని శాస్త్రం!

ఇది కూడా వదిలేయండి!

ఒక వ్యక్తికి సడన్‌గా హోదా పెరిగిపోతే కళ్లు నెత్తిమీదుంటాయని రూలు! ఆ హోదా కన్న తండ్రిని కూడా కాల్తో కొడుతుంది! తండ్రి తాపీమేస్త్రీ. ఆ వృత్తిలో వుండి రెక్కలు ముక్కలు చేసుకుని కన్నబిడ్డని కష్టపడి చదివించి ప్రయోజకుడ్ని చేస్తాడు. ఈ చిరంజీవి సింహాసనం ఎక్కంగానే ఆ తాపీమేస్త్రీ తెరమరగవుతాడు! మీ జన్మవృత్తాంతం చెప్పమని సదరు చిరంజీవిని ఎవరైనా అడిగినప్పుడు - మా తండ్రి గారు తాసిల్దారని చెబుతాడే గాని - తాపీ మేస్త్రీ అని నిజం చెప్పుకునేందుకు నిరాకరిస్తాడు! ఈ దిక్కుమాలిన రోజుల్లో ఈ టైపు జాతి పురుషులు మన మధ్య ఎక్కువ సంఖ్యలో బతుకుతున్నారు!

విషయానికొస్తాను!

నా వల్ల - యస్ - కేవలం నా వల్ల - అతనికి పరిచయమై - చిత్ర పరిశ్రమలో అతని దయవల్ల పట్టు సంపాయించుకున్న నటులు కొందరు - ఇప్పుడు నా పేరేమిటని నన్నే అడుగుతున్నారు!

అట్లా అడిగేరోజు తప్పకుండా వస్తుందని జంధ్యాల నాకు ముందే చెప్పేడు! జంధ్యాల మహాజ్ఞాని! స్నేహానికి అతనే సరైన నిర్వచనం!

విజయవాడ యస్సారార్ కాలేజీలో జంధ్యాల బి.కాం. చదువుతుండే వాడు. అతన్తోపాటు అశ్వనీదత్తు, సుత్తి వీరభద్రరావు, సుబ్బరాయశర్మ, విన్నకోట విజయరాం, మాధవపెద్ది రమేష్, ఎం.వి.రఘు, ఎం.సి.దాసు వగైరా మిత్రులు ఆ కాలేజీలోనే చదువుతుండేవారు!

ఆ రోజుల్లో నేను 'వాంటెడ్ ఫాదర్స్' అనే హాస్య నాటికను రాసేను. ఆ నాటికను జంధ్యాల అండ్ కో వాళ్ల కాలేజీలో ప్రదర్శించేరు. ఆ నాటికలో జంధ్యాల ప్రధాన పాత్రధారి. అతని పూర్తి పేరు - అతని కీర్తికి మల్లె - చాలా పెద్దది! అక్షరం తేడాలేకుండా అంత పెద్ద పేరు నేనిప్పటికీ చెప్పలేను. అంచేత మా పరిచయమైన కొత్త రోజుల్లో అతన్ని శాస్త్రీ అంటూ పిలిచి - ఆ తర్వాతర్వాత జంధ్యాల అని పిలవడం అలవాటు చేసుకున్నాను!



వయస్సు పరంగా జంధ్యాల కంటే నేను పెద్దవాడ్ని. అందువల్ల జంధ్యాల కంటె ముందుగానే నేను సినీ పరిశ్రమలో రచయితగా అడుగు పెట్టాను. నాకంటే ముందుండాలని పంతం పట్టేడో ఏమో - అందుకే నాకంటే ముందు పోయేడు!

మా మిత్రవర్గంలో అతి సన్నిహితుడు వీరభద్రుడు (సుత్తి). 'చూపులు కలిసిన శుభవేళ' అనే మా సినిమాలో వాడు చాలా మంచి వేషం చేసేడు. ఆ షూటింగులో వాడి కాలికి దెబ్బ తగిలింది. అసలే షుగర్ వ్యాధి జాస్తిగా వున్నవాడు. దానికితోడు కాలికిదెబ్బ. ఆ దెబ్బ కారణంగా వీరభద్రుడు మదరాసులో కాలం చేసేడు!

అప్పుడు నేనూ జంధ్యాలా హైదరాబాదులోనే షూటింగ్ హడావిడిలో వున్నాం. వీరభద్రుడి మరణవార్త నాకు తెలీదు. తెలిసిన జంధ్యాల అసలు విషయం దాచి - మనం మదరాసు వెడుతున్నామని మా యింటికి ఫోన్ చేసేడు. ఎందుకని అడగలేదు. ఎప్పుడు వెడుతున్నామని అడిగేను. ఇప్పుడే - మార్నింగు ఫ్లయిటులో - అన్నాడు.

ఎయిర్‌పోర్టులో అసలు విషయం చెప్పేడు. ముందే చెప్పొచ్చుగా అన్నాను. విని తట్టుకోలేవని చెప్పలేదన్నాడు. అల్లాంటి వార్తలు వినేప్పుడు నీ పక్కన నేనుండాలి అన్నాడు!

విచిత్రం - అతను పోయిన వార్త మిత్రుడు పూసలద్వారా విని ఎట్లా తట్టుకోగలిగేనో?

మరో మిత్రుడు విన్నకోట విజయరాం ఆ మధ్య హైదరాబాదులోనే పోయేడు. అప్పుడు కూడా జంధ్యాలే నాకు సాయంగా వుండి - ఆ యింటికి తీసుకెళ్లేడు. నాకంటే చిన్నవాళ్లు నాకంటె ముందు పోవడమేమిటయ్యా అని జంధ్యాలను అడిగేను. మాయ అన్నాడు. ఆ మాయలో తర్వాత వంతు అతన్దే అయ్యింది - జూన్ పందొమ్మిది!

రైలు కళానిలయంలో పెద్దఎత్తున హాస్యోత్సవం జంధ్యాల నిర్వహణలో జరిగింది. హాస్యానికి సంబంధించిన నటీనటులు రచయితలు ఆ ఉత్సవంలో పాల్గొన్నారు. ఇంచుమించు అందరూ జంధ్యాలకి ఆత్మీయులే. అందులో నేనూ వున్నాను. ఆ రోజు ఆ వేదికమీద రామానాయుడు గారికి సన్మానం జరిగింది. ఆ సభలో రామానాయుడుగారు తాను నిర్మించిన 'అహ నా పెళ్లంట' చిత్రాన్ని బాగా మెచ్చుకున్నారు. ఆ కథకి రచయితను నేను. దర్శకుడు జంధ్యాల. మా ఇద్దర్నీ నాయుడుగారు ప్రత్యేకంగా అభినందించేరు! వందన సమర్పణ సమయంలో జంధ్యాల నన్ను వేదిక వెనక్కి తీసుకెళ్లేడు. అక్కడ మేమిద్దరమే వున్నాం. సిగరెట్టివ్వమన్నాడు. నీ దగ్గర లేదా అన్నాను. అవన్నీ అడక్కు గురూ - ముందు సిగరెట్టు పని చూడు అన్నాడు. సిగరెట్టివ్వబోతుంటే కాల్చివ్వు అన్నాడు.

మా పరిచయమైన కొత్త రోజుల్లో - నేను సిగరెట్టు ముట్టించి అతనికివ్వడమో, అతను కాల్చి నాకివ్వడమో జరిగేది. ఒకే సిగరెట్టుని ఇద్దరం కాల్చుకునే వాళ్లం. చాలాకాలం తర్వాత మళ్లా ఇప్పుడు! ఎన్నేళ్లకెన్నేళ్లకని ఆశ్చర్యపోతూ - సిగరెట్టు ముట్టించేను. రెండు దమ్ములాగి అతనికిచ్చేను. అతను కూడా అదే పని చేసి నాకిచ్చేడు. ఒకటే సిగరెట్టు. దమ్ములవారీగా కాల్చుకున్నాం...!

ఆ ఫీటు నడుస్తుండగా అతనికో సారి నేను చెప్పిన ఫలానా కథ ఏమైందని అడిగేడు. నా దగ్గిరేవుందన్నాను. ఆ కథ - మునుపు మేము చేసిన కథల్లాగా పచ్చి కామెడీ కథ. అందులో అన్నీ కామెడీ పాత్రలే. ఒక చిన్నవాడూ చిన్నదీ - హీరో హీరోయిన్లు. ఆ రెండు పాత్రలకీ కొత్త వాళ్లని పెట్టి - మిగతా పాత్రలన్నిటికీ మన కామెడీ బేచ్‌ని పెట్టేసుకుంటే - మళ్లా 'అహ నా పెళ్లంట' మాదిరి అదరహ అన్నాడు!

'అహ నా పెళ్లంట' కథని రామానాయుడుగారికి నేనే చెప్పేను. కనక -ఈ కథని కూడా ఆయనకి నన్నే చెప్పమన్నాడు. రామానాయుడుగారికి నేను కొత్త కథ చెప్పకముందే - జంధ్యాల తొందరపడి తన కథ ముగించుకున్నాడు!

నవ్వుల్లో రకాలున్నాయి. మధ్యతరగతి మందహాసమంటే మాకెంతో యిష్టం. నవ్వడం ఒక భోగం - నవ్వించడం ఒక యోగం - నవ్వకపోవడం ఒక రోగం! ఇదొక సూక్తి. నవ్విస్తూనే చక్రం తిప్పిన చాప్లిన్ - హిట్లరు నిరంకుశత్వాన్ని తన సినీమాల ద్వారా నరికి పోగులు పెట్టేడు. అంచేత నవ్వుకున్న పవరు నవ్వులాట కానే కాదు. ఈ విద్యలో జంధ్యాల ఆరితేరినవాడు!

'హైహైనాయకా' అనే మా సినీమాలో టైటిల్స్ మీద ఆ చిత్రంలోని 'గురువంటే గుండ్రాయి కాదు' అనే పాటనే వేసేడు జంధ్యాల. టైటిల్స్‌లో నా పేరు వచ్చినప్పుడు 'గురువంటే గుండ్రాయి కాదు' అనే పలుకు వినిపించేలా శ్రద్ధ తీసుకున్నాడు. దటీజ్ జంధ్యాల!

ఎం.ఎస్.రెడ్డి గారికి ఒక సినిమా చేయాల్సి వచ్చింది. ఆ సినిమా షూటింగు కార్యక్రమం యావత్తూ కేవలం 24 గంటల్లో పూర్తయ్యేలా ప్లాన్ చేసుకున్నాం. అందుకు అనువుగా వుండే కథని తయారు చేసేను. ఆ కథ రెడ్డిగారికి బాగా నచ్చింది. మా ఇద్దరికీ అడ్వాన్సులు కూడా యిచ్చేరు. కారణాంతరాల వల్ల ఆ ప్రాజెక్టు వాయిదా పడింది. ఇప్పుడు మొదలెట్టాలంటే జంధ్యాల లేడు...'

ఒక మళయాళీ సినిమా చూడటానికి మేమిద్దరం త్రివేండ్రం వెళ్లేం. అది ఆదివారం. ఆ ఊళ్లో తెలుగువాళ్లు చాలామంది వున్నారని జంధ్యాలే చెప్పేడు. ఎట్లా కలుసుకోడం అని అడిగేను. సింపులన్నాడు. ఆ సింపులే చెప్పమన్నాను. అతను చెప్పడం ప్రారంభించేడు-

మెయిన్ రోడ్డు మీద నడుద్దాం. సిగ్గువిడిచి నువ్వు హరిశ్చంద్ర పద్యాలు గట్టిగా పాడు. తెలుగువాడెవడైనా వింటే మళయాళీ గడ్డమీద తెలుగు పద్యమేమిటని ఆగిపోతాడు. ఆగినవాడ్ని పట్టుకుంటే - అక్కడున్న తెలుగువాళ్లని అతనే పరిచయం చేస్తాడని చక్కటి ఉపాయం ఉపదేశించేడు!

ఉపాయం బాగానే వుంది గానీ ఆ పాడే పద్యమేదో నువ్వే పాడచ్చు గదా అని అడిగేను. ఇల్లాంటి సందర్భాల్లో తన గొంతు సూటవదన్నాడు. నా గొంతు బాగా పని చేస్తుందన్నాడు. గళం విప్పితే వినే వాళ్లు గడగడా వణికి ఛస్తారన్నాడు. అంత చెప్పింతర్వాత అతని మాట కాదనలేక - ఆ ముచ్చటేదో చూద్దామనే కోరికతో - 'ఇచ్ఛోటనే' అనే పద్యాన్ని త్రివేండ్రం

మిత్రులంటే జంధ్యాలకు ప్రాణం. తను కట్టుకున్న ఇంటి గృహ ప్రవేశానికి ఆహ్వానిస్తూ తన మిత్రులకు జంధ్యాల పంపిన ఇన్విటేషన్ ఇది

శుభమస్తు!

శ్రీ ... వారికి

ప్రేమలేఖ!

84, కామ్‌దార్‌నగర్, మద్రాస్-34 అనే ఇంటితో గత సంవత్సరం నాకు 'చూపులు కలిసిన శుభవేళ'. ఆ ఇల్లు నాతో 'నీకూ నాకూ పెళ్లంట!' అన్న క్షణాన, 'నెలవంక' సాక్షిగా ఇంత త్వరగా నేను 'అహ నా పెళ్లంట!' అని ఆనందంగా చెప్పుకోగలనని ఊహించలేదు.

'ముద్దమందారం' లాంటి ఆ ఇంటి నిర్మాణం పూర్తయిన సందర్భంగా పెద్దలు నన్ను ఓ ఇంటివాణ్ణి చేసే 'మూడు ముళ్ళ' ముహూర్తాన్ని ఫిబ్రవరి 15, 1989 ఉదయం 8-27 ని॥లకు నిర్ణయించారు.

'హైహై నాయకా!' అంటూ ఆ జగన్నాటక కర్తను స్తుతిస్తూ మేం గృహ ప్రవేశం చేసే ఆ ముహూర్త సమయానికి మీరు సకుటుంబంగా, మీ 'చంటబ్బాయ్'లతో సహా విచ్చేసి మా 'మొగుడు పెళ్ళాల'ను, మా 'చిన్ని మల్లెపందిరి'ని ఆశీర్వదించి, ఆ 'ఆనందభైరవి' రాగాలాపనలో పాలు పంచుకొని ఈ 'నాలుగు స్తంభాలాట'ను శుభప్రదం చెయ్యాలని ప్రార్థిస్తున్నాను

భవదీయ

జంధ్యాల

స్థలం- 84, కామ్‌దార్‌నగర్, మద్రాస్-34 ఫోన్ - 869488

సమయం. ఉదయం 8-27 ని॥లకు 15, ఫిబ్రవరి 1989

'వివాహ భోజనంబు' - మధ్యాహ్నం 12 గంటల నుండి-

మెయిన్‌రోడ్ మీద తిప్పి తిప్పి పాడేను. భాష అర్థంగాని మళయాళీలు కన్నీరెట్టుకున్నారే గానీ - తెలుగువాళ్లకి ఆ అదృష్టం లభించలేదు. కడు చమత్కారి జంధ్యాల!

'ఆపద్బాంధవుడు' సినిమాలో జంధ్యాల వేషం కట్టేడు. కవిగారి వేషం. తాను రాసిన కావ్యాన్ని తనకిష్టమైన వ్యక్తికి అంకితమిచ్చి ఆ సినిమాలో ప్రాణాలు విడిచేడు! తర్వాత జరిగింది కూడా అదే! అతను సృష్టించిన నవ్వుల్ని తెలుగుజాతికి అంకితం చేసి సెలవు తీసుకున్నాడు.

అతని సినిమాలు ఎంచక్కా అతనే రాసుకోవచ్చు.

కొన్ని నా చేత రాయించుకున్నాడు!

అయ్ లవ్ యువర్ రైటింగ్స్ అనేవాడు!

ఆ మాటే సభల్లో చెప్పేవాడు!

జంధ్యాలతో కథా చర్చలు కళాత్మకంగా వుండేవి. అది హైదరాబాదు కావచ్చు. అమలాపురం కావచ్చు. ఏ ఊళ్లో వున్నామో తెలిసేది కాదు!

అతనూ నేనూ ప్లస్ అసోసియేట్ డైరెక్టరు. మా ముగ్గుర్తో పాటు టేపు రికార్డరు! ఇనఫ్! అనగనగా అనేవాడ్ని. ఆ తర్వాత అనేవాడు. ఈ విధంగా కథ సాగేది. అక్కడికక్కడే డైలాగులు కూడా వచ్చేవి. నవ్వులు సరేసరి! అతన్ని చూస్తే నేను - నన్ను చూస్తే అతను రెచ్చిపోయేవాళ్లం!

సాయంత్రం ఆరింటికి ప్రారంభమైన కథ తెల్లవారుతుండగా పూర్తయ్యేది. కాగితాలూ కలాలూ దూరంగా వుంచడం వల్ల - గుండెల్లో సుళ్లు తిరుగుతున్న హాస్య తరంగాలు రికార్డయ్యేవి! ఆ మరుసటి రోజు సిట్టింగులో టేపుని వినేవాళ్లం. ఎక్కడ పండిందీ ఎక్కడ ఎండిందీ చూసుకునే వాళ్లం. అనువైన సవరణలు మరో టేపులో చెప్పుకునే వాళ్లం! కథ పూర్తయ్యేది!

మా టేపులు విన్న ఒక పెద్దాయన - ఇంత ఈజీగా ఎంతో హాయిగా హాస్యం ఎట్లా చెప్పగలుగుతున్నారని అడిగినప్పుడు మొహమొహాలు చూసుకున్నాం!

అతను మాదిరి నేను పూర్తిగా సినిమాలకు అంకితమైన మనిషిని కాను. ఆర్టీసిలో ఒకానొక శాఖకు ప్రధాన అధికారిగా వుండే వాడిని. డ్యూయెల్ రోల్. అక్కడోకాలు. ఇక్కడో కాలు. ఉద్యోగం వదిలి వచ్చేయనా అని అడిగితే వద్దొద్దనే వాడు. మా నాన్న బతికున్న రోజుల్లో - ఆయనకూడా అదే అనే వాడు. ఈ ఇద్దరూ ఎందుకట్లా అన్నారో యిప్పుడర్థమవుతోంది! నాకేమి అర్థమైందో చెప్పను! వదిలేయండి!

**జంధ్యాల నాకంటికి శ్రీకృష్ణదేవరాయల్లాగా కనిపించే వాడు!**

**అప్పుడప్పుడు భోజరాజనిపించేవాడు!**

**అతని సభలో నేనెవడ్నో అప్పుడు తెలీలేదు!**

**ఇప్పుడు తెలుసుకుందామనుకుంటే-**

**అతను లేడు!**

## ఇష్టసుత్తి

**'ఆనందభైరవి' సినిమాలో వీరభద్రరావు పాత్రకి ఓ విచిత్రమైన మేనరిజాన్ని జంధ్యాల కల్పించారు. ఆ పాత్ర అక్షరాల్తో, కవిత్వంతో రకరకాల ప్రయోగాలు చేస్తూ మాట్లాడుతుంది. (ఉదాహరణకి ఈ సంచికలోనే వీరభద్రరావు గురించి వేసిన ఆర్టికల్‌లో చూడండి.) ఆనందభైరవి విడుదలకాగానే జంధ్యాలకి ఆంధ్రదేశమంతటా విపరీతంగా సన్మానాలు జరిగాయి. హైదరాబాద్‌లో సన్మానం జరిగినప్పుడు ఆయన చేసిన ప్రయోగం గుర్తొచ్చేలా జర్నలిస్టు రాజా (ప్రస్తుతం 'హాసం' సంపాదకుడు) కొత్త తరహాలో "ఇది ఇష్ట సుత్తి సుమా" అంటూ జంధ్యాల గార్ని వేదిక మీదికి ఇలా ఆహ్వానించారు:**



**"జగజ్జెట్టీలు, జమా జెట్టీలు ఝుమ్‌ఝుమ్ అంటూ జంకు లేకుండా జవజవ లాడిపోతున్న కవిత్వాన్ని జనం మీదికి జాడించేస్తున్న ఈ రోజుల్లో జడత్వాన్ని పోగొట్టేట్టుగా జనం నాడిలో జవ సత్వాల్ని నింపి ఝుంకార నాదాన్ని పూరిస్తూ జండా ఎగరేసిన ఝుంఝుమారుత జమీందారు:**

**జరజరా జరిగే మాటల జాతరతో ప్రేక్షకుల జానెడు గుండెల జాగాని, జప్తుచేసి జలగలా పట్టుకునే జతగాడు;**

**జాజి గురించైనా, జాబిల్లి గురించైనా జాతీయత గురించైనా... జూలోనైనా, జంగిల్‌లోనైనా జూబిలీ సినిమాలు జయప్రదంగా తీసి జయ జయ ధ్వానాలను అందుకోగల అజయ శివుడు:**

**తన రసఝరితో జబర్దస్తీగా జంపాల లూగించి జనహృదయాల్ని ఝంఝూటి రాగంతో జంపె తాళంతో ముడివేసి జమ ఖాతలో వేసుకోగల ముద్దుల జామాత**

**అయిన శ్రీ జంధ్యాలగార్ని వేదికపైకి ఆహ్వానిస్తున్నాం" అని పిలిచి,**

**"జంధ్యాల గారూ ఏదో మా జంఝూటం కొద్దీ 'జ' లతో జమిలిగా కాస్త జంతర్ మంతర్ చేశాం. మొత్తం ఇందులో 56 'జ'లున్నాయి. లెక్కపెట్టుకోండి"**



**అని చెప్పి నూతనంగా నవ్వించారందర్నీ**

**-గోపి**



# రాంపండు లీలలు

## రాంపండూ - డాన్సు డ్రామా

**"ఉత్తరం వచ్చింది సర్?" అంటూ ప్రకటించాడు అచలపతి అనంతం నిద్రలేవగానే.**

**"ఎవరి దగ్గర్నుంచి?" మత్తుగా అడిగేడు అనంతం కాఫీ కప్పు అందుకుంటూ. "రాంపండు గారి దగ్గర్నుండి."**

**"సుమనోహరితో ప్రణయం విఫలమయింది కాబట్టి ఆత్మహత్య చేసుకుంటున్నానని, ప్రేమికుల పట్ల వ్యవహరించే విధానం ఇది కాదని లోకానికి నా ద్వారా సందేశం పంపిద్దామనుకుంటున్నాడా?"**

**"ఉత్తరం పైన రాసిన సెంటు అటువంటి ఉద్దేశ్యాలున్నట్టు కనబరచడం లేదండి. పైగా ఇది మైలారం అనే ఊరునుండి వచ్చింది."**

**"ఇక చెప్పకు. వీడి కథ విని, విని బోరు కొట్టేస్తోంది. వీడు మళ్లీ ఇంకో పల్లెటూరి చేరి అక్కడ ఓ కుర్రాడికి ట్యూషన్ మేష్టరుగా కుదురుకుని ఉంటాడు. వాడి అక్కనో, అమ్మనో వలచి, వరించి నాకు చెప్తాడు. వాళ్లు నాకు బంధువులయి కూచుంటారు. చివర్లో వీడు ఘొల్లుమంటాడు. అసలు వీడి ప్రేమగాథలకు అంతే ఉండదా, నాకు తెలియక అడుగుతాను, అచలపతీ!" అని విసుక్కుంటూనే ఉత్తరం చింపి చదివేడు.**

ఈసారి రొటీన్ కంటె భిన్నంగా ఉందని అనంత్‌కి ఒప్పుకోక తప్పలేదు. వీణాపాణి అనే ఈ అమ్మాయికీ, రాంపండు ట్యూషన్ చెప్పే అబ్బాయితో చుట్టరికం లేదు. అంతేకాదు, అనంత్‌తో కూడా చుట్టరికం ఏమీ లేదు. పైగా వాళ్లది ఆ ఊరు కాదు. వాళ్లనాన్న ఆర్కియాలజిస్టు. మైలారంలో వచ్చి తవ్వకాలు నిర్వహిస్తున్నాడట. వీణాపాణి, తమ్ముడు కూడా వచ్చి తండ్రి దగ్గర ఉంటున్నారట. మిగతా విషయాలు మాత్రం షరా మామూలే. ఆ అమ్మాయి ఎప్పటిలాగానే భారతదేశంలో పుట్టిన వీనస్. నడిచిన చోటల్లా వసంతం. నవ్వినప్పుడల్లా పూలవాన. ఇంతకుముందు రాంపండు ప్రేమించిన ఏ అమ్మాయికీ తీసిపోని లెవెల్లోనే ఉంది. రాంపండు ఆ అమ్మాయిని చూస్తేనే మెలికలు తిరిగిపోతున్నాడట. అందువల్ల అనంతూ, అచలపతీ వచ్చి ప్రేమ సఫలం చేసే ఉపాయాలు చెప్పాలట.

ఉత్తరం మడుస్తూ, "అచలపతీ, వీడు ప్రేమలో పడ్డ ప్రతీసారీ ఇంత కొత్తగా ఫీలవడం, ఆ అమ్మాయిని పలకరించలేకపోవడం వింతగా లేదూ?" అన్నాడు అనంత్.

"సూర్యుడు ప్రతీరోజూ ఉదయిస్తున్నా ఏ రోజుకారోజు ఉదయం ఫ్రెష్‌గానే ఉంటుంది కదా సర్" అన్నాడు అచలపతి.

"అలాగా, మనకు పెద్దగా తెలియదులే. కాస్త ఆలస్యంగా లేస్తాను కదూ" అంటూ అనంత్ అప్పటికి తన ఆశ్చర్యాన్ని కట్టిపెట్టాడు కానీ రెండు




రోజుల తర్వాత మైలారంలో రాంపండు స్వయంగా తన ప్రేమకథ వినిపిస్తున్నప్పుడు మళ్లీ అడిగిచూశాడు. ఆ సమయంలో రాంపండు అనంతాన్ని ఓ మట్టిదారి పక్కనున్న పొదలమధ్య కూచోబెట్టి ఉన్నాడు. వీణాపాణి వాళ్ల తమ్ముణ్ని తీసుకుని సాయంత్రం వాకింగ్‌కి వచ్చే దారి అదేట! ప్రశ్న విని రాంపండు మరింత ఆశ్చర్య పడ్డాడు. "ఆ దేవత ఎదుటబడి నిలవడమే కష్టం. ఆ తేజస్సు అలాటిది. పలకరించడం కూడానా, చాల్లే ఎవరైనా వింటే నవ్విపోతారు." అని కేకలేశాడు. చివరికి రాంపండు ఎదురు చూసిన ముహూర్తం రానే వచ్చింది. అప్సరసలు కూడగట్టుకుని వీణాపాణి వేషంలో ఆ దారిన రావడం జరిగింది. కానీ ఆమె ఒంటరిగా లేదు. పక్కన ఖాకీ పాంటు, చొక్కాటక్ చేసుకున్నపొడగరి యువకుడు తోడుగా ఉన్నాడు! రాంపండు మూర్ఛపోయి వెనక్కి పడిపోయాడు. కానీ పొదల్లోని ముళ్లు గుచ్చుకోవడంతో లేచి కూచున్నాడు.

కొద్ది గంటల్లోనే అచలపతి పూర్తి సమాచారం అందచేసాడు. ఆ ఊళ్లో అతనికి తెలిసున్న బట్లర్ చెప్పినదాన్ని ప్రకారం ఆ యువకుడి పేరు - పరశురామ్. తవ్వకాలలో ప్రసిద్ధుడు. వీణాపాణి తండ్రికి అతనంటే అభిమానం. అతను లేకపోతే పనిసాగదని చెప్పి హెడాఫీసుతో మాట్లాడి ప్రత్యేకంగా రప్పించాడు. పెళ్ళి కాలేదు. వీళ్ల పక్కనున్న క్వార్టర్స్‌లోనే ఉంటున్నాడు. రాత్రుళ్లు గిటార్ వాయిస్తూంటాడు. వీణాపాణి తన

కొచ్చినంత వరకు చిన్న పియానోలాంటి సింథ సైజర్ వాయిస్తూంటుంది. ఇవి వింటూనే రాంపండు అమాంతం అచలపతి కాళ్ల మీద పడినంత పని చేశాడు. "అచలపతీ, నువ్వే ఏదో ఒకటి చేసి, ఈ కథ తక్కినవాటిలా ముగిసిపోకుండా చూడాలి. విలన్ ఇంత గ్లేమరస్‌గా ఉండడం ఏమీ బాగా లేదు. మంచి ఉపాయం చెప్పి వీణాపాణి దగ్గర నా గ్లామర్ పెంచు" అని బతిమాలేడు.

అచలపతి గొంతు సవరించుకున్నాడు. "కథలో మలుపులు రాకుండా పోవు సర్. నా మిత్రుడు చెప్పిన దాని ప్రకారం వీణాపాణిగారికి తమ్ముడంటే వల్లమాలిన అభిమానం. మీరు అతన్ని మచ్చిక చేసుకుంటే తప్పకుండా ఆమెకు దగ్గరవుతారు" అన్నాడు.




అనంతానికి మాత్రం చికాకు వేసింది. "అచలపతీ, నువ్వు చెప్పేది వరమపాత సలహా. ఈ ఐడియా ఆ పరుశురామ్‌కి కూడా వస్తుంది" అని తీసిపారేశాడు.

అచలపతి మాత్రం నిబ్బరంగానే ఉన్నాడు. "ఇది కాల పరీక్షకు తట్టుకున్న ఫార్ములా సర్. పైగా పగలంతా పరశురామ్‌కి గొడ్డలి పెట్టి తవ్వడానికే సరిపోతుంది. రాంపండు గారి దగ్గర బోల్డంత ఫ్రీ టైమ్ ఉంది".

****

రెండు వారాలు గడిచేయి. వీణాపాణి తమ్ముడు తనకు బాగా దగ్గరయ్యాడని రాంపండు ఉత్తరాలు రాస్తున్నాడు. అమ్మయ్య అని నిట్టూరుస్తూండగానే ఓ రోజు టెలిగ్రాం - రాంపండు నుండి! "వచ్చి నన్ను కాపాడు. లేదా ఎవరైనా పంపి నా శవాన్ని తెప్పించుకో" అని.

"కథేమిటి ఇలా అడ్డం తిరిగింది, అచలపతీ?" అని అడిగేడు అనంత్.

అచలపతి దగ్గర సమాచారం రెడీగా ఉంది. అతని బట్లర్ ఫ్రెండు ఎప్పటికప్పుడు వార్తలు పంపుతూనే ఉన్నాడు. రాంపండు జీవితంలోకి భూషణం మళ్లీ ప్రవేశించాడు. రాంపండు వేంవరంలో ఉండే రోజుల్లో ఇదే భూషణం స్కూలు ఆటల పోటీలపైన పందాలు కాసి రాంపండుని నానారకాలుగా ఏడిపించుకు తిన్నాడు. ఇప్పుడు అతనూ మైలారంలో బంధువులింట్లో తేలాడుట. రాంపండు కొత్త ప్రేమగాథ వినగానే దానిమీద బ్రాకెట్టు ఆడడం మొదలెట్టాడట. వీణాపాణి రాంపండుని వరిస్తుందా, పరశురాముణ్ని వరిస్తుందా అన్న సంగతి మీద పందాలు కాయమని ప్రోత్సహించి, కరక్టయితే ఇన్ని రెట్లు అన్ని రేటు ఫిక్స్ చేశాడట. తమ్ముడి ద్వారా వీణాపాణికి రాంపండు దగ్గరవ్వడం చూసి జనాలు రాంపండే పెళ్లాడతాడని పందాలు కాశారట.

"బానే వుంది. రాంపండు హాట్ ఫేవరెట్ అయ్యాడన్నమాట" అని సంతోషించబోయాడు అనంత్.

"కానీ అతను నెగ్గితే భూషణం వ్యాపారానికి దెబ్బ తగులుతుంది. అందుకని ఓ కుట్ర పన్నాడు సర్. ఓ రోజు సాయంత్రం వీణాపాణి తమ్ముడిని వెంటబెట్టుకుని రాంపండు మార్కెట్‌కి వెళితే, అక్కడ భూషణం కనబడ్డాడు. అతని వెంట ప్రెసిడెంటు పేరయ్యగారి కొడుకు - వీణాపాణి తమ్ముడి వయస్సే - ఉన్నాడు. కుర్రాళ్లిద్దరిలో ఎవరు ఎక్కువ ఇడ్లీలు తినగలరో అన్నవిషయం చర్చకు వచ్చింది. భూషణం, రాంపండు పందాలు వేసుకున్నారు. కుర్రాళ్లు కూడా సై అన్నారు. పోటీ భీకరంగా సాగింది. వీణాపాణి తమ్ముడు రాంపండు తన మీద ఉంచిన నమ్మకాన్ని వమ్ము చేయలేదు. పొట్ట పగిలేట్లా తిని పేరయ్యగారి అబ్బాయిని ఓడించాడు.

కథ ఇక్కడితో ఆగివుంటే బాగుండిపోను సర్. కానీ మర్నాడు పొద్దున్న కుర్రాళ్లిద్దరూ పొట్టలు చేత్తో పట్టుకుని బాధ పడడం, డాక్టర్లను పిలిపించడం జరగడంతో వీణాపాణికి సంగతంతా తెలిసిపోయింది. రాంపండు తన తమ్ముడి ప్రాణాలతో చెలగాటం ప్లస్ జూదం ఆడాడని తెలిసి ఆమె అసహ్యించుకొని రాంపండుకి ఆ

మాట చెప్పేసింది. దాని పర్యవసానమే ఈ టెలిగ్రాం, సర్.'' అని ముగించాడు అచలపతి.

“ఇంత చెప్పినవాడిని, మరి వీణాపాణి అభిమానం ఎలా చూరగొనాలో ఏదో ఒక ఉపాయం చెప్పకూడదా, అచలపతీ'' అన్నాడు అనంత్ విసుగ్గా.

“నా ఉద్దేశ్యంలో రాంపండుగారు సాంఘిక సేవ చేసి గ్రామ ప్రజల ఆదరభిమానాలను చూరగొనడం మంచిది సర్. పదిమందీ మంచిగా మాట్లాడితే వీణాపాణి మనసు మారవచ్చు''.

ఆ ముక్కే రాంపండుకి ఉత్తరం రాసి పడేశాడు అనంత్.

****

నాలుగు వారాలు గడిచేయి. ఓ రోజు అనంత్ ఇంటికి తిరిగి వచ్చేసరికి రాంపండు అతని పక్క మీద తిష్టవేసి ఉన్నాడు. సుఖంగా నిద్రపోవాలిట. లేకపోతే రాత్రి రెండు షోలు వరసగా చూడడం కష్టమట. అనంత్‌కు తలా, తోకా అందలేదు. రాంపండు అందించాడు.

దాని ప్రకారం అచలపతి సలహాను రాంపండు అక్షరాలా పాటించాడు. జనాలకు మొదట్లో ఉన్న సందేహాలు క్రమంగా పటాపంచలు అయిపోయాయి. రాంపండంత మంచివాడు లేడన్న సంగతి దావానలంలా వ్యాపించింది. రోగిష్టి వాళ్లకు సేవలు, వృద్ధులకు పాఠాలు, పట్నం వెళ్లి రైతులకు విత్తనాలు తేవడాలు, లావాదేవీలు జరపడానికి డాక్యుమెంట్లు రాసి పెట్టడాలు - వేయేల, రాంపండు అందరికీ తలలో నాలుక అయిపోయాడు. జనాలంతా ఏకగ్రీవంగా ఈసారి రామనవమి ఉత్సవాలు రాంపండు చేతుల మీదుగానే జరగాలని నిశ్చయించారు. ముఖ్యంగా ప్రతీ ఏటా స్కూలు పిల్లల చేత వేయించే “శ్రీరామజయం'' అనే నృత్యనాటిక ఈసారి రాంపండు ఆధ్వర్యంలోనే జరగాలని యావన్మందీ ప్రతిపాదించడం, పాత కోపాన్ని పక్కకు పెట్టి ప్రెసిడెంటు పేరయ్యగారు సరేననడం జరిగింది.

రాంపండు మంచివాడని లోకమంతా కోడై కూస్తుంటే, తను మాత్రం వేరే కుంపటి ఎందుకు పెట్టాలని వీణాపాణి కూడా రాంపండు ఎడల తన మనస్సు మార్చుకుంది. పైగా పరశురాముడికి తవ్వకాల్లో ఉన్న మజా, అమ్మాయిలను షికార్లకు తిప్పడంలో లేనట్టుంది. ఈ డ్రామా కు హార్మోనియం తనే వాయిస్తానంది.

“అంతా బాగానే వుంది. మరి అక్కడే వుండి ''శ్రీరామజయం'' నాటకం సంగతి చూసుకోకుండా ఇక్కడకొచ్చి పడ్డావేం?'' అని అడిగేడు అనంతం.

“ఆ పని మీదే వచ్చా. ఊళ్లో పాప్ డాన్స్ పోటీలు జరుగుతున్నాయి కదా. అవి చూసి వాటిల్లో కొన్ని పాప్యులర్ ఐటమ్స్‌ను ఆ నాటకంలో పెడదామని ప్లాను. ఇంక డిస్టర్బ్ చేయకు. పడుక్కోనీ, రాత్రి మూడు డాన్సులు వరసగా చూడాలి'' అంటూ రాంపండు అటు తిరిగి పడుకున్నాడు.

“ఒరే సన్నాసీ, పిచ్చిపిచ్చి ప్రయోగాలు చేయకు. అసలే నువ్వు వీణాపాణి మనసు దోచుకుంటావా లేదా అన్న విషయం మీద భూషణం గాడు బ్రాకెట్టు నడిపిస్తున్నాడు. మైలారం జనమే కాదు, పక్కవూళ్ల జనాలు కూడా ఎగబడి పందాలు కడుతున్నారు...'' అని అనంతం ఏదో అంటూండగానే రాంపండు లేచి కూర్చున్నాడు.

“ఏమిటీ, పవిత్రప్రేమ, అదీ ఒక హృదయానిది కాదు, రెండు హృదయాలది. దాని మీద ఈ పాడుజనులు పందాలు కడతారా? వీళ్లనెత్తి మీద రాళ్లు కురవ్వా? మజ్నూకాలంలో కూడా ఇంత ఘోరం లేదనుకుంటాను. అవునొరే, అది సరేగానీ పరుశురామ్ గాడి మీద ఎన్ని రెట్లు ఇస్తున్నాడురా?''

“ఛీ, నీకు సిగ్గులేదురా. నీలాటి ఆజన్మజూదరి జన్మలో బాగుపడడురా! భూషణం గాడు ఏదో కుట్రపన్ని నాటక ప్రదర్శన చెడగొడతాడు చూసుకోరా అని చెబుతూంటే పందెం గురించి అడుగుతావేమిట్రా? నేను చెప్పను పో'' అని అనంత్ విసుక్కున్నాడు.

ఆ మర్నాడు తెల్లవారు ఝామున మైలారం బస్సెక్కుతూ రాంపండు అనంత్‌కి ఫోన్ చేశాడు. “ఒరేయ్, ‘శ్రీరామజయం' అనే పేరు ఓల్డ్ స్టయిల్‌లో లేదూ, సపోజింగ్, ‘రా... రా... రామా... రా!' అని పెడితే మోడ్రన్ టచ్ ఇచ్చినట్టూ ఉండదూ'' అని. సమాధానంగా అనంత్ వినిపించిన తిట్లు వినబడ్డాయో లేదో తెలియదు గానీ మూడో రోజుకి పోస్టులో ఒక పెద్ద వాల్‌పోస్టర్ వచ్చింది.

మైలారం శ్రీరామ సేవాసమితి వారు<br>
ఏప్రిల్ 22, శ్రీరామనవమి సందర్భంగా<br>
సమర్పించు<br>
అధునాతన పౌరాణిక నృత్యనాటిక<br>
“రా... రా... రామా... రా!”<br>
కథా రచన<br>
రాంవరం పాండురంగం (అనే రాంపండు)<br>
గేయరచన<br>
రాంవరం పాండురంగం (అనే రాంపండు)<br>
సంగీతం<br>
రాంవరం పాండురంగం (అనే రాంపండు)<br>
కళాదర్శకత్వం<br>
రాంవరం పాండురంగం (అనే రాంపండు)<br>
నృత్యదర్శకత్వం<br>
రాంవరం పాండురంగం (అనే రాంపండు)<br>
సాయంత్రం 7 గం॥లకు రంగనాయకులు<br>
ఆడిటోరియంలో<br>
అందరూ ఆహ్వానితులే<br>
రండి, రండి, ఇది రామలీల కాదు,<br>
రాంపండు లీల<br>
చూడండి, చూసి తరించండి,<br>
రాంపండును మెచ్చిరాముడి మెప్పు పొందండి.

పోస్టర్‌ను పూర్తిగా చదివేక “అచలపతీ, మన రాంపండుకి ఇంత కీర్తికాంక్ష ఉందని తెలియదు సుమా'' అన్నాడు అనంత్ తెల్లబోతూ.

“పల్లె ప్రజలకూ, పట్నవాసం ప్రజలకూ ఉన్న తేడా రాంపండు గారు గుర్తించి నట్లు లేదు సర్.



ఇంత పబ్లిసిటీని పట్నంలో భరిస్తారు గానీ, పల్లె ప్రజలు నిరసిస్తారు. భూషణం గారి అంచనా తప్పదని అనిపిస్తోంది సర్".

"ఈ ప్రదర్శన గురించి కూడా భూషణం బెట్లు కట్టిస్తున్నాడా?"

"అవునుసర్. ఇటు రాంపండుగారికి పెరుగుతున్న ప్రాముఖ్యత చూసి, అటు పరశురాముడి ఛామ్ చూసి ప్రజలంతా కన్ఫ్యూజ్ అయి పందాలు కట్టడానికి వెనకాడుతున్నారు. అందువల్ల ఆ పెళ్లి పందాన్ని విడగొట్టి, ఈ ప్రదర్శన సక్సెస్ గురించి విడిగా పందాలు కట్టిస్తున్నాడు భూషణం. మీరు రాంపండు గారిని హెచ్చరిస్తే మంచిది. ప్రదర్శన జయాపజయాల మీద చాలా ఆధారపడి వుంది".

"నాటక ప్రదర్శనకు రమ్మనమని మరీ మరీ రాశాడు. ఎలాగు వెళ్లేది కాస్త ముందుగా వెళితే ఏదైనా పొరబాటుంటే సవరించవచ్చు" అన్నాడు అనంత్ సానుభూతి చూపుతూ.

అన్నాడే కానీ మైలారం వెళ్లినా రాంపండుని కలవడం గగనం అయిపోయింది. ఆ నృత్యనాటిక మీదనే తన జీవితమంతా ఆధారపడినట్లు, తన యావచ్ఛక్తినీ, యావత్ సమయాన్నీ దానికే కేటాయించాడు రాంపండు. తన స్క్రీన్ ప్లేలో వేలుపెడితే స్నేహితుడని కూడా చూడకుండా చంపేస్తానన్నాడు. దానికి తోడు ఊరిప్రజల ఉత్సాహం కూడా ఉరకలు వేస్తోంది. ఈసారి పట్నవాసం కుర్రాడొకడు వచ్చి కొత్త, కొత్త ఛమక్కులు చూపబోతున్నాడని, అవేమిటో చూడాలనీ ఆరాటపడుతున్నారు. పందాల మీద పందాలు వేసుకుంటున్నారు. భూషణం పని యమబిజీగా ఉంది.

ప్రదర్శన రోజు ఆడిటోరియం నిండి పోయింది. గుండెలు పీచుపీచుమంటూండగా అనంత్ ఆడిటోరియం వెనకబెంచీలో - ఏదైనా అఘాయిత్యం జరిగితే పారిపోవడానికి వీలుగా - గుమ్మం దగ్గర కూచున్నాడు. కాసేపు పోయాక చూస్తే పక్కనే పళ్లికిలిస్తూ భూషణం! "ఏంటి గిరాకీ?" అన్నాడు అనంత్ కళ్లెగరేస్తూ.

"చెప్పు. నాటకం పూర్తిగా ఆడుతుందో లేదో పందెం కడతావా? రేట్లు చెబుతాను" అన్నాడు సిగ్గుమాలిన భూషణం.

"ఛస్తే కట్టను. నువ్వేదో చేసి ఈ నాటకం చెడగొడతావనిపిస్తోంది" అన్నాడు అనంత్ ఒళ్లు మండుతూండగా.

"రాంపండు ఉండగా ఇంకోడికి ఆ ఛాన్సెందుకిస్తాడు?" అన్నాడు భూషణం వెకిలినవ్వు నవ్వుతూ. అంటూనే "అదిగో ఆడిటోరియం ఎలక్ట్రీషియన్. అతనితో కాస్త పనుంది. వస్తా" అని పరిగెట్టాడు.

నాటకం తెర తీశాక మొదటి రెండు సీన్సులోనూ రాంపండు ఉనికి తెలియలేదు. అంటే బొత్తిగా తెలియలేదని కాదు. పిల్లలు డైలాగులు చెప్పడం మర్చిపోయినప్పుడల్లా అతని కంచుకంఠం మైకులో సంభాషణలు అందిస్తోంది. 'ఆ ప్రాంప్టింగుగాడికి మైకు తీసేసి, ఈ పిల్లలకు పెట్టండేస్" అంటూ అరిచేడో గడుగ్గాయి ఆడియన్స్‌లోంచి. "మైకులో సంభాషణలు అందించునది - రాంవరం పాండురంగం (అనే రాంపండు)" అంటూ వెక్కిరించాడు ఇంకో గ.గా హాల్లో భూషణం మనుష్యులు నలుమూలలా కాసుకుని ఉన్నట్టు అనుమానం వచ్చింది అనంతానికి. అంతలోనే సడన్‌గా కరెంటు పోయి హాలంతా చీకటయిపోవడంతో ఆ అనుమానం బలపడింది.

రాంపండు ఈ అవకాశాన్ని విడవదలచుకోలేదు. "లేడీస్ అండ్ జెంటిల్మెన్, ఎక్కడో ఏదో పొరబాటు జరిగి లైట్లు పోయాయి" అని స్టేజి మీద నుండి ఎనౌన్స్ చేసాడు. "వాటె తెలివి! వాటె తెలివి!" "వాటె డిస్కవరీ! వాటె డిస్కవరీ!" అంటూ గడుగ్గాయిలు ప్లస్ ఆకతాయిలూ అరిచారు. "ఈ అద్భుతమైన ఎనౌన్స్‌మెంటు చేయువారు - రాంవరం పాండురంగం (అనే రాంపండు)" అంటూ పాత గడుగ్గాయి మళ్లీ అరిచాడు. హాలంతా గొల్లుమని నవ్వులు.

ఐదు నిమిషాల తర్వాత లైట్లు వచ్చినా, పది నిమిషాల దాకా సద్దుమణగలేదు. చీకట్లో సీట్లు మార్చేసిన వాళ్ల మీద, కాళ్లు తొక్కేసిన వాళ్ల మీద పోట్లాడేవాళ్లు ఎక్కువయిపోయారు. స్టేజి మీద నడిచేది ఎవరూ పట్టించుకోవడం లేదు. పరిస్థితి అదుపులోకి తేవడానికి డైరెక్టరు రాంపండు అమోఘమైన ఆలోచన ఒకటి చేశాడు. హఠాత్తుగా ఎక్కణ్నుంచో హనుమంతుడు వెలిశాడు. వెలిసి డిస్కోడాన్సు చేసేశాడు. జనాలంతా నిర్ఘాంత పోయి చూడడంతో సైలంటు అయిపోయారు. నాటకం ముందుకు సాగింది.

కాస్సేపటికి శూర్పణఖ వచ్చి లక్ష్మణుడ్ని చూసి "అమ్మ నీ కమ్మని కోత" పాట అభినయిస్తుండగా రాంపండు ప్రెసిడెంటుగారిని మచ్చిక చేసుకునేందుకు దాచుకున్న బ్రహ్మాస్త్రం బయటకు లాగేడు. "వేదిక మీదకు వచ్చి బాల కళాకారులతో బాటు ఆడి, పాడి వారిని ఉత్సాహ పరచవలసినదిగా ప్రెసిడెంటు పేరయ్యగారిని వేదిక మీదకు ఆహ్వానిస్తున్నాను' అని ఎనౌన్సు చేసేశాడు.

అందరూ ఆయన కేసే చూడడంతో పేరయ్యగారు తెల్లబోయి, మొహం ఎర్రబోయి, విసవిసా బయటకు వెళ్లిపోయాడు. ఆయన వెంటనే ఆయన కుటుంబం. రాంపండు "పోనీ మునసబుగారు..." అంటూ ఇంకోళ్లను పిలవబోతుండగా కరణంగారు వింగ్స్‌లోకి పరిగెత్తుకుని వెళ్లాడు. వెంటనే ఆయన రాంపండుని మందలించినది మైకులో వినబడింది కూడా - "మీ పట్నవాసాల్లా ఉండదిక్కడ. చాటుమాటు నరసాలే కానీ స్టేజెక్కి గంతులెయ్యరు. రేపాయన ఊళ్లో తలెత్తుకు తిరగాలా?"

"ఈ పల్లెటూరి గబ్బిలాయిలతో ఇదే గొడవ. ఏదీ స్పోర్టివ్‌గా తీసుకోరు." అంటూ రాంపండు విసుక్కున్నది కూడా గట్టిగానే వినబడింది. దానికి సమాధానంగా హాల్లో విజిల్స్, కేకలు, లైట్లు పోవడం జరిగింది. 'ఈ చెత్త వాగుడు వాగినది -



రాంవరం..." అంటూ పాత గడుగ్గాయి మళ్ళీ గళం విప్పాడు.

నాటకానికి హైలెట్ క్లయిమాక్స్‌లో పెట్టాడు రాంపండు. అది సిటీలో చూసిన ఓ పాప్ గ్రూపు సాంగ్‌లోంచి సరాసరి పిక్కాడు. స్టేజి మీద నటీనటులంతా "ఆరంజెస్, ఆరంజెస్,నీకో ఆరంజ్, నాకో ఆరంజ్' అంటూ నారింజకాయలు జనాల్లోకి విసురుతారు. అంటే నిజం నారింజకాయలు కాదు. ఆ ఆకారంలో వూలుతో చేసినవన్న మాట. అదీ అందమైన అమ్మాయిలు అలవోకగా, తమాషాగా విసురుతుంటే ప్రేక్షకులు పులకరించి పోతారు. రాంపండు కూడా అలా పులకరించిపోయాకనే దాన్ని తన నాటకంలో ప్రవేశపెట్టాడు. రాముడి పట్టాభిషేక సమయంలో జనాలంతా ఆనందం పరవళ్ళు తొక్కుతూ, ఇలా నారింజకాయలు విసురుతారని వాడి కల్పన.

ఆలోచన వరకు బాగానే ఉంది. కానీ దాన్ని అమలు చేయడంలో వచ్చింది చిక్కు. ఈ నాటకంలో ఉన్నవి నిజం నారింజకాయలు. అవి కూడా పిల్లలు యథాశక్తీ కొద్దీ, జబ్బసత్తువ కొద్దీ ప్రేక్షకులలోకి విసిరికొట్టారు. స్టేజికి అల్లంత దూరంలో కూచున్న అనంత్ మొహం మీద కూడా ఒకటి తగిలి చితికి కళ్లలోకి రసం చిప్పిల్లిందంటే ఆ దృశ్యం ఎంత రసాభాస అయిందో ఊహించుకోవచ్చు. నారింజ దెబ్బలు తప్పించుకోవడానికి జనాలంతా లేచి పరుగులు పెట్టారు. కొన్ని డైరక్టుగా తగిలితే, కొన్ని గోడలకు కొట్టుకుని చితికి నెత్తి మీద రసం పోశాయి. కళ్ళు మండడంతో కొందరు కసికొద్దీ అవే నారింజకాయల్ని పట్టుకుని స్టేజిమీదకు విసిరేశారు. ఆకతాయిలు ప్లస్ గడుగ్గాయిల గుంపు ఈ విషయంలో ప్రధాన పాత్ర వహించింది. గాలిలో ఎక్కడ చూసినా నారింజకాయల వాననే, నారింజకాయల బాంబులే.

రాంపండు పరిస్థితి ఎలా వుందో చూడడానికి అనంతం స్టేజి మీదకు పరుగులు పెట్టాడు. అప్పటికే లేటయ్యింది. వీణాపాణి రాంపండును ఛడామడా తిట్టి, జన్మలో తనకు మొహం చూపించవద్దందిట. "ఏమిట్రా ఇది?" అంటే రాంపండు సగం ఏడుస్తూ చెప్పాడు- "నేను వూలు నారింజకాయలే చేయించానురా. బోల్డు డబ్బు తగలేశా. కానీ భూషణం గాడు పిల్లలకు లంచం పెట్టి అసలు నారింజకాయలు పెట్టాశాడట. రిహార్సల్స్‌లో నేను కాస్త స్ట్రిక్ట్‌గా ఉండటంతో పిల్లలకు కూడా విసుగుపుట్టి వాడి ఐడియాకు సరేననేశారట. ఎంత అన్యాయమో చూడు".

"అది తర్వాత చూస్తాను కానీ నువ్వు ముందు దీనికి దొడ్డిదారి ఏదైనా ఉందేమో చూడు. పారిపోయి ప్రాణాలు రక్షించుకో" అని చెప్పేసి అనంతం స్టేజి దిగేశాడు.

ఊరికి తిరిగొచ్చాక అచలపతిని పరామర్శించేడు - "పాపం నువ్వు చెప్పిన ప్లానులు ఫలించలేదోయ్. రాంపండు ప్రేమ మళ్ళీ ఫెయిలయింది. పాపం నీకు బాధగా ఉందేమో!" అని.

'మరీ అంత బాధలేదు సర్. రాంపండుగారి ప్రేమ ఎలాగైనా విఫలమవుతుందని నేనూ బెట్ కట్టాను. మా స్నేహితుడి ద్వారా భూషణం గారు కట్టించుకున్నారు. ఓ ఐదువందల దాకా కలిసి వచ్చిందనుకోండి' అన్నాడు అచలపతి కాస్త వినయంగానే వంగి.

**-ఎమ్బీయస్ ప్రసాద్**

**(పి.జి.ఉడ్ హౌస్ రాసిన "ది మెట్రోపాలిటన్ టచ్" కథ ఆధారంగా)**

---

**జూన్ 22 ఫ్రెడ్ ఏస్టయిర్ వర్థంతి సందర్భంగా....**

# ఫ్రెడ్ ఏస్టయిర్ స్క్రీన్ టెస్ట్

హాలీవుడ్ మ్యూజికల్స్‌లో డాన్సింగ్ స్టార్‌గా ఫ్రెడ్ ఏస్టయిర్ పేరు ముందు చెప్పి తీరాలి. సన్నగా, బక్కపలచగా, కాస్త ముసలిరూపుతో ఉన్న ఫ్రెడ్ డాన్సింగ్ కౌశలం అపురూపమైనది. మరీ ఒళ్లు విరుచుకోకుండా, స్టయిల్‌గా డాన్స్ చేస్తూ చూపరులను విస్మయపరిచే నేర్పు అతడి సొత్తు. 15 సంవత్సరాల పాటు బ్రాడ్వేను ఏలి, 1933లో "డాన్సింగ్ లేడీ"తో చిత్రరంగ ప్రవేశం చేశాడు. ఆ తర్వాత 1949 వరకు సినిమారంగాన్ని కూడా ఒక ఊపు ఊపాడు. ఆ తర్వాత టీవీలో కూడా తన నైపుణ్యాన్ని ప్రదర్శించాడు. 1987లో మరణించిన ఫ్రెడ్ తన 79వ యేట చివరిసారిగా "ఎ ఫ్యామిలీ అప్ సైడ్ డౌన్" (1978) టీవీ చిత్రంలో కనబడ్డాడు.



రోజర్స్‌తో ఫ్రెడ్ ఏస్టయిర్

ఫ్రెడ్ ఏస్టయిర్ పేరు చెప్పగానే వెంటనే గుర్తుకు వచ్చేది అతనితో బాటు జంటగా నటించిన, డాన్సు చేసిన జింజర్ రోజర్స్. వారిద్దరి సాహచర్యం బ్రాడ్వేలో మొదలయ్యింది. బ్రాడ్వే మ్యూజికల్స్‌లో 15 సంవత్సరాల పాటు నటించి ప్రశంసలు పొందిన ఆ జంట నిజ జీవితంలో కూడా ప్రణయంలో పడింది. ఇద్దరూ కలిసి సినిమాలలోకి వచ్చారు. ఆర్.కె.ఓ. స్టూడియో వారు వారిద్దరికి ఉన్న ప్రాచుర్యాన్ని గుర్తించి ఆరేళ్లలో ఎనిమిది చిత్రాలు తీశారు. వాటిల్లో "టాప్ హ్యాట్" (1935), "స్వింగ్ టైమ్" (1936) ఆల్‌టైమ్ హిట్స్‌గా చెప్పుకోవచ్చు. వాళ్లిద్దరూ విడిపోవడం, మళ్లీ కలిసి "ది బర్కిలీస్ ఆఫ్ బ్రాడ్వే" (1949)లో నటించడం - అదంతా మరో ప్రణయగాథ!

ఫ్రెడ్‌కి ఫలానా చిత్రానికి అంటూ ఆస్కార్ రాకపోయినా 1949లో స్పెషల్ ఆస్కార్ ఇచ్చి సత్కరించారు. ఇటువంటి నృత్యకారుడికి, నటుడికి మొదట్లో నటించిన కితాబు ఏమిటో తెలుసా? నాటకాల్లో బాగా పేరు వచ్చిన తర్వాత సినిమాలలోకి ప్రవేశిద్దామని ఓ స్టూడియోకి వెళితే ఫ్రెడ్‌ని స్క్రీన్ టెస్ట్ చేసిన ఓ కుర్రాడు అతని ఎవాల్యుయేషన్ రిపోర్టులో ఇలా రాశాడు. "పాడలేడు. నటించలేడు. జుట్టు కూడా తక్కువే. బట్టతల కాస్త కనబడుతోంది. కానీ ఏదో ఓ మాదిరిగా డాన్సు మాత్రం చేయగలడు!"

# లలిత సంగీతం

## అలనీల గగనాన తెలిమబ్బు చూడు



ప్రముఖ గాయకుడు, స్వరకర్త లలిత సంగీత విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.

ఫోన్ నెం. 040-7402993

ప॥ అలనీల గగనాన తెలిమబ్బు చూడు
అందాల హంసలా ఆడేను నేడు

1. చ॥ ఏరాచ మహలుకు ఏగదలిచేనో
ఏ తోటలో తాను వాలదలిచేనో
ఏ యింతికో దమయంతికో
ఏ నలుని హృదయాన్ని అందించునో

2. చ॥ ఏరాణి ఎగరేసె యీ గాలి పటము
ఏ రాజు ఒడిలోన చేరదలిచేనో
కనరాని భావాలు వినరాని రాగాలు
తనలోని దాచుకుని తరలిపోయేనో

3. చ॥ ధరణిపై శాంతినే కురిపించునేమో
కలహాలు విడచి ప్రళయాలు గడచి
భూమాత చిరునవ్వు చిందించునో

| | | |
|---|---|---|
| రచన | : | కీ॥శే॥ డా॥ దాశరథి |
| గానం | : | శ్రీమతి శాంత |
| సంగీతం | : | చిత్తరంజన్ |
| రాగం | : | ప్రతిమధ్యమావతి |
| తాళం | : | ఖండచాపు (కర్ణాటక సం॥) -ఝప్‌తాల్ (హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : | స రి మ ప ని స |
| అవరోహణ | : | స ని ప మ రి స |

షడ్జము, చతుశ్రుతి రిషభం, ప్రతి మధ్యమం, పంచమం, కైశికి నిషాదం - యిందులోని స్వరాలు

అన్యస్వరమైన సాధారణ గాంధారం కూడా ఉపయోగించబడింది.

కర్ణాటక సంగీతంలో మధ్యమావతి చాలా ప్రసిద్ధి చెందిన రాగం. శ్రీ బాలమురళీకృష్ణగారు యీ రాగంలోని శుద్ధమధ్యమానికి బదులు ప్రతి మధ్యమాన్ని చేర్చి "ప్రతి మధ్యమావతి" అని నామకరణం చేసి ఆ రాగాన్ని "భజరే యదునాథం" అనే సదాశివబ్రహ్మేంద్ర కీర్తనకు ఉపయోగించి బాణీని కూర్చి ఆకాశవాణి 'భక్తిరంజని' కార్యక్రమంలో గానం చేశారు. ఆ రాగాన్ని నేను దాశరథి గారి "అలనీల గగనాన" అన్న యీ పాటకు ఉపయోగించి సాధారణ గాంధారాన్ని కూడా చేర్చి సంగీతం కూర్చాను. శ్రీమతి శాంత ఎంతో భావయుక్తంగా గానం చేసిన యీ గీతం "ఈ మాసపు పాట"గా ఆకాశవాణిలో 1970వ దశకంలో ప్రసారమై శ్రోతల మన్ననలను పొందింది. మహాకవి కాళిదాసు విరచితమైన "మేఘసందేశం" కావ్యాన్ని స్ఫూర్తిగా చేసుకొని దాశరథిగారు కడురమణీయంగా యీ గేయాన్ని రూపొందించారు. నీలిగగనంలో తేలియాడుతున్న తెల్లని మబ్బు కవి హృదయాన్ని పరవశింపజేయగా వెలువడిన అద్భుత వర్ణచిత్రమీ పాట. తెల్లని మబ్బును దమయంతి రాయబారంగా పంపిన రాజహంసగాను, ఓ రాణిగారు ప్రేమలేఖ వ్రాసి ఓ రాజుగారికి పంపిన గాలిపటంగాను ఆవిష్కరింపబడినది. చివరలో తెలిమబ్బు శాంతి వర్షం కురిపించి భూమాతకు చిరునవ్వుల వరమిచ్చే శాంతికపోతం (పావురాయి)గా వర్ణించడంలో దాశరథిగారి మహత్వం వ్యక్తమవుతున్నది.

ప॥ నిస రిమపామా | రిరి సాస | ; రిసా రిసా నీ, నీ | నిసరి రి, |
అల నీ . . ల | గగ నాన | . తె. లి. మ. బ్బు | మూ. . డు. |
; సనీ సనిరి సా | నిధానిధామప | ; ధసని నిరిససరి | నిధ సా, |
. అం. దా. . ల | హం. . స లా. | . ఆ. . డే. . ను. | నే. డు. |
; నిస సరిగారి | సనీరి సా నిధాని | మాధసని నిరిససరి | నిస సా, |
. అం. దా. . ల | హం. . స లా. . | . ఆ. . డే. . ను. | నే. డు. |

1.చ॥ నిస రిమపామా | పపప నీ | పామ రిమ | పానిప పా, |
ఏ. రా. . చ | మహలు కు | ఎగ కలి | చే. . నో. |
పామప నిప | మామప నిప | మపరి రిమరి | రీ రీ, |
ఏ లో. టు. | లో లా. ను. | వా. ల కలి. | చే నో. |
నిస సరిగారి | నిరిసరి నిసనీ; | నిస సరిగారి | నిరిసరి నిసనీ; |
ఏ. ఇం. . తి | కో. . . . . . . | భమయం. . తి | తో. . . . . . . |
సానిరిస | ధని.ప. మప | ; పసానినిరిసరి | నిస సా, |
ఏ నలు ని | హృదయా. న్ని | . అం. . దిం. . చు | నో. . . || అలనీల ||

2వ చరణం కూడా మొదటి చరణం వలె పాడాలి.

3చ॥ ; ధనీ రి, రి | రిగరిస | సరిరిపమ | రిరి, |
. పరమా. త్మ | డంపిన. | యా. పా. వు | రాయి. |
; రిమాపనీ; | పామ పామ | రీ రిమారి, సా | సా సా, |
. ధర తిపై. | శాంతి నే. . | . కు రి పిం. చు | నే మో. |

తరువాతి రెండు పంక్తులు 1వ చరణం లోని 3, 4 పంక్తుల మాదిరి గానే పాడాలి.

నైజాం నిరంకుశ పాలనకు నిరసనగా "అగ్నిధార"ను వర్షించి "రుద్రవీణ"ను మ్రోగించిన మహాకవి దాశరథిగారి లేఖిని నుండి ఎన్నో వైవిధ్య భరితమైన యితివృత్తాలతో మృదు మధుర మైన గేయకవితలు జాలు వారాయి. 1955లో కేంద్ర ప్రభుత్వం ఆకాశవాణి కేంద్రాలలో వివిధ కళలలో నిష్ణాతులైన పండితులను, కవులను, సంగీత విద్వాంసులను, నాటక రంగంలోని మహానటులను ప్రయోక్తలుగా నియమించింది. దాశరథి గారు సాహిత్య విభాగానికి హైదరాబాదు కేంద్రంలో ప్రయోక్తగా వుంటూ ఎన్నో గేయాలు, సంగీత రూపకాలు రచించారు. "నవమంజరి" అనే గేయ కావ్యాన్ని వెలయించారు. ఆకాశవాణిలో ప్రసారమైన పలు గీతాలతో, ప్రఖ్యాత స్వరకర్తలు శ్రీయుతులు మంచాళ జగన్నాధరావు, పాలగుమ్మి విశ్వనాథం మొదలగు వారు దాశరథిగారి ఎన్నో గీతాలను స్వరబద్ధం చేశారు. "మెరుపులు పూవుల దండగా", "మామిడి కొమ్మా మల్లియరెమ్మా మంతన మాడెనదే", "మ్రోయింపుము నవ వేణువు", "స్వేచ్ఛాసరస్వతీ జోహారోయమ్మ" మొ॥ పాటలు



డా॥ దాశరథి

మంచాళ వారి స్వరరచనతోను, "భూధరమో సాగరమో", "తథాగతా ప్రజాహితా", "రావేమిరా శశి అంధకారం యీ నిశి" మున్నగునవి విశ్వనాథంగారి స్వరరచనతోను, "ఎవ్వరిదోయి యీ రేయి", "హృదయాలతోటలు పూయగా వచ్చింది వాసంతం", మొ॥నవి నా స్వరరచనతోను ఆకాశవాణిలో పలుసార్లు ప్రసారమైన ప్రసిద్ధ గేయాలు. 1960వ దశకం నుండి తెలుగు చలన చిత్రాలకు ఎన్నెన్నో సుమధురమైన పాటలను అందించారు. కొంతకాలం మద్రాసు ఆకాశవాణి కేంద్రంలో కూడా ప్రయోక్తగా పని చేశారు. 1975లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దాశరథి గారిని ఆస్థాన కవిగా నియమించి గౌరవించింది. 1982లో రిపబ్లిక్ దినోత్సవానికి ప్రత్యేకంగా "మన దేశం భారతదేశం మన రాష్ట్రం ఆంధ్రప్రదేశం" అనే సుందరమైన గీతాన్ని రచించగా నేను స్వరపరచి బృందగీతంగా పాడించిన ఆ గేయం ఆకాశవాణిలో "మాతృవందనం" కార్యక్రమంలో ప్రసారమైనది. 1985లో శివరాత్రి పర్వదినాన్ని పురస్కరించుకుని వారి "గంగావతరణం" సంగీతరూపకం నా సంగీత నిర్వహణలో ప్రసారమై రసజ్ఞుల ప్రశంసలనందుకుంది.

భక్తి దేశభక్తి ప్రణయ, ప్రబోధగీతాలు రసగుళికల వంటివి అసంఖ్యాకంగా దాశరథిగారు ఆంధ్ర ప్రజానీకాని అందించారు. తెలుగు వాఙ్మయానికి మహాకవి దాశరథిగారు చేసిన సేవ అపారమైనది, జాతి ఎన్నటికీ మరువలేనిది.

సుమారు నాలుగు దశాబ్దాలుగా లలిత సంగీత రంగంలో ఆకాశవాణి ద్వారా ప్రసిద్ధ గాయనిగా పేరొందిన శ్రీమతి శాంత (శాంతా చారి) భగవద్దత్తమైన తన మృదుమధుర గాత్రంతో పసి వయసునుండే చక్కని పాటలు పాడడం ప్రారంభించింది. సంగీత వంశంలో జన్మించిన నా చిన్న చెల్లెలైన శాంత విదుషియైన మా అమ్మ శ్రీమతి పేరిందేవి గారి వద్ద గాత్ర సంగీతంలో శిక్షణ పొందింది. మా పెద్ద చెల్లెలు సౌభాగ్యవల్లి, శాంత యిరువురూ కలిసి తరచూ కార్యక్రమాల్లో పాడుతూండే వారు. నాతో కూడా వుంటూ సంగీతంలో అనేకమైన సూక్ష్మవిషయాలను తెలుసుకుంటూ లలిత సంగీతంలో భావయుక్తంగా పాడే విధమును, మాడ్యులేషన్‌లో స్వరాలను పలికించడం మొదలగువాటిని అవగాహన చేసుకొని తన గాత్రానికి మెరుగులు దిద్దుకుంది. నాతో ఎన్నో సభలలో కలిసి పాడుతూండేది. 1963లో ఆకాశవాణి ఆడిషన్ టెస్టులో తొలి ప్రయత్నంలోనే 'బి' హైగ్రేడ్‌ను సంపాదించుకున్న కళాకారిణి శాంత. ప్రఖ్యాత సంగీత దర్శకులు


శ్రీమతి శాంత

శ్రీ పాలగుమ్మి విశ్వనాథంగారు చాలామంచి పాటలన శాంత చేత పాడించారు. వాటిలో "స్వాతంత్ర్యమె న జీవితాశయుని" (శశాంకరచన), "రావేమిరా శశి అంధకార యీ నిశి", "తథాగతాప్రజాహిత" (దాశరథి రచనలు వంటివి మచ్చుకు కొన్ని. నా సంగీత దర్శకత్వంల ఆకాశవాణి లోను, దూరదర్శన్‌లోను కూడా చాలా కష్టమైన క్లిష్టమైన బాణీలు గల గీతాలను సైతం ఎంతో యీజీగ భావయుక్తంగా పాడింది. "ఇదెవత్తునని చెప్పి మట మాయమయ్యె" (రచన: శశాంక-రాగం: కాంతామణి "దూరతీరాలలో ఆ పిలుపు ఎవరిదో" (రచన: డా॥ పద్మ దేవి - రాగం: పీలు) "ప్రణయానికి చల్లదనం విరహాని వెచ్చదనం" (గజల్-రచన: కోపల్లె శివరాం - రాగం: యమన్ "మధురోహలు ఊగే మలయునమీరం" (రచన బి.సోమసుందరం - రాగం: పహాడి), "మానవ జనన మధుమాసం" (రచన: డా॥ ఆచార్య తిరుమల - రాగమాలిక - యిత్యాది గేయాలు బాగా పాప్యులర్ అయిన శాం పాడిన పాటలలో కొన్ని. తన వివాహానంతరం ఢిల్లీల వుంటూ అక్కడి ఆకాశవాణిలో కూడా తరచూ లలిత భక్తిగీతాలు పాడుతూండేది. లలిత సంగీత కళాకారిణిగ మంచి గుర్తింపును పొందడమే గాక యీనాటికీ త పాటలను తలచుకొనే ఎంతో మంది శ్రోతలన సంపాదించుకుంది.






## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. వితతి (స్వాతికిరణం.... ప్రణతి)
   ఎ) పంక్తి  బి) సంతానము
   సి) దానగుణము  డి) పక్షులు
2. జోతలు (స్వాతికిరణం... ప్రణతి)
   ఎ) జంటలు  బి) యోధులు
   సి) నమస్కారములు  డి) నాయకులు
3. చాన (ముత్యాల ముగ్గు.... ముత్యమంతా)
   ఎ)విద్యావంతురాలు  బి) భార్య
   సి) సుందరి  డి) స్త్రీ
4. తేటి (ముత్యాలముగ్గు ... ముత్యమంతా)
   ఎ) తుమ్మెద  బి) మేలైనది
   సి) తేనె  డి) మిడత
5. తరళము (శంకరాభరణం ... ఓంకార నాదాను...)
   ఎ) గానము  బి) విషము
   సి) శ్రేష్ఠమైనది  డి) చలించునది
6. నిగళము (శంకరాభరణం.. ఓంకార నాదాను...)
   ఎ) అలంకారము  బి) కంఠము
   సి) సంకెల  డి) హారము
7. తెమ్మెర (చివరకు మిగిలేది ... సుధాహోల్)
   ఎ) తుమ్మెద
   బి) చల్లగాలి
   సి) చంద్రుడు
   డి) కాంతి
8. అనయము (రహస్యం ... శ్రీ లలితా శివజ్యోతి)
   ఎ) మరువక  బి) తప్పక
   సి) ఎల్లప్పుడు  డి) ప్రేమతో
9. నిటలము (రహస్యం... లలిత భావ నిలయా)
   ఎ) నుదురు  బి) కదలనిది
   సి) మూడవది  డి) శిరస్సు
10. చిడిముడి (రహస్యం - తిరుమలగిరి వాసా)
   ఎ) గందరగోళము
   బి) కష్టములు
   సి) ఒడిదుడుకులు
   డి) వ్యాకులత

### జవాబులు

1) a 2) c 3) d
4) a 5) d 6) c
7) b 8) c 9) a
10) d

అలనాటి ఆణిముత్యాల గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

# కాళ్లకూరి నారాయణరావు గారి వరవిక్రయం నాటకం

శ్రీ కాళ్లకూరి నారాయణరావుగారు తెలుగు సాహిత్యంలోని అనేక ప్రక్రియల్లో నిష్ణాతులైనా, ప్రధానంగా నాటకకర్తగానే వారికి మంచి పేరు వచ్చింది. వారు రాసిన నాటకాల్లో ఒక్కోటి ఒక్కో సాంఘిక దురాచారాన్ని నిర్మూలించడానికి ఉద్దేశించబడింది. 'చింతామణి' నాటకం వేశ్యావృత్తి మీదా, 'మధుసేవ' నాటకం తాగుడు వ్యసనం మీదా, అలాగే 'వరవిక్రయం' నాటకం వరకట్న దురాచారం మీదా సంధించిన అస్త్రాలు. చింతామణి, వరవిక్రయం నాటకాలు సినిమాలుగా గూడా వచ్చాయి.

చాలామంది రచయితల విషయంలో, నిజ జీవితంలో వాళ్ల ప్రవర్తనకీ రచనల్లో వాళ్లు ప్రబోధించే ఆదర్శాలకీ ఎక్కడా పొంతన వుండదు. కాని కాళ్లకూరి వారి విషయంలో మాత్రం అలాకాదు. 1871వ సం.రంలో జన్మించిన ఆయన, తన సోదరి బాల వితంతువు అయితే ఆమెకి పునర్వివాహం చెయ్యాలని పట్టుబట్టి, తండ్రితో విభేదించి, ఇల్లు వదిలిన గొప్ప వ్యక్తి. అంతేకాక, తనుగూడా కట్న కానుకలు లేకుండా, ఆ రోజుల్లోనే, వర్ణాంతర వివాహం చేసుకున్న నిజమైన సంస్కర్త.

దేశనాట నాటుకున్న ఆనాటి (ఈనాటి) దురాచారాన్ని చాటి చెప్పే యీ నాటకాన్ని యీనాటి పాఠకుల కోసం ఈమాటు పరిచయం చేస్తున్నాం.

పుణ్యమూర్తుల పురుషోత్తమరావు పంతులుగారనే గృహస్థ గాంధేయవాది. 'నాన్ కో-ఆపరేటివ్' - అంటే సహాయ నిరాకరణ సిద్ధాంతం ఆదర్శంగా కలవాడు. రాట్నం అంటే యిష్టం. కట్నం అంటే అసహ్యం. ఆయనకి యిద్దరు కూతుళ్లు. పెద్దమ్మాయి కాళింది. చిన్నమ్మాయి కమల.

పెళ్లీడు కొచ్చిన పెద్దమ్మాయికి వరుణ్ణి వెదుకుతూ, ఆయన కాలికి బలపం కట్టుకుని కాలేజీలన్నీ తిరిగాడు. ఎవ్వరూ కట్నం లేకుండా పెళ్లి చేసుకుందుకు ముందుకు రాలేదు. కట్నాలేగాక విపరీతంగా లాంఛనాలు. అంతులేని మర్యాదలు. ఎక్కడా సంబంధం కుదరక ప్రాణం విసిగి, చివరికి ఓ మధ్యవర్తిని ఆశ్రయిస్తాడు. అతని పేరు 'పెళ్లిళ్ల పేరయ్య' (ఇప్పుడు 'పెళ్లిళ్లు కుదిర్చేవాడు' అనే అర్థంలో వాడబడుతోన్న 'పెళ్లిళ్ల పేరయ్య' అన్న పదం బహుశా యీ నాటకంలోంచే పుట్టిందేమో!) ఆ వూళ్లో పెళ్ళిళ్ల పేరయ్య అనీ, వివాహాల వీరయ్య అనీ యిద్దరు వ్యక్తులు పెళ్లిళ్లు కుదురుస్తూ వుంటారు.

పురుషోత్తమరావుగారు ఎంచుకున్న ఈ పేరయ్య 'పేరడు'గా 'పేరిగాడు'గా ప్రారంభించి, కాస్త ముదిరి 'పేరన్న', 'పేరయ్య' అయి, అప్పుడప్పుడే 'పేరిశాస్త్రులనీ, 'పేరిభొట్లనీ మర్యాదగా పిలవబడే స్థాయికి ఎదిగినవాడు.

అతనితో పురుషోత్తమరావు తనకి 'కట్నం పుచ్చుకోకుండా పెళ్లాడే' వరుణ్ణి వెదికి పెట్టమంటాడు. 'అలాంటి వాళ్లు యీ భూ ప్రపంచంలో దొరకరనీ, యీ లోపల అమ్మాయి కాస్తా రజస్వల అయితే కులం వెలివేస్తుందనీ' భయపెట్టి, పేరయ్య కొన్ని సంబంధాలు చెబుతాడు. పురుషోత్తమరావు భార్య భ్రమరాంబ వాటికన్నిటికీ వంకలు పెడుతుంది. సింగరాజు లింగరాజు గారి పెంపుడు కొడుకు బసవరాజు అనే అందమైన అబ్బాయికి కాళిందిని యివ్వాలని ఆమె మనసులో వున్న కోర్కె, చివరికి బైట పెడుతుంది.



లింగరాజు ఆశపోతనీ, పేచీ మనిషనీ చెబుతాడు పేరయ్య. అయినా

తన ప్రయత్నం తను చేస్తానని చెప్పి పేరయ్య లింగరాజు యింటికి వెళ్తాడు.

పేరయ్య వెళ్లేసరికి లింగరాజు ఏం చేస్తున్నాడు?

-"పిడుకలు, వంట కట్టెలను, పీటలు, చేటలు లెక్క జూసి, పొయి బొగ్గులన్ కొలిచి, పాదుల కాయలను ఎంచి (లెక్కబెట్టి), దూడ పాలు విడిచిన రాక నిల్వబడి, వాకిట కొబ్బరి చెట్ల కాయలను లెక్కబెట్టి"-

అప్పటికి యింట్లో కాలుబెడుతున్నాడు. అతని సిద్ధాంతం ప్రకారం డబ్బు సంపాదించడానికి ఏం చేసినా - మోసాలు చేసినా, దొంగ దివాలా తీసి అప్పులెగ్గొట్టినా, వీరచక్రవడ్డీలు వసూలు చేసినా - పాపం కాదు. అంతేకాదు, కడుపుకి సుష్టుగా తినగూడదు; బంధువులకి పెట్టగూడదు; ప్రాణం అంటే వట్టిగాలే! డబ్బు అలా కాదే! అతని దృష్టిలో ఎక్కడ వడ్డీలు చేలో కలుపులాగా, నీటిలో నాచులాగా పరిమితి లేకుండా పెరుగుతాయో అదే అందమైన అద్భుత ఆదర్శ ప్రపంచం. ధనం అంత అపురూపమైనది. అట్టి ధనమును 'తమ పొడు పొట్ట కొరకో, బట్టకొరకో, లంక పొగాకు చుట్ట కొరకో ఖర్చు పెట్టే వాళ్లు పరమ మూర్ఖులు.

ఇంట్లోకి అడుగు పెట్టగానే లింగరాజుకి తను ఆ రోజు లక్ష్మీ ప్రార్థన చెయ్యడం మర్చిపోయినట్లు గుర్తొస్తుంది. వెంటనే లెంపలేసుకుని దండకం ప్రారంభిస్తాడు.

--"భార్యయున్ గీర్యయున్, బిడ్డలున్ గిడ్డలున్, దేవుడునే గీవుడనే, మోక్షమున్ గీక్షమున్, సర్వమున్ నీవె; నీకై శరీరాభిమానంబు వర్జింతు; నీకై అసత్య ప్రమాణంబు లన్నేని గావింతు; ఏ యింటికి నే పంపినక పోయి, ఆ యిల్లు మట్టంబు గావించి, నా యింటికి తెచ్చి, నాకిచ్చుచుండంగదే" -- తల్లీ లక్ష్మీదేవీ! 'నమస్తే, నమస్తే, నమః' అని పూజ ముగిస్తాడు.

ఇంతలో వంటవాడు వస్తాడు (ముసలి వయసులో మూడోసారి పెళ్లాడి తెచ్చుకున్న పడుచు పెళ్లాం - లింగరాజు భాషలో 'వన్నెల విసనకర్ర' - కోసం యిష్టం లేక పోయినా వంటవాణ్ణి పెట్టుకుంటాడు). వచ్చి, 'వంట మొదలెట్టాలి. సరుకులివ్వండి' అంటాడు. 'అప్పుడే ఏం తొందర? ధనుర్మాసం ధప్పళానికి ఎవరైనా పిలుస్తారేమో కొంచెం ఆగుదాం' అంటాడు లింగరాజు. 'అయితే నిన్నటి ఖర్చు పద్దు. రాసుకోండి' అంటాడు వంటవాడు. 'అలా అన్నావ్, బాగుంది. చెప్పు' అని లెక్కరాసుకోడం మొదలెడతాడు లింగరాజు.

లింగ:- బియ్యం ఎన్ని?
వంట:- మణెమెడు తక్కువ మానెడు
లింగ:- పిడకలు?
వంట:- రెండు
లింగ:- కట్టెలు?
వంట:- మూడు
లింగ:- నిప్పు పుల్లలు?
వంట:- నిన్న మధ్యాహ్నం చీల్చిన పుల్లల్లో నిలవబాపతు సగం
లింగ:- ఉప్పు?
వంట:- ఉద్దరిణెడు.
లింగ:- చింతపండు?
వంట:- నిన్న మధ్యాహ్నం పులుసుకోసం పిండగా నిలవవున్న తుక్కు
లింగ:- ఉట్లు ఏమి చేశావు?
వంట:- ఉంచా నీ పూటకు.
లింగ:- మిరపకాయలు?
వంట:- మూడు
లింగ:- మాగాయ?
వంట:- అమ్మగారికో టెంకా, అబ్బాయిగారికో ముక్కా.
లింగ:- మరి నీవో?
వంట:- బజార్లోంచి బంగాళా దుంపల కూర తెచ్చుకున్నాను.
లింగ:- ఏడిసినట్లుంది. ఇట్లాంటి బజారు వాసనలు తగిలితే అబ్బాయి పాడయిపోతాడు. ఇంకెప్పుడూ తేకు. అదిగో అటు చూడు. కరివేపాకు చెట్టు మీద కాకి గూడు పెట్టింది. అది పడగొట్టుకుని యీపూట పొయ్యి కిందికి వాడుకో!
వంట:- రామ! రామ! పక్షి గూడు పడగొట్టడం పాపమండీ!
లింగ:- నీ బొంద! పాపమేంటి? ఖరనామ సంవత్సరమంతా కాకి గూళ్లతోనే నడిచింది. వెళ్లు.

ఇంతలో లింగరాజు కొడుకు బసవరాజు అక్కడికొచ్చి ఫౌంటెన్ పెన్ కొనుక్కోడానికి డబ్బులిమ్మంటాడు. లింగరాజు, "కానీకి కలం (ఎప్పటికప్పుడు సిరాలో ముంచి రాసే పాతకాలపు పెన్ను) వస్తోంటే ఫౌంటెన్ పెన్ ఎందుకురా? అంత మోజుగా వుంటే పెళ్లిలో అలకపాన్పు మీద అత్తగార్ని నడిగి తీసుకొందువు గానిలే!" అంటాడు. బసవరాజు వెళ్లిపోతాడు.

లింగరాజు మనసులో యింకా ఆ విషయమే ఆలోచిస్తూ, "అబ్బబ్బా! కాయితాలనీ, కలాలనీ పీక్కు తింటున్నారు పాడు పంతుళ్లు, అందుకే గాంధీ గారు చదువులు వదిలెయ్యమన్నాడు. వీడితో చదువు మాన్పిద్దామంటే కట్నం తక్కువ పలుకుతుందేమోనని బాధ! నాకు మొదటి పెళ్లికి రెండు వేలు, రెండో పెళ్లికి నాలుగు వేలూ, మూడో పెళ్లికి ఎనిమిది వేలూ, మొత్తం పద్నాలుగు వేలు కట్నం వచ్చింది. ఈ వెధవకీ అలా వస్తుందేమోనని ఆశ పడుతుంటే, వెయ్యిస్తాం, రెండు వేలిస్తాం అనే వాళ్లే గాని, పట్టుమని పది వేలిస్తాం అనే వాళ్లే మన శాఖలో కరువై పోయిరి" అని వాపోతూంటాడు.

ఆ సమయంలో పేరయ్య వచ్చి పురుషోత్తమరావు గారి సంబంధం విషయం తెచ్చి, పిల్ల చక్కనిదేగాని వాళ్లు కట్నం యీయరనీ, ఆస్తి మాత్రం పిల్లకి వాళ్ల అమ్మమ్మ గారు యిచ్చిన పది ఎకరాల పొలం వుందనీ చెబుతాడు. లింగరాజు, ఆ పొలం తన పేర రాయిస్తే ఆ అమ్మాయిని తన కోడలిగా చేసుకుంటానంటాడు. పేరయ్య, అది కుదిరే పని కాదని, వెయ్యి న్నూట పదహార్లు మాత్రం యిప్పిస్తానంటాడు. లింగరాజు కనీసం ఐదు వేలు యివ్వాలంటాడు. పురుషోత్తమరావు రెండు వేల కంటె ఎక్కువ యివ్వలేడని చెబుతూ, పేరయ్య ఒక కుటిలోపాయం చెబుతాడు.... "పురుషోత్తమరావు వచ్చే సమయానికి వివాహాల వీరయ్య అక్కడే వుండి అతను మరో సంబంధం - మున్నంగి వారి అమ్మాయిది - తెచ్చినట్లూ, వాళ్లు చాలా ఎక్కువ కట్నం యివ్వడానికి సిద్ధంగా వున్నట్లూ, నాటకమాడితే ఆ పోటీలో రెచ్చిపోయి పురుషోత్తమరావు అయిదు వేల దాకా పాట పెంచవచ్చు" అని సలహా యిస్తాడు. లింగరాజు దానికి ఒప్పుకుంటాడు. ఇద్దరూ కలిసి ఆ కుట్ర అమలు చెయ్యడానికి నిర్ణయించుకుంటారు.

(ఇంకా వుంది)

-నిశాపతి



జూన్ 30న సుత్తి వీరభద్రరావు వర్ధంతి సందర్భంగా...

# 'సుత్తి' మెత్తని హాస్యనటుడు వీరభద్రరావు

**"హాయిగా నవ్వగలిగిన వాడు మరి నాలుగు సంవత్సరాల పాటు ఎక్కువగా బ్రతుకుతాడు" అనేవాడు- '80 దశకంలో తెలుగు సినిమాల్లో విలక్షణ హాస్యానికి తన సహజ నటనా వైదుష్యంతో సరికొత్త భాష్యం చెప్పిన 'సుత్తి' వీరభద్రరావు! ఈయన పేరు వినగానే మనకు వెంటనే "సుత్తి" గుర్తుకు వస్తుంది. ఈ పదం సినిమాల్లో పుట్టి ఈ ఏటికి ఇరవై ఏళ్లయినా నేటికీ పాపులర్‌గానే ఉంది. ఇందుకు వీరభద్రరావు ఆంగిక, వాచక, అభినయాలే కారణం.**



సుత్తి వీరభద్రరావుగా పేరుగాంచిన మామిళ్లపల్లి వీరభద్రరావు 1948 జూన్ 6న జన్మించాడు. చిన్ననాటి నుండే నాటక రంగం పట్ల ఆకర్షితులైన వీరభద్రరావు ప్రముఖ రచయిత, దర్శకుడు జంధ్యాల, రేలంగి నరసింహారావు తదితరుల సహచర్యంతో నటనలోని మెళకువలు ఆకళింపు చేసుకున్నాడు. పలు సాంఘిక నాటకాల్లో వీరభద్రరావు ఎన్నో రకాల పాత్రలను పోషించినా, ఆయనకు పేరు తెచ్చిపెట్టినవి మాత్రం హాస్య పాత్రలే. ముఖ్యంగా "రాగరాగిణి" నాటకంలోని 'రఘు' పాత్రతో పలువురి ప్రశంసలందుకున్నాడు.

వీరభద్రరావు సినీరంగ ప్రవేశం దర్శకుడు ధవళ సత్యం ద్వారా జరిగింది. 1980 ఏప్రిల్ 19న విడుదలైన "జాతర"లో తొలిసారిగా వెండితెరపై కనిపించాడు. ఆ తరువాత ధవళ సత్యం దర్శకత్వంలోనే వచ్చిన "ఎర్రమల్లెలు"లో వకీలు పాత్రలో "చచ్చు ప్రశ్న వేయకు" అనే ఊతపదంతో పలువురిని ఆకర్షించాడు. అనంతరం "విప్లవశంఖం", "మహాప్రస్థానం" చిత్రాల్లో నటించిన వీరభద్రరావుకు నటునిగా బ్రేక్‌నిచ్చిన వారు స్వర్గీయ జంధ్యాల. 1982లో ఆయన తీసిన "నాలుగు స్తంభాలాట"లో వేలుతో కలిసి "సుత్తి" అనే ఊతపదం వాడే పాత్రలో నటించిన వీరభద్రరావు "సుత్తి" అనే ఆ పదాన్ని పాపులర్ చేయడంతో ఆయన నట జీవితం మహత్తరమైన మలుపు తిరిగింది. ఈ చిత్రం సాధించిన విజయం వీరభద్రరావును బిజీ ఆర్టిస్టును చేసింది. అటునుండి ఎం.వీరభద్రరావు పేరు కాస్త "సుత్తి" వీరభద్రరావుగా మారింది. వేలుగారితో కలిసి

## 'ఆనంద భైరవి' సినిమాలో వీరభద్రరావు నటించిన ఓ సన్నివేశం



సుత్తివీరభద్రరావు: ఉ... మింగినట్టున్నావు ఆవకాయతో కొండంత వాయ

పేషంట్: చిత్తం ఆహా... చేయి చూడగానే ఎలా చెప్పగలిగారో మహానుభావులు

సు.వీ.: ఆవకాయలో వేడుంటుంది. ఆ వేడి నాలాంటి వాడిగల వైద్యునికి నాడిలో తెలుస్తుందిరా... బోడి! ఇదిగో ఈ మాత్రలు తీసుకుని వెళ్ళి రాత్రికి రెండు పొద్దుట పది మింగు.(ఇంతలో వేలు వస్తాడు) జంటగా వెళ్ళి ఒంటిగా తగలడ్డావే

పే: నేనాండి...

సు.వీ.: నిన్ను కాదు వాడిని, నువ్వెళ్ళు

పే: వత్తాను బాబారు.

సు.వీ.: కోడలేదిరా... కోడలేదంటే గోడలకేసి, నీడలకేసి చూస్తావేరా, ఊడల జుట్టు వెధవా... ఏం... అమ్మేశావా?

సు.వేలు: నా ఖర్మ, సినిమాకి వెళ్ళామా! అందులో ఓ మంచి ఫైటింగ్ సీన్ వచ్చింది. హీరో రౌడీలను బాత్తున్నాడు, అది చూసి నీ కోడలు... నీ కోడలు 'కఁయ్...........' అని అమెరికాకు వినబడేటంత గట్టిగా ఓ ఈల కొట్టింది. దానితో దీని ముందు సీట్లో కూర్చున్న ఒకావిడ గుండెజబ్బు వచ్చి పడిపోయింది.

సు.వీ.: ఆ... (అంటూ పడిపోతాడు)

సు.వే.: ఆ... నాన్న... నాన్న... నీక్కూడా...! నాకంత అదృష్టం కూడానా...!? (వీరభద్రరావు లేస్తాడు. వేలు తన సంభాషణ కొనసాగిస్తూ) ఆ ఈల విని ఆపరేటర్ అదిరిపడి సినిమా ఆపేసి లైట్లు వేసాడు. జనం అంతా మాకేసి చూస్తూంటే సిగ్గేసి నేను పారిపోయి వచ్చాను. అది మాత్రం కుర్చీ ఎక్కి నిలబడి మిగతా సినిమా కూడా చూపించమంటూ ఈల వేసి గోల చేస్తోందక్కడ.

సు.వీ.: అబ్బా... మనకా ఈలల గోల యేల!? ఈ ఈలన్నది ఇలలో కలలో మన ఇంటా వంటా లేని విద్యయే.

సు.వే.: అబ్బా... దాని ఈలతోనే చస్తుంటే, మధ్యలో నీ కవిత్వం గోల ఏమిటి నాన్న తలవాచిపోతోంది.









"సుత్తిజంట"గా
వీరిరువురికి జంధ్యాల నామకరణం చేశారు.

1982 నుండి ఈ సుత్తి జంట ఎంతగా పాపులారిటీ ని సంపాదించు కున్నదంటే సినిమా కథలో హాస్యం లేకున్నా వీరికోసం ప్రత్యేకంగా పాత్రలను కల్పించడం జరిగేది. హీరో, హీరోయిన్‌లు ఎవరైనా సరే వీరుమాత్రం బాక్సాఫీసుకు సూత్రమై కూర్చున్నారు. చాలా చిత్రాల్లో ఈ సుత్తి జంట నటన ప్రత్యేక ఆకర్షణగా ప్రేక్షకులు వ్యాఖ్యానించిన సందర్భాలు అనేకం. వీరభద్రరావు - వేలు కలిసి నటించిన 'ఆనందభైరవి', 'పుత్తడిబొమ్మ', 'మారుతి', 'అహ నా పెళ్లంట', 'నీకూ నాకూ పెళ్లంట', 'చూపులు కలిసిన శుభవేళ' , 'శ్రీవారికి ప్రేమలేఖ' చిత్రాలు ఏ నాటికీ మరుపురానివి. ఆనందభైరవిలో వేలు తండ్రిగా డాక్టరు పాత్రలో రకరకాల ప్రాసల్తో మాట్లాడడం, 'పుత్తడి బొమ్మ'లో కవిగా తన చెత్త కవిత్వంతో గ్రామస్తులను విసుగెత్తించడం, 'మారుతి'లో సుత్తివేలు తలపై గరిటతో మోదడంతో 'ముత్యాలముగ్గు'లో అల్లురామలింగయ్యలా కోతిగా నటించడం, 'అహ నా పెళ్లంట'లో కోట శ్రీనివాసరావు పీనాసి తనానికి బట్టలు చించుకుని వెర్రివాడుగా మారడం, 'శ్రీవారికి ప్రేమలేఖ'లో కోపం వస్తే దేనికైనా బుర్రని బాదుకోవడం ఇవన్నీ ప్రేక్షకులను గిలిగింతలు పెట్టేవి. ప్రజలు కూడా ఎవరినైనా సరే ఆటపట్టించాల్సి వస్తే 'సుత్తి వీరభద్రరావు' అనే నిక్‌నేమ్‌ను తగిలించే వారు. సుత్తి జంట నటించిన చిత్రాలన్నీ బాక్సాఫీస్ వద్ద హిట్ కావడం గమనార్హం. వేలుతో జంటగా దాదాపుగా 40 చిత్రాలలో నటించి పాతతరం వాళ్లయిన రేలంగి-రమణారెడ్డి, పద్మనాభం - బాలకృష్ణ నల్ల రామ్మూర్తి-సీతారాం, తదితర జంటలను గుర్తుకు తెచ్చాడు వీరభద్రరావు.



ఈ నేపథ్యంలో వీరభద్రరావు పల్లెటూరి మొనగాడు (విలన్‌గా), డబ్బెవరికిచేదు, సుబ్బారావుకు కోపం వచ్చింది, సుమన్, అగ్గిరాజు, కంచుకాగడా, అగ్గిపిడుగు, రుస్తుం, ఇల్లాలు-ప్రియురాలు, బుల్లెట్, మన్మథలీల - కామరాజుగోల, రక్తసింధూరం, రౌడీపోలీస్, ప్రచండభైరవి, బ్రహ్మనీరాత తారుమారు, పెళ్లికొడుకు లొస్తున్నారు. చాణక్యశపథం, కలియుగం, బాబులుగాడి దెబ్బ, పెళ్లిచేసిచూడు, చిలిపిదంపతులు, దొరబిడ్డ, కులాల కురుక్షేత్రం, బాబాయి - అబ్బాయి, కాబోయే మేనల్లుడు, గూండా, రౌడీ నెం.1, మొగుడు పెళ్లాలు, కలహాలకాపురం, కూలీ, ఝాన్సీరాణి, చిక్కడు దొరకడు, నాలుగిళ్లచావిడి, తిరగబిడ్డ తెలుగుబిడ్డ వంటి 80కి పైగా చిత్రాల్లో నటించాడు.

సుత్తి వీరభద్రరావు నెమ్మదస్తుడు. నిగర్వి. ఒకసారి చెప్పిన డైలాగును మరెప్పుడైనా అప్పజెప్పగల నేర్పరి. సహజంగా హాస్యప్రియుడు. సెట్లో కూడా తనదైన మేనరిజాన్ని అభినయించి అందరినీ నవ్వించే రసజ్ఞుడు. 'మన్మథలీల కామరాజుగోల' చిత్రంలో పుచ్చా పూర్ణానందానికి ముదుసలి భార్యగా పోషించిన పాత్రతోను, కొంటెకోడళ్లు చిత్రంలో గొర్లెం పాత్రలో విలన్‌గాను ఆయన తన ప్రతిభను నిరూపించుకున్నాడు.

"చూపులు కలిసిన శుభవేళ" సినిమా షూటింగ్ సందర్భంలో కాలు బెణకడంతో గాయపడిన వీరభద్రరావును మద్రాసులోని ఓ ప్రైవేటు ఆసుపత్రిలో చేర్పించారు. కానీ చికిత్స పొందుతూనే గుండె పోటుతో 1988 జూన్ 30న మరణించాడాయన. మరణానికి కొద్దిరోజుల ముందు అంటే జూన్ 6న తన జన్మదినం సందర్భంగా రచయిత మల్లాది

**'ఆనంద భైరవి' సినిమాలో వీరభద్రరావు నటించిన ఇంకో సన్నివేశం**



సు.వీ.: ఇప్పుడే బుర్రలో ఓ మెరుపు మెరిసిందిరా. కొత్త ప్రాస కనిపెట్టాను. 'క'తో ఇస్తా... ఏ కాకి... కాకీక కాకికి కోక... ఆకాకీక కాకికి కాక కోకికా కుక్కకా...!? ఇందులో 24 'క' లున్నాయి ఎలా ఉంది?

సు.వే.: ఈ ప్రాస మీ బొందలా ఉంది.

సు.వీ.: ఆ... పోనీ ఇంకోటి ఇస్తా... 'న' మీద...!
నాని నాని... నీనూనె నీనూనె నానూనె నానూనె... నేనైనేను నీనూనె నా నూనేనని, నా నూనె నీనూనేనని నిన్న నేనన్నానా... నోనో... నేనన్నానా నున్నని నాన్నా... నైనైనై.
ఇందులో 56 'న'లున్నాయి. లెక్క చూసుకో కావాలంటే.

సు.వే.: నాన్నా...! ఇవి కూడా కలుపుకో 58 అవుతాయి.



'అహ నా పెళ్ళంట'లో కోట శ్రీనివాసరావు, సుత్తి వీరభద్రరావు, డబ్బింగ్ జానకి

వెంకటకృష్ణమూర్తికి అభిమానంతో అగ్గిపుల్లంత పొడవుండే "సుత్తి"ని "వరల్డ్ బెస్ట్ జోక్స్" పుస్తకంతో బహూకరించి తనలోని స్నేహప్రియత్వాన్ని, హాస్యప్రియత్వాన్ని చాటుకున్నాడు.

కామెడీకి సరికొత్త భాష్యం చెప్పిన వీరభద్రరావు సినీ జీవితంలో నిలద్రొక్కుకోవడానికి ఎక్కువగా దర్శకుడు జంధ్యాల చిత్రాలే దోహదం చేశాయి. ఆయన నటించిన ఆఖరి చిత్రం (చూపులు కలిసిన శుభవేళ) కూడా జంధ్యాలదే కావడం గమనార్హం. మరణించే నాటికి ఆయన నటించిన చిత్రాలు పది విడుదలకు సిద్ధంగా ఉన్నాయి.

కేవలం ఎనిమిది సంవత్సరాలలోనే ప్రేక్షకుల్లో తనకంటూ ఒక ప్రత్యేకతను ఏర్పరచుకుని శాశ్వతమైన కీర్తిని పొందిన నటుడు వీరభద్రరావు!

**-హెచ్.రమేష్‌బాబు**

**'ఆనంద భైరవి' సినిమాలో వీరభద్రరావు నటించిన మరో రెండు సన్నివేశాలు**

సు.వీ.: అయ్యా... సర్వేశ్వర శాస్త్రిగారూ. మీ సిగ్గు బొగ్గులవ్వ... ఆ రోజు శర్మగారి మీద నెగ్గిన గర్వంతో దిగ్గున లేచి భగ్గున మండి పడ్డారు కదా!? ఈ రోజు నిగ్గు తేలిన ప్రభతో, ప్రతిభతో ఈ మల్లెమొగ్గ నెగ్గింది. మీ బుగ్గ వాచేలా జవాబు చెప్పింది. ఇక మీరు తగ్గేసి, మాటకు తల ఒగ్గేసి ఊరంతా ముగ్గేసి శర్మగారిని సన్మానించండి. ఆ తర్వాత మీకు సిగ్గనిపిస్తే... ఆ దగ్గు ఆపేసి నాదగ్గరకురండి ఓ ఉగ్గు గిన్నెడు మందిస్తాను, జగ్గు నీళ్ళు కలిపి, ఉగ్గు తాగినట్టు తాగి, రగ్గు కప్పుకుని పడుకుందురుగాని. ఇప్పుడు ఆయన కాళ్ళు కడగండి, చేతికి కంకణం తొడగండి.





సు.వే.: నాన్న... నీ ప్రాస ఆపు... ఛస్తున్నాను. ఈ జన్మలో నువ్వు కథ రాయలేవు, రచయితవు కాలేవు, ఇంకా ఎందుకీ ప్రాస, ప్రయాసాను.

సు.వీ.: నోర్ముయ్... మొక్కుబడికి బుక్కులెన్ని చదివినా బక్కచిక్కిన కుక్కగొడుగు మొక్కలా... చెదలు కొట్టేసిన చెక్కముక్కలా... కుక్క పీకేసిన పిచ్చి మొక్కలా బిక్క మొహం వేసుకుని... వక్క నోట్లో కుక్కుతూ బొక్కుతూ డెక్కుతూ చుక్కలు లెక్కపెడుతూ... ఇక్కడే ఈ ఉక్కలో గుక్కపెట్టి ఏడుస్తూ... ఈ చుక్కల చొక్కా వేసుకుని డొక్కు వెధవలా గోళ్ళు చెక్కుకుంటూ నక్క పీనుగులా చక్కిలాలు తింటూ... అరటి తొక్కలా... ముంగిట్లో తుక్కులా... చిక్కు జుట్టు వేసుకుని... ముక్కు పొడి పీలుస్తూ... కోపం కక్కుతూ... పెళ్ళాన్ని రక్కుతూ... పెక్కు దిక్కుమాలిన పనులు చేస్తూ... రెక్కలు తెగిన అక్కుపక్షిలా నక్కి నక్కి ఈ చెక్కబల్ల మీద బక్కచిక్కలా పడుకోకపోతే... ఏ పక్కకో ఓ పక్కకు వెళ్ళి... పిక్కబలం కొద్ది తిరిగి... నీ డొక్కశుద్ధితో వాళ్ళని ఢక్కాముక్కీలు తినిపించి... నీ లక్కు పరీక్షించుకుని ఒక్క చక్కటి ఉద్యోగం చిక్కించుకొని ఒక్క చిక్కటి అడ్వాన్సు చెక్కు చెక్కుచెదరకుండా పుచ్చుకుని తీసుకురావచ్చు కదరా తిక్క సన్నాసి...

ఇందులో 56 'క్క'లు ఉన్నాయి తెలుసా.



# న్యూస్ వ్యూస్

## కార్టూన్ నెట్‌వర్క్‌లో 'తెనాలి రామా'

టూంజ్ ఏనిమేషన్ సంస్థ 'తెనాలి రామకృష్ణుడి అద్భుత కృత్యాలు' (ఎడ్వంచర్స్ ఆఫ్ తెనాలి రామా) పేర ఏనిమేషన్ సీరీస్ తయారుచేస్తోంది. ఒక్కొక్కటి పదకొండు సెకండ్లు ఉండే ఈ ఇరవై ఆరు ఎపిసోడ్ల సీరియల్ కార్టూన్ నెట్‌వర్క్‌లో డిసెంబరు నుండి ప్రారంభం కాబోతోంది.

మూడేళ్ళ క్రితం ప్రారంభమయిన టూంజ్ సంస్థను అంతర్జాతీయ ఏనిమేషన్ మ్యాగజైన్ 'టాప్ టెన్'లో చేర్చింది. సాధారణంగా ఇండియన్ హ్యూమర్ వెస్టర్న్ ఆడియన్స్‌కి నప్పదని అందరూ అనుకునే నేపథ్యంలో 'తెనాలి రామకృష్ణ' వంటి ప్రాచీన కాలపు హాస్యాన్ని బుల్లితెరకెక్కించడం ఒకరకంగా సాహసమే! ఇది 'హిట్' అయితే బీర్బల్ వంటి తక్కిన భారతీయపాత్రలు కూడా విదేశీయులకు చేరువవుతాయేమో!

## సంగీత దర్శకుడిగా డా॥రాజకుమార్



కన్నడ చిత్ర రంగానికి మకుటం లేని మహారాజుగా వెలిగిన 'కన్నడ కంఠీరవ' డా॥రాజకుమార్ నటించిన చిత్రాలలో ఆయనకు ప్లేబ్యాక్ పాడినది మన పి.బి.శ్రీనివాస్. కొన్నాళ్ళకు ధైర్యంచేసి రాజకుమార్ తన పాటలు తనే పాడుకోవడం మొదలుపెట్టారు. 'సంపత్తిగె సవాల్' నుండి మొదలయిన ఆ గాత్ర జైత్రయాత్ర అప్రతిహతంగా సాగింది. రాజకుమార్ ఇప్పుడు సంగీత దర్శకత్వానికి పూనుకున్నారు.

'బనశంకరీదేవి' అనే దేవతపై ఆయన మిత్రుడు కీ॥శే॥ ఉదయ్ శంకర్ రాసిన ఎనిమిది పాటల ఆల్బమ్‌కు సంగీతం సమకూర్చడమే కాకుండా అందులో పాటలు కూడా పాడుతున్నారు రాజకుమార్. వీరప్పన్ చెరలో అన్నాళ్ళు ఉన్నా ఆయన మనోస్థైర్యం చెదరలేదనడానికి నిదర్శనంగా ఆయన కుమారుడు పునీత్ నటించిన 'అప్పు' సినిమాలో, రెండు పాటలు పాడిన రాజకుమార్‌కు లోగడ 'జీవన చైత్ర' సినిమాలోని 'నాదమయా...' పాటకు జాతీయ స్థాయిలో గాయకుడిగా బహుమతి లభించింది.

త్వరలో పురందరదాసు, జయచామ రాజవడయార్ (మాజీ మైసూరు మహారాజా)ల పాటలకు కూడా బాణీలు కట్టి ఆలపించే ఉద్దేశ్యంలో ఉన్నారు రాజకుమార్.

## బుల్లి తెర కెక్కనున్న కామిక్స్ హీరో



'చాచా చౌదరీ'ని ఇప్పుడు కేతన్ మెహతా టీవీ సీరియల్‌గా తీయబోతున్నారు. కార్టూనిస్టు ప్రాణ్ 1960లో ఆవిష్కరించిన చాచా చౌదరీ హిందీ కామిక్స్ చదివేవారికి సుపరిచితుడు. డైమండ్ కామిక్స్ వారు వాటిని ఇంగ్లీషులో కూడా పునర్ముద్రించారు. ఇంటర్నేషనల్ మ్యూజియమ్ ఆఫ్ కార్టూన్ ఆర్ట్‌లో చోటు సంపాదించుకునేటంత పాప్యులారిటీ సంపాదించుకున్న ఆ పాత్రను బుల్లి తెరపై పోషిస్తున్నది రఘువీర్ యాదవ్. అతని అసిస్టెంటు సాబూ పాత్ర ధరిస్తున్నది ప్రవీణ్‌కుమార్. (టీవీ మహాభారత్‌లో భీముడు)

## రవిశంకర్ కూతురు ఘన విజయం



పండిట్ రవిశంకర్ కుమార్తె నోరాజోన్స్ డెబ్యూ డిస్క్ "కమ్ ఎవే విత్ మీ" విడుదలవుతూనే విమర్శకుల ప్రశంసలు పొందింది. ఇప్పుడు వాణిజ్యపరంగా కూడా విజయం సాధించిందని అమ్మకాలు తెలుపుతున్నాయి. ఇప్పటివరకు లక్షా అరవైవేల కాపీలు అమ్ముడుపోయిన ఈ డిస్క్ టాప్ 40లో చేరింది. తండ్రికి తగిన తనయ అనవచ్చేమో.

## ఉవాచ



"బాడీని తగ్గించి, బాడీ లాంగ్వేజిని ఇంప్రూవ్ చేద్దామనుకుంటున్నా"

- హాస్యనటుడు సునీల్




# భార్యాభర్తల స్పెషల్

## హాస్యమ్ బాక్స్



"సినిమాకి టిక్కెట్లు తీసుకున్నాను.... టైముకి అందుకోగలమంటావా?"
"ఎందుకు అందుకోలేం? ఇప్పుడే తయారవడం మొదలు పెడతా".
"అదే బెస్టు... నేను తీసుకున్న టిక్కెట్లు రేపు రాత్రి ఫస్ట్‌షోకి".



"నావి పెట్టుడు పళ్ళని తెలిస్తే నీకు నా మీద కోపం రాదు కదా?" కొత్త పెళ్ళికూతుర్ని అడిగేడు పెళ్ళికొడుకు.
"కోపమా.. పాడా....!? అసలే చికాగ్గా వుంది నా విగ్గూ, చెక్కకాలూ తీసేద్దామనుకుంటుంటే" అంటూ అసలు సంగతి చెప్పింది కొత్తపెళ్ళికూతురు.



కుటుంబ సభ్యులంతా భోజనాలు చేస్తున్నారు.
"ఒరేయ్ నిన్న రాత్రి ఎక్కడో పిడుగు పడింది. ఎంత పెద్ద శబ్దం వచ్చిందో... విన్నావా?" అడిగాడు తండ్రి కొడుకుతో.
"విన్నాను... డాడీ..." అన్నాడు కొడుకు.
"అయితే... నన్నెందుకు నిద్ర లేపలేదు? అంత పెద్ద శబ్దం అయితే నిద్రలో నేను తుళ్ళిపడతానన్న సంగతి మీకు తెలుసు కదా" అంది తల్లి.



"గదిలో పెద్ద అద్దం పెట్టించాలి" భార్యతో అన్నాడు భర్త.
"ఏం? ఇప్పుడున్న అద్దం బాగానే వుంది కదా... చూసుకోవటానికి అది సరిపోదా ఏంటి?" ఎదురు ప్రశ్న వేసింది భార్య.
"సరిపోదు కాక సరిపోదు... ఎందుకంటే ఈ వారంలో యిప్పటికే మూడుసార్లు నేను ప్యాంటు వేసుకోకుండా బయటికి వెళ్ళాను..." సిగ్గుపడుతూ చెప్పాడు భర్త.



"మీకు తెలుసునా చాలా ప్రమాదాలు వంటింట్లోనే జరుగుతాయట..." అంది భార్య వడ్డిస్తూ.
"తెలుసు... వాటిలో కొన్నింటిని మేం తినవలసి వుంటుంది కూడా...." అన్నాడు భర్త.



"మా ఆవిడా నేను ఎప్పుడూ వాదించుకోం... ఆవిడ అనుకున్నదార్లో ఆవిడ పోతుంది...
నేనూ ఆవిడ దార్లోనే పోతాను....".




# భార్యాభర్తల స్పెషల్






"మా ఆవిడ మాట్లాడుతూ ఉంటే ఈ భూ ప్రపంచంలో ఎవ్వరూ అడ్డురాలేరు గాక రాలేరు".

"మా ఆవిడ మాట్లాడుతూ వుంటే మాత్రం మధ్యలో ఆటంకం కలుగుతూ ఉంటుంది. ఏంటంటే అప్పుడప్పుడు ఆవిడ మాట్లాడ్డం ఆపి శ్వాస తీసుకోవాలిగా మరి..."



ఒక యింట్లో భార్యాభర్తలు హోరాహోరీగా పోట్లాడుకుంటున్నారు.

చివరికి భార్యభర్తతో ఇలా అంది.

"మీ వల్ల తప్పుంటే మీరే పోతారు... నా వల్ల తప్పుంటే నా పసుపు కుంకుమే పోతుంది".



"మీ వారు రీసెర్చ్ స్కాలరంట. ఎప్పుడూ ఏదో ఒకటి అన్వేషిస్తూనే ఉంటారంట.అంతలా అన్వేషించడానికి ఏముంటుందండి?" అని అడిగింది పక్కింటి కుతూహలమ్మ.

"లేకనేం? ఆయన కళ్లజోడు లేదూ! రోజులో చాలా భాగం దాని అన్వేషణకే సరిపోతుంది" అంటూ జవాబిచ్చిందా ఇల్లాలు విసుగ్గా.



ఎలాగైనా మొగుడికి విడాకులిచ్చి వదిలించుకోవాలని ప్రయత్నిస్తున్నావిడ లాయర్ని తన ప్రశ్నలతో తెగ విసిగిస్తోంది-

"పోనీ మా ఆయనకు పాదాలు ఫ్లాట్‌గా ఉన్నాయన్న కారణం చెప్పి విడాకులు కోరవచ్చా?"

అంతవరకు శాంతంగా ఉన్న లాయర్ "ఆ పాదాలు మీ ఫ్లాట్‌లో కాక మీ పక్కింటావిడ ఫ్లాట్‌లో ఎక్కువసేపు ఉంటున్నాయని నిరూపించగలిగినప్పుడు తప్పకుండా కోరవచ్చు" అని సలహా ఇచ్చాడు వీలయినంతగా సహనం పాటిస్తూ.



"మీ ఆయన బావిలో పడి చనిపోయాడటగా పాపం..."

"అవును... అందుకే మేం ప్రస్తుతం కుళాయి నీళ్ళు వాడుకుంటున్నాం".



"పాయసం బాగుందోయ్.... కాస్త చక్కెర పడుంటే చాలా బాగుండేది...!"

"మీరు మరీనూ.... అది పాయసం కాదు... అన్నం కొద్దిగా నీరు పట్టిందంతే".



"మా ఆవిడ సమస్తమూ తీసుకొని నన్ను వదిలిపెట్టి వెళ్ళిపోయిందిరా" విచారంగా చెప్పాడు విశ్వనాథం.

"నువ్వు చాలా అదృష్టవంతుడివని చెప్పుకోవాలి. మా ఆవిడైతే సమస్తం తీసుకుంది. అయినా ఇప్పటికీ నన్ను వదిలి పెట్టలేదు" అన్నాడు రామనాథం దిగులుగా.




విడుదల : హెచ్.ఎం.వి

వెల : రూ.40/-




ప్రముఖ రంగ స్థల నటుడు, సినీ నటుడు అయిన కళ్యాణం రఘురామయ్య - ఈలపాట రఘురామయ్యగా, కృష్ణునిగా ఎంత ప్రసిద్ధుడో ఈ తరం వారికి తెలియక పోవచ్చు. కానీ (సినీ) సంగీతంపై అభిరుచి ఉన్న ప్రతి ఒక్కరూ అయన అనర్గళ గళ సామర్థ్యం గురించి తెలుసుకోవలసిన అవసరం ఉంది. హెచ్.ఎం.వి. వారు విడుదల చేసిన 'పద్మశ్రీ ఈలపాట రఘురామయ్య సినీ హిట్స్' ఆడియో క్యాసెట్ - ఆ అధ్యయనానికి ఓ 'కరదీపిక'లా ఉపయోగపడుతుందనటంలో ఏ మాత్రం సందేహం లేదు. ఈ క్యాసెట్‌లో వివిధ చిత్రాలలో రఘురామయ్య పాడిన 17 సినీ గీతాలున్నాయి.

హిందోళం, సింధుభైరవి రాగాలలోని జీవస్వరాలు రఘురామయ్య కంఠంలో ఎంతగా జవసత్వాలు పుంజుకుంటాయో 'శ్రితజన పాలా శ్రీలోలా' (దేవాంతకుడు) పాట తెలియజేస్తుంది. వివిధ రాగాలలో ట్యూన్ చేసిన రాగమాలికా గీతాలను ఆలపించేటప్పుడు ఒక రాగం నుంచి ఇంకో రాగంలోకి ఆయన ఎంత సునాయసంగా పయనించగలడో 'శ్రీహరి లీలలు కనరా' (చింతామణి) 'జీవా ముక్తి మార్గమును కనలేవా' (శ్రీకృష్ణమాయ) అనే పాటల ద్వారా తెలుసుకోవచ్చు. యస్.రాజేశ్వరరావు బాణీ - హిందుస్థానీ సంప్రదాయంతో - మరాఠీ నాటకాల ఆలాపనలలో కలగలిస్తే ఆ సొగసులు ఎంతగా గుబాళిస్తాయో 'ఔనులే ఈ సుఖమే సుఖము' (మోహినీ భస్మాసుర) పాట తెలుపుతుంది.

అంతేకాదు గమకాలలో, ఆలాపనలలో తన ప్రతిభను ప్రదర్శించుకునే విన్యాసాలు చేయాలంటే సాధన చెయ్యడానికి ఎటువంటి పాటలను ఎన్నుకోవాలో తెలిపే పాట ఇది. బాపుగారికి రఘురామయ్య గారంటే ప్రత్యేకమైన గౌరవం. అందుకే తాను తీసిన 'జాకి' సినిమాలో 'ఓ స్వారి చేసే నారి' అనే పాటలో ఒక దగ్గర రఘురామయ్య గారిలా ఓ గమకం ఉండాలని బాలూని అడిగి మరీ పాడించుకున్నారు. ఆ ఇష్టం బాపుగారు తీసిన 'శ్రీరామాంజనేయ యుద్ధం' సినిమాలో 'రామనీల మేఘశ్యామ కోదండరామా', 'సాకేత సార్వభౌమ' పాటల్లో స్పష్టంగా తెలుస్తుంది. 'సాకేత సార్వభౌమ' పాట దోస్తిలోని 'ఆవాజ్‌మైన దూంగా' పాటను గుర్తు చెయ్యవచ్చు గాక... అది వేరే సంగతి... మొత్తానికి 'రామాంజనేయ యుద్ధం'లోని ఆ రెండు పాటలు ఈ క్యాసెట్‌లో ఉన్నాయి. 1940 దశకంలో సినిమా సంగీతం ఎలా వుండేదో 'గొల్లభామ'లో హీరోయిన్ కృష్ణవేణితో రఘురామయ్య పాడిన 'చందమామ' పాట, 'ప్రేమ సుధామధురము కదా' పాట వింటే అవగాహన కొస్తుంది. అంతేకాదు విప్రనారాయణలోని 'ఎందుకోయీ తోటమాలి' పాటకి తగిన రాగాన్ని ఎన్నుకోవటంతో ఈ చందమామ పాట ప్రేరణ ఉందనిపిస్తుంది. అలాగే 1950కొచ్చే సరికి సినీ సంగీత ధోరణిలో ఎంతో మార్పు వచ్చినా రఘురామయ్య గారి పాటకొచ్చే సరికి ఆయన పరంగా, ఎటువంటి మార్పు చెందలేదని నాగులచవితిలోని శ్రీపతి మోహనా పాహిమాం, ప్రభు నీదు మహిమ, 'భక్త మార్కండేయ' లోని శివనామా, దేవాది దేవా పాటల ద్వారా తెలుస్తుంది. అందుక్కారణం శ్రోతలలో ఆయనకంటూ ఓ వర్గం ఉండడమే!.

ఇక - సంగీత దర్శకుడిగా ఘంటసాల మోహనరాగంలో స్వరపరిచిన తిరుమలగిరి వాసా, లేరు కుశలవుల సాటి, తిరుమల మందిర సుందర వంటి పాటలను గుర్తుకు తెచ్చుకుంటే ఆ రాగం ఘంటసాల బాణీలో రఘురామయ్య పరంగా ఎలా ఉంటుందో హరేనారాయణ (వాల్మీకి) పాట చెప్తుంది. అదే మోహనరాగంలో టివి రాజు స్వరపరిచిన ఈనాటి ఈ హాయీ, కృష్ణాముకుందా మురారీ వంటి పాటలు గుర్తుకు తెచ్చుకుంటూ ఆయన బాణీలో రఘురామయ్యగారి గళం ఎలా విజృంభిస్తుందో 'కరమే జగాన' (శ్రీకృష్ణమాయ) పాట వివరిస్తుంది. ఇక - భీంప్లాస్ రాగాన్ని వాడని సంగీత దర్శకుడు ఉండడంటే అందులో అతిశయోక్తి లేదు. అయితే రాగాన్ని వాడడంలో యస్.రాజేశ్వరరావు గారికి ఎటువంటి ముద్ర ఉందో, రాగపరిజ్ఞానం గల ప్రతి శ్రోతకు అనుభవమే.

అయితే అన్నదమ్ములైన రాజేశ్వరరావు, హనుమంతరావు ఈ రాగాన్ని ఉపయోగిస్తున్నప్పుడు వారిద్దరిలోనూ ఎంత భావసారూప్యం ఉందో 'కానరు నీమహిమ' (దక్షయజ్ఞం) పాట తేట తెల్లం చేస్తుంది. కొన్ని రాగాలపై పూర్తి పట్టుని సంపాదించుకోవాలంటే ఆ రాగాన్ని పెర్ఫెక్ట్‌గా ట్యూన్ పరంగా గాని టోన్ పరంగా గాని కలిగిన పాటలను సాధన చెయ్యవలసి ఉంటుంది. బిళహరి రాగానికి పూరయ మమకామం (దేవాంతకుడు) పాటని, శుభపంతువరాళి రాగానికి కనలేవా ఓ జీవా (చింతామణి) పాటని తీసుకుని ప్రాక్టీస్ చేస్తే ఆ రాగాలలోని లోతుపాతులతో పాటు గాయకుడిగా రఘురామయ్య సామర్థ్యం ఎంతటిదో అనుభంలో కొస్తుంది.

కొన్నింటిని ఆస్వాదించాలంటే మనసుని అందుకు తగ్గట్టుగా ట్యూన్ చేసుకోగలగాలి. అప్పుడే ఎన్నో విషయాలు అర్థమయ్యే అవకాశం ఉంటుంది. ఈ - ఈలపాట రఘురామయ్య సినీ హిట్స్ ఆడియో క్యాసెట్ కూడా

(తరువాయి 36వ పేజీలో..)

జూన్ 22 జూడీ గార్లండ్ వర్ధంతి సందర్భంగా...

# అతని మతిమరుపే ఆమెను జూడీ గార్లండ్ చేసింది!

జూడీగార్లండ్ పేరు హాలీవుడ్ మ్యూజికల్స్‌తో మాత్రమే కాదు, "జడ్జిమెంట్ ఎట్ న్యూరంబర్గ్" (1961) వంటి సీరియస్ సినిమాలతో కూడా ముడి పడి వుంది. నిజానికి ఆ సినిమాకు ఆమెకు ఆస్కార్ నామినేషన్ కూడా వచ్చింది. ("ఎ స్టార్ ఈజ్ బోర్న్ (1954)" కి కూడా ఆస్కార్ నామినేషన్ వచ్చింది) ఎన్నో మ్యూజికల్స్‌కు దర్శకత్వం వహించిన విన్సెంట్ మిన్నెలికి భార్యగా అతను దర్శకత్వం వహించిన "మీట్ మీ ఇన్ సెయింట్ లూయీ" (1944) వంటి మ్యూజికల్స్‌లో ఆమె నటనకు, గానానికి పేరు తెచ్చుకుంది.



జీన్ కెల్లీతో జూడీ

చైల్డ్ స్టార్‌గా కెరియర్ ప్రారంభించి, హాలీవుడ్ స్టూడియో సిస్టమ్‌కి బలయిన తారలలో జూడీ ఒకరు. తనను చిత్రరంగంలో పైకి తీసుకొచ్చిన వారితో ఆమెకు తగాదాలు వచ్చాయి. తెరపై అందచందాలు, ఆహ్లాదం చిందించినా ఆమె వ్యక్తిగత జీవితం వ్యథాభరితం. మిన్నెలితో వివాహం భగ్నమయింది. మొత్తం అయిదుసార్లు వివాహమాడింది. చివరిగా తన కంటె తక్కువ వయస్సున్నతని పెళ్లాడి, ఆర్నెల్లలోనే విడాకులు ఇచ్చేసింది. కెరియర్ చివరిదశలో చాలా ఫ్లాప్‌లు చవిచూసింది. నిద్రమాత్రలకు బానిసయి, చివరికి తన 47వ యేట 1969 జూన్ 22న పొరబాటున ఎక్కువ మోతాదులో నిద్రమాత్రలు తీసుకోవడం వల్ల మరణించింది.

క్లార్క్ గేబుల్ 36వ జన్మదినోత్సవాలలో అప్పటికి 15 ఏళ్ల జూడీ "డియర్ మిస్టర్ గేబుల్" అనే పాట పాడింది. ఎమ్.జి.ఎమ్. అధినేత లూయీ మేయర్‌కి అది ఎంత బాగా నచ్చిందంటే "బ్రాడ్వే మెలడీ ఆఫ్ 1938" అనే సినిమా తీసి గేబుల్ ఫోటో ఎదురుగా జూడీ పాట పాడే దృశ్యాన్ని చొప్పించాడు. ఆ పాటే ఆమెకెంతో పేరు తెచ్చి పెట్టిన "యూ మేడ్ మీ లవ్ యూ"!.

జూడీ గార్లండ్ అసలు పేరు ఫ్రాన్సిస్ గమ్. తన అక్కలతో కలిసి 3వ యేట నుండి "గమ్ సిస్టర్స్ కిడ్డీ ఏక్ట్" అనే పేర ప్రదర్శనలు ఇచ్చేది. ఓ ప్రదర్శనకు ప్రఖ్యాత హాలీవుడ్ నిర్మాత జార్జ్ జెస్సెల్‌ను ఆహ్వానించారు. అతడు ఈ బాలతారను వేదిక మీదకు ఆహ్వానించి ప్రేక్షకులకు పరిచయం చేయాలి. కానీ సమయానికి అతనికి ఈమె పేరు గుర్తుకు రాలేదు. అంతక్రితమే అతను జుడిత్ ఏండర్సన్ అనే తారకు ఒక లేఖ పంపి వున్నాడు. దానిలో "గార్లండ్" అనే పదం ఉపయోగించి వున్నాడు. ఛట్టున జుడిత్‌లో జూడీ, గార్లండ్ పదం గుర్తుకు వచ్చాయి. "ఇప్పుడు మిమ్మల్ని తన పాటలతో అలరించబోయేది "జూడీ గార్లండ్" అని ఎనౌన్స్ చేసేశాడు. అప్పట్నుంచి ఆ పేరే స్థిరపడిపోయింది!

# హాసం - హెచ్.యమ్.వి. ఐడియా బ్యాంక్



మీ
ఫోటోతో
హెచ్.యమ్.వి.
నుండి ఆడియో
క్యాసెట్

అప్రయత్నంగానే మనకి కొన్ని ఆలోచనలు
వచ్చేస్తూ ఉంటాయి
ఫలానా గాయకుడి పాటలు ఫలానా గాయని పాటలు
ఫలానా సంగీతదర్శకుడు, రచయిత, గాయనీ గాయకుల కాంబినేషన్‌లో పాటలు
లభ్యంకాని లేదా అరుదుగా లభించే పాత సినిమాల కాంబినేషన్‌లు...
ఇవన్నీ...
ఆడియోలుగా రిలీజ్ చెయ్యొచ్చు కదా అని తెగ ఫీలయిపోతూ ఉంటాం...




అలా ఫ్లాష్‌లా వచ్చిన ఐడియాలని ఓ కాగితంమీద పెట్టి దిగువనున్న కూపన్‌ని జతపరచి 'హాసం' అడ్రసుకు పంపండి. మీ ఐడియా హెచ్.యమ్.వి. వారికి నచ్చితే మీ పేరును 'హాసం' ప్రచురిస్తుంది. ఆ తరువాత మీరు మీ కలర్ ఫోటోను (పాస్‌పోర్ట్ సైజులో) 'హాసం' అడ్రసుకు పంపాలి. మీ ఐడియాతో హెచ్.యమ్.వి. వారు ఓ ఆడియో క్యాసెట్‌ను విడుదల చేస్తారు. ఆ ఆడియో క్యాసెట్ కవర్‌పై మీ ఫోటో ఉంటుంది.

## హాసం - హెచ్.యమ్.వి. ఐడియా బ్యాంక్

పంపిన వారి పేరు : ______________________

అడ్రసు : ______________________

: ______________ ఫోన్ నెం : ______________

______________________




(34వ పేజీ తరువాయి)

అటువంటిదే! అలనాటి సినీ సంగీతంపై మరాఠీ నాటకాలలోని పద్యసంగీత ప్రభావం, ఆ ధోరణిలో కృషి చేసి ఆ వాతావరణం నుంచి సినీ రంగానికొచ్చిన నట గాయకుల గాన విధానం, గళ విన్యాసాలు, బిరకాలు, దగ్గర గమకాలు, సుదీర్ఘ ఆలాపనలు, వీటన్నిటితో గళ సామర్థ్యానికి పదును పెడుతూ ఏళ్ళ తరబడి ఆ ప్రతిభను కాపాడుకునే క్రమశిక్షణ ఇలా ఎన్నో అంశాలపై పరిశోధన చెయ్యదగ్గంత సరంజామా, సమాచారం గల క్యాసెట్టే తప్ప ఏదో సరదాగా కాలక్షేపం కోసం విని పడేసే క్యాసెట్ మాత్రం కాదిది. యాంటిక్ వాల్యూస్ ఉన్న ఇటువంటి క్యాసెట్‌ను తీసుకురావటానికి ఎంతో అభిరుచి ఇంకెంతో ధైర్యం ఉండాలి. ఆ కోణంలో హెచ్.ఎం.వి. వారు అభినందనీయులు.

అయితే ఈ రకం జిజ్ఞాస కలిగిన వారందరికీ చత్వారం అధిక పాళ్ళలో ఉండే అవకాశం ఉంటుంది కనుక సంబంధిత వివరాలను పేర్కొనే ఇన్‌లే క్యాసెట్‌పై ముద్రించిన అక్షరాలను మరికాస్త పెద్దవిగా ప్రచురించటం ఎంత అవసరమో, అందం కోసం వెనుక టింట్‌లు వాడడం, బొమ్మలపై ఓవర్‌లాప్ చెయ్యటం లాంటివి లేకుండా ఉండటం కూడా అంతే అవసరం. తప్పదనుకుంటే ఇన్‌లే కవర్ లోపలి భాగం ఎలాగు ఉండనే ఉంది కనుక అక్కడ ఈ వివరాలను ప్రచురిస్తే ఉపయుక్తంగా ఉంటుంది.




విడుదల : మయూరి
వెల : రూ. 35/-

ప్రముఖ దర్శకుడు కె.రాఘవేంద్రరావు తనయుడు సూర్యప్రకాష్ హీరోగా ఉషాకిరణ్ పతాకంపై 'ఈనాడు' రామోజీరావు గారు నిర్మించిన 'నీతో' సినిమా ఆడియో క్యాసెట్ విడుదలయింది. ఈ చిత్రానికి కథ, స్క్రీన్ ప్లే, దర్శకుడు జాన్ కాగా ఇళయరాజాతో పోల్చదగ్గ సామర్థ్యం గల విద్యాసాగర్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు. పాటల రచయితగా చంద్రబోస్ సింగిల్ కార్డ్ హోల్డర్.

క్యాసెట్‌లో తొలిగీతం 'నవ్వాలి నీతో నడవాలి నీతో'లో తొలి తాంబూలం ఎవరికివ్వాలన్న మీమాంసను అటు విద్యాసాగర్ స్వరమాధుర్యం ఇటు హరిహరన్ గళ మాధుర్యం పోటాపోటీగా కలిగిస్తాయి. మ్యూజిక్ పరంగా ఈ ట్యూన్‌ను (పల్లవి వరకు) 'చిగురాకు ఎవరో చిరుగాలి ఎవరో' అనే పాట ద్వారా వినెయ్యడం జరిగిందన్న విషయం గుర్తొస్తే అందుకు విద్యాసాగర్‌ని ఇమ్మీడియట్‌గా తప్పు పట్టేసు కోకుండా కాస్త పరిశోధిస్తే ఈజీగా అర్థం అయిపోతుంది. పాటను వినగానే రచయితగా చంద్రబోస్ ఎంతమంచి ఎక్స్‌ప్రెషన్లు ఇచ్చాడో తెలిసిపోతుంది.

హరీష్ రాఘవేంద్ర పాడిన 'అరెరె ఎవరిది అరెరె ఎవరిది' పాట ట్యూన్ పరంగా రెగ్యులర్ మెలోడీస్‌లో ఓ సరికొత్త పంథాను తొక్కిన మంచి మెలోడి. పదే పదే పాడుకుంటే మనసుకి మరికాస్త దగ్గరయ్యే అర్హతలున్న పాట యిది. 'ఎరుకయ్యి మనసంతా చెఱుకయ్యిందీ' అనే ఎక్స్‌ప్రెషన్ సాహిత్య పరంగా బావుంది.

'పన్నెండిటికి పడుకొంటే కొంటెగ కలలో కొస్తావు' పాటలో చంద్రబోస్ చాలా చమత్కారంగా శృంగారాన్ని అందించాడు. ట్యూన్ కూడా ఎంతో హాయిగా, సాఫీగా సాగింది. చిత్రతో పాటు ఈ పాటను పాడిన విజయ్ ఏసుదాస్ వేరెవరో కాదు మన ఏసుదాసు గారబ్బాయే...! బాలూ గారబ్బాయి చరణ్ పాడితే ఎలా బాలూ స్టయిల్ తెలుస్తూ ఉంటుందో ఈ విజయ్ ఏసుదాసు పాడిన పద్ధతి కూడా తండ్రి ఏసుదాసుని గుర్తుకు తెస్తూ వుంటుంది.

'జాజి పూలు మల్లెపూలు' పాటలో Poolని, Foolని, పూలని కలిపి 'పన్ చేసుకుంటూ' చంద్రబోస్ చేసిన స్కీమింగే ప్రధాన ఆకర్షణ. ఈ పాటను శ్రీరాంపార్థసారధి, సుజాత పాడారు. శ్రీరాం పార్థసారధి ఈ పాట ద్వారా పరిచయం అయిన కొత్త గాయకుడు. ఇతడు 'పాడుతా తీయగా' పార్థసారధి కాదు.

కెకె, సాధనాసర్గమ్ పాడిన 'పంచభూతాల సాక్షిగా' పాటలో ఓ స్వీట్ మెలోడి ఉంది. కాకపోతే ఇంత స్లోగా ఉంటే అది ఈ ఫాస్ట్ బీట్ కాలంలో ఎంతవరకు ఆదరిస్తారో అనే సందేహం కలగటం సహజం. లిరిక్ పరంగా ఉన్న అక్షరాల్నిదాటుకొని లోతుగా చూస్తే చంద్రబోస్ రాసిన 'నిన్ను నువ్వు దాటుకుని బయటకు రమ్మన్నా'లాంటి వాక్యాలు బాగా రాయాలన్న అతని తపనను తెలియ జేస్తాయి. కాకపోతే 'పంచాక్షరాల సాక్షిగా' బదులు 'పంచాక్షరి సాక్షిగా' అని వుంటే బావుండేదనిపిస్తుంది.

కార్తీక్, జయచంద్రన్, షాలిని పాడిన 'పేరేదైనా ఊరేదైనా వుండాలంటూ దిల్‌దిల్' పాట వినగానే యూత్‌కి పట్టే ఆకర్షణతో ఉన్న బీట్ సాంగ్‌ని ఉందనిపిస్తుంది గాని నిజానికి వ్యక్తిత్వ వికాసానికి కావలసిన మంచి సందేశాలున్న పాట యిది. లైఫ్ ఈజ్ ఎ గేమ్... ప్లే యిట్, లైఫ్ ఈజ్ ఎ పజిల్ సాల్వ్ యిట్ అంటూ చిన్నప్పుడు మనం చదువు కొన్న కొటేషన్లకు అందమైన తెనిగింపు ఈ పాట. 'ఈ పుట్టుకనిచ్చిన కన్న వాళ్ళను పూజించే టందుకు దిల్ / కర్పూరంలాగా కన్నబిడ్డకై కరిగే టందుకు దిల్' లాంటి వ్యాకాలు ఆ కొటేషన్‌లలో ఉండవు. అవి కేవలం మన భారతీయుల సొంతం. ఇటువంటి వాక్యాలతో సెంటిమెంట్ పరంగా చంద్రబోస్ మార్కులు కొట్టేస్తాడు.





## రచన: చంద్రబోస్ — 1 — గానం: హరిహరన్

ప: నవ్వాలి నీతో నడవాలి నీతో నెలవంక మీద నిలవాలి నీతో
ఆడాలి నీతో అలగాలి నీతో హరివిల్లు మీద ఊగాలి నీతో
తడవాలి నీతో ఆరాలి నీతో గడపాలి అనుక్షణం నేను నీతో
చ: వస్తానని మాటిచ్చాకా కావాలని నేరాలేక నీలో చాలా ఆరాటాన్నే పెంచాలి
వేరే కన్నెను నేనింక వంకర చూపులు చూసాక నీలో కలిగే అక్రోశాన్నే కాంచాలి
నీ పైట గాలిని పీల్చాలి నీ మాట తేనెను తాగాలి
నును లేత చీవాట్లు తింటూ నీతో ॥నవ్వాలి॥
చ: చీటికి మాటికి ఊరించి చిలిపితనంతో ఉడికించి
ముద్దుగ మూతిని ముడుచుకునుంటే చూడాలి
అంతకు అంతా లాలించి ఆపై నీపై తలవాల్చి బ్రతిమాలేస్తూ జతగా నీతో బతకాలి
నీ వేలి కొనలను నిమరాలి నీ కాలి ధూళిని తుడవాలి
అరచేతి గీతల్లే ఉంటా నీతో ॥నవ్వాలి॥

## రచన: చంద్రబోస్ — 2 — గానం: హరీష్‌రాఘవేంద్ర

ప: అరెరె ఎవరిది అరెరె ఎవరిది అరెరె ఎవరు యిది
మెరుపై కనబడి చినుకై అడుగిడి మనసును తడిపినది
ఇది అని తెలియని యిదివరకెరుగని అలజడి రేపినది
కలయిది కాదని నిజముగ నిజమని బుజువులు చూపినది
హృదయాన్ని నిమిషంలో దోచేసింది
దోచేసి మబ్బుల్లో దాగేసింది ఎందుకో ॥అరెరె॥
చ: యిన్నాళ్ళు లోకాన ఇందరిని చూస్తున్నా ఏనాడు రాలేదు ఈ స్పందనా
తనవల్ల కలిగింది నవభావనా
ఏవైపు వెళుతున్నా ఏచోట కూర్చున్నా తన వైపు మళ్ళింది ఆలోచనా
తనలోన ఏముందో ఆకర్షణ
ఆకలేమొ లేకుంది నిద్దరేమొ రాకుంది అర్థమయ్యి కాకుంది
అంతులేని బాధుంది బాధలోన తీపుంది తీపిబాధ తెలిసింది
తొలి చూపుల్లోన తన్మైనప్రేమైనదీ మరు నిమిషంలోనా ఆ మైనా మరుగైనది ॥హృదయాన్ని॥
చ: తన ఊహ ఊపిరిగా తనరూపు చూపులుగా తానేమొ నాలోనే స్థిరమైనదీ
నా తనువు రెట్టింపు బరువైనదీ
నా నడక పరుగులుగా నా పలుకు కవితలుగా అనుకోని కళ నాకు ఎరుకైనది
ఎరుకయ్యి మనస్సంతా చెలుకైనదీ



ఊపిరిలోని గాలికి బదులు
హృదయంలోని లయలకు బదులు అంతా నీ ప్రేమే...
దేహంలేని జీవం బదులు
కోవెలలోని దైవం బదులు అన్నీ నీ మయమే...
మనసారా చెబుతున్నా మనస్సుతో విను యీ మాట ॥పంచ॥
చ: ఆ ఆ... ఎంత ఆపుకుంటున్నా అంత ఆగ లేకున్నా
అంతులేని అలజడిని నాలో చూస్తున్నా... ఓ
ఇన్ని నాళ్ళ తెరలన్నీ ఇప్పుడైనా తెరుచుకొని
నిన్ను నువ్వు దాటుకొని బైటికి రమ్మన్నా
నాలో ప్రేమను దాచాలన్నా నాటకమేదో ఆడాలన్నా
ఆడక పోతున్నా...
గాలిని వలలో బంధిస్తావా ప్రేమను మదిలో మూసేస్తావా అయ్యే పనియేనా...
నా గుండె గొంతెత్తి నిజమే నీతో చెబుతున్నా ॥పంచ॥

## రచన:చంద్రబోస్ — 6 — గానం: కార్తీక్, జయచంద్రన్, షాలిని

ప: పేరేదైనా ఊరేదైనా ఉండాలంటూ దిల్ దిల్
రూపేదైనా రంగేదైనా ఉండాలంటూ దిల్ దిల్
ఆడేటందుకు దిల్ - పోరాడేటందుకు దిల్
పాడేటందుకు దిల్ - కాపాడేటందుకు దిల్
అరె ఏ పనికైనా ఎప్పటికైనా ఉండాలంటూ దిల్
చ: జీవితమంటే సాహసమేగా చేసేటందుకు దిల్
జీవితమంటే సాగరమేగా యీదేటందుకు దిల్
జీవితమే అవకాశం దానిని అందుకొనేందుకు దిల్
జీవితమే ఆటంకం దానిని దాటేటందుకు దిల్
యీ జీవితమంటే పోరాటం గెలుపొందేటందుకు దిల్
యీ జీవితమంటే పొడుపు కథ విప్పేసేటందుకు దిల్
చ: జీవితమంటే అలయమేగా వేడుకునేందుకు దిల్
జీవితమంటే ఆయుధమేగా వాడుకునేందుకు దిల్
జీవితమే ప్రియురాలు దానిని ప్రేమించేందుకు దిల్
జీవితమే మూణ్ణాల్లు హాయిగా జీవించేందుకు దిల్
చ: ఈ పుట్టుక నిచ్చిన కన్నవాళ్ళను పూజించేందుకు దిల్
చ: కర్పూరంలాగా కన్నబిడ్డకై కరిగేటందుకు దిల్



## రచన : సీతారామశాస్త్రి — 1 — గానం : సురేష్ పీటర్, చిన్మయి, అపర్ణ

కింగిని మింగిని కింగిని మియామావ్
కింగిని మింగిని కింగిని మియామ ఆ ఆవ్
కింగిని మింగిని కింగిని మింగిని కింగిని మింగిని కింగిని మింగిని
కింగిని మింగిని కింగిని మియా మ ఆఆవ్
ప/అ: చిలిపి చిలక వలకు పడిందోయ్
ఆ1: వలపు చిటిక చెలికి మహా నచ్చిందోయ్
ఆ2: ఉడుకు దుడుకు వయసుగనక కునుకు-విడని కలలవెనక
నదురు బెదురు అనక ఎగిరి పోతోందోయ్ ॥చిలిపి॥
చ/అ: ఫ్రీగా వదిలేసే నీ సోకు సైగ చూసా
డైల్ లేసేసి నిను పట్టేసా
ఆ1: పాపం తెగచూసే నీ సంగతేదో చూసా
చాలా జాలేసి మనసిచ్చేసా
ఆ2: ఓటేసే వయసేలేదే, మరి లవ్ చేస్తే మతిచెడుతుందే
కో: ప్రేమ పిచ్చి పుట్టుకొచ్చి తరుముకొచ్చెనోయ్ ॥కింగిని మింగిని॥ ॥చిలిపి॥
చ/ఆ2: ముందే చెబుతున్నా చెడిపోకు పిచ్చికన్నా
దిగితే అయిపోతావ్ దీవానా
అ: నిండా మునిగాక దిగులేమి ఉండదింకా
నువ్వే అవునంటావే దిగి చూసాక
ఆ1: ఏమైనా ఎవరేమన్నా ఎదురేమున్నా ఇది ఆగేనా
కో: ప్రేమ పిచ్చి పుట్టుకొచ్చి తరుముకొచ్చెనోయ్ ॥కింగిని మింగిని॥ ॥చిలిపి॥

## రచన : సీతారామశాస్త్రి — 2 — గానం : అపర్ణ, దేవన్

ప/అ: రా పోదాం షికారుకి
ఆ: చాలన్దాం ఇవ్వాళ్టికి
అ: టాసేద్దాం ప్రోగ్రాముకి
ఆ: సరె లే కాని...
అ: ఎగరేయ్ కాయిన్ని
ఆ: హెడ్డైతే మనింటికి
ఆ: వెళదాంలే పదింటికి
ఆ: ఏం చెబుతాం పెద్దాళ్ళకి
అ: ప్రయివేట్ క్లాసు
ఆ: ఓ.కె. బాసు
చ/అ: పిజ్జా వేస్టు, బర్గర్ బెస్ట్ ఎడ్జస్ట్ అయిపోదామా
ఫ్రెండ్‌షిప్ అంటే ఎడ్జస్ట్‌మెంటే హాహా కాదనకమ్మా
ఆ: స్నేహం అంటే ఒక్కరు కాదు ఇద్దరు ఉంటారమ్మా



ఆ: కొత్తకదా సరసంకోరే నీ సరదా
అ: ఓ.... మొదలయే నిప్పు ముదిరితే ముప్పుకాదా... ॥సరసరం॥
చ/ఆ: కైపుకళ్ళ గమ్మత్తు రేపుతోంది ఓ మత్తు
అ: చీకటల్లె నీ జుట్టు కలలునింపె నా చుట్టూ
ఆ: ఆపేదెలా నీ అల్లరి
అ: ఆర్పేదెలా ఈ ఆవిరి
ఆ: ఒడికొస్తే తికమకలన్నీ ఒదిలిస్తే
అ: చనువిస్తే ఇక నీ వెనకే పడిచస్తా
ఆ: అడగాలా చెప్పు మొహమాటం తప్పుకాదా.... ॥సరసరం॥

## రచన : సీతారామశాస్త్రి — 5 — గానం : రవివర్మ, లావణ్య

ప/అ: ఓ ముద్దిస్తావా ఏమైనా
ఓ కిస్ ఇస్తావా ఏమైనా
పడిచస్తున్నానే నీపైన
ఆంధ్రా మడోనా నువ్వేనా
అయిపోతున్నానే దీవానా
ఏం సింపుల్ డ్రస్సే జానా
'ఎ' సింబల్ నువ్వే అవునా
రంగేళి ఊర్మిళకైనా కంగారెత్తేలా వున్నావే కూనా ॥ఓ ముద్దిస్తావా॥
చ/ఆ: నను చూసే మైకంలోన మందుమాసై కాసేపైనా
మంచి ఉద్దేసంతో ఒచ్చా తెలుసా పురుషా
అ: ఎంత సోషల్ సర్వీస్ అయినా ఇంతగా నడి వీధుల్లోనా
ఏక్సిడెంట్లెన్ని అయిపోతాయో తెలుసా సొగసా
ఆ: ముసుగెట్టుకు కూర్చోనా తగలద్దా గాలైనా
అ: నిన్నేతాకే గాలికి కూడా కైపెక్కిందో ఏమో పాపం తూగిందే ఇలా ॥ఓ కిస్సిస్తావా॥
చ/అ: ఊగుతుంటే హంసా నువ్వలా
రేగుతుందే హింస అదోలా
ఆగనందే మదిలో మోగే తబలా అబలా
ఆ: తుమ్మముల్లే గుచ్చుకునేలా తిమ్మిరెక్కే పడచుదనాల
తుమ్మెదల్లే వచ్చిపడాల ఏలా? ఏలా?
అ: బుసగొట్టే బిసిబిల్లా కలకత్తా రసుగుల్లా
ఆ: కొంచెం గర్వంగానే వున్నా
చూపులతో కొరికేస్తే ఎలా అందం కందేలా? ॥ఓ ముద్దిస్తావా॥

ఆ: మంచిపూలు మంచుపూలు మొగలిపూలు కాదు కుర్రాళ్ళు ముంచే పూలు
నవ్వులిచ్చి పువ్వులిచ్చి అన్ని యిచ్చి ఆపై చేస్తారు నవ్వులపాలు
కాళ్ళే పడతారు - కౌగిలికొస్తారు
వేళ్ళే పడతారు - వేగిరపెడతారు
కాళ్ళు వేళ్ళు రెండు పట్టి సోకులు పోతారు తోకలు జాడించేస్తారు
ఘ: కాలేజీకెళ్ళొద్దని నమ్మించి పెడతారు క్యాబేజీ పూలు
కాలేజికొస్తామని టైమిచ్చి పెడతారు కస్తూరి పూలు
ఆ: మూవీ చూపిస్తామని మాటిచ్చి పెడతారు మందారపూలు
చైనే కొనిపెడతామని చెప్పేసి పెడతారు చేంబేలి పూలు
అ: అంది అందకుండా పెడతారు ఆపిల్ పూలు
ఆటలాడకుండ పెడతారు అలిన్ పూలు
ఆ: కోరిచేరగానే పెడతారు కొబ్బరి పూలు
కోక చిక్కగానే పెడతారు కిరికిరి పూలు
కో: ఆటలోన అరటిపూలు గడ్డిపూలు గరికపూలు వేపపూలు వెర్రిపూలు
మేమున్నాం ఒక్క స్టారుపువ్వు తోడైతే - మా బ్రతుకే ఫైవ్ స్టారు స్విమ్మింగ్ పూలు.
ఘ/అ: మాపంటూ రేపంటూ మురిపిస్తూ పెడతారు మారేడు పూలు
జిల్లాలు రాష్ట్రాలు తిప్పిస్తూ పెడతారు జిల్లేడు పూలు
ఆ: అందాలే మీవంటూ పొగిడేస్తూ పెడతారు హైబ్రీడు పూలు
తందాన తానంటు పలికేస్తూ పెడతారు తంగేడుపూలు
అ: మనసు విప్పమంటె పెడతారు మూరెడు పూలు
బదులు చెప్పమంటే పెడతారు బారెడు పూలు
ఆ: ప్రేమ పంచమంటే పెడతారు పేపర్ పూలు
ప్రాణమివ్వమంటే పెడతారు ప్లాస్టిక్ పూలు
కో: తెల్లపూలు నల్లపూలు పల్లెపూలు సిటీపూలు పొట్టిపూలు పొడపూలు
ఎవరైనా ఒక్కసారి వచ్చి వాటేస్తే - తలనిండా రుద్దేస్తాం వలపు షాంపూలు

రచన : చంద్రబోస్ — 5 — గానం : కె.కె., సాధనాసర్గమ్

ప: పంచభూతాల సాక్షిగా... పంచామృతాల సాక్షిగా...
పంచేంద్రియాల సాక్షిగా... పంచాక్షరాల సాక్షిగా...
నా పంచ ప్రణాలే నీవనీ పంచేసుకుంటా నీతో ప్రేమనీ ॥పంచ॥
చ: ఎండలేక నీడుందా నేల లేక మేడుందా
నీవు లేక నేనంటూ ఉండను ఏనాడు... ఓ
నీరు లేక ఏరుందా నేడు లేక రేపుందా
నీవు లేక నేనంటూ అడిగా నీతోడు



కొత్తపువ్వు విరిసింది కొత్తగాలి వీచింది కొత్తదారి వెలసింది
తాను కంటపడ్డాక నేడు నేను కంటుంది నిన్న కంటే బాగుంది
అనుమానం లేదు నాకొరకే తానున్నదీ
తన ప్రేమ పొందే నమ్మకమే నా కున్నది ॥అరెరె॥

రచన : చంద్రబోస్ — 3 — గానం : విజయ్ యేసుదాస్, చిత్ర

ప: పన్నెండింటికి పడుకుంటే కొంటెగ కలలోకొస్తావు
అయిదారింటికి మేల్కొంటే అప్పుడు ఎదుటే వుంటావు
వినవే... నా మనసే... నీలోనే నిండుందే
కనుకే అది నిన్నే కనిపెడుతూ వుంటుందే
చ: నాగుండె నీలోనే దిండేసి పడుకుందే
నువుదాని ఆకలి దప్పిక అన్నీ తీర్చాలే
చిరుముద్దు పెడతాలే మురిపాలు పడతాలే
పసిపాపలాగా పెంచి పోషిస్తూంటాలే
ఎలా మరి తలస్నానము
అందంతోటి అభిషేకము
అద్దెగా చెల్లిస్తాలే నా ప్రాణము
చ: నీ పేరు పలికేటి నీ ఊసు తెలిపేటి
అధరాలు చేసుంటాయి ఎంతో పుణ్యము
నీ వైపు చూసేటి నీ రూపు తడిమేటి
నా కళ్ళు చేసుకుంటాయి అంతే పుణ్యము
నిన్ను నన్ను కలిపేయగా
నీలో నాలో తలదాచగా
ప్రేమకే అయ్యిందమ్మా జన్మేధన్యము

రచన : చంద్రబోస్ — 4 — గానం : శ్రీరాంపార్థసారథి, సుజాత

సా: ఏ పూలు పెట్టినా ఏమున్నది గర్వకారణం
బాడీలో ఒంపులే బ్యూటీకి మూల కారణం
ప/అ: జాజిపూలు మల్లెపూలు కలువపూలు కాదు ఆడాళ్ళు చెవిలో పూలు
జూన్ గాని జులైగాని ఎప్పుడైనా గాని చేస్తారు ఏప్రిల్ పూలు
హల్లో అంటారు - అల్లరి పెడతారు
కల్లో కొస్తారు - కలవర పెడతారు
పూలటొకే చేతికిస్తే పూలెట్టేస్తారు చెవిలో పూలెట్టేస్తారు



ఆ: వాటాల పోటీలు వదిలేయి రాదా కొంత
వండర్‌లాండ్ అయిపోదా మన ఈ కాంప్లెక్స్ అంతా ॥అత్తయ్యో॥
చ/అ1: గురువా నా విన్నపాలు ఒక్కటైనా వినవా
అ2: మెదడే కొరుక్కుతినే చెదపురుగౌతావా
ఆ: ఒక చెట్టునే పిట్టలన్ని గూళ్ళుకట్టుకోవా
మనలా ప్రతిక్షణం తన్నుకు ఛస్తున్నాయా
అ: సొంతిల్లే అయినా అపార్ట్‌మెంట్ లైఫ్ అంటే కుదరదు ఎడ్జస్ట్ అవ్వందే
ఆ: పేచి పెడితే ఇరుగుపొరుగు ఎపుడయినా రాజీ పడవల్సిందే
అ: ఫ్రెండ్లీగా ఫామ్లీగా గడిపేసే కిటుకుంది
ఆ: అది మనం మనం బరంపురం అనుకుంటూ హాప్పీగా బతకడమే
ఆటల్లో పాటల్లో విడిగా వుండద్దయ్యో
అందర్లో ఒకరైతే మన పరువేం పోదయ్యో ॥అత్తయ్యో॥
చ/ఆ: మన ముంగిట్లో ముగ్గల్లే స్నేహం చిత్రంచండి
కో: ప్రతిపూటా మనకి సంక్రాంతేనండి
అ: ఈ వాదాలు భేదాలు కాస్సేపే అనుకోండి
ఈ చిటపటలన్నీ దివాళీలండి
ఆ: నిద్దర్లే వదిలి ఈ సందడికెందుకెళ్ళాలంట
అ: హద్దుల్నే చెరిపి సరదాగా చెలేగాలంట
అ: రండయ్యో, రండమ్మో పిల్లా పెద్దా అంతా
అ2: అహ ఉండయ్యో వినవయ్యో విన్నపాల చింత ॥అత్తయ్యో॥

రచన: సీతారామశాస్త్రి — 4 — గానం : శ్రీనివాస్, అపర్ణ

ప/అ: నరనరం ఉలిక్కి పడేట్టు అలా నవ్వకే అందమా
ఆ: ఒక క్షణం తెగించమన్నాను కదా అంత సందేహమా!
అ: ఏం చేద్దాం! ఆ: జతపడదాం
అ: ఈ దూరం ఆ: పనిపడదాం
అ: ఆనందం ఆ: కనిపెడదాం
అ: నువ్వు సరే అంటే సరిహద్దే తెంచుకుందాం ॥నరనరం॥
చ/అ: లేత పెదవి తడితగిలి నేను కరిగిపోవాలి
ఆ: వేడిచూపు సెగతగిలి ఈడు కందిపోవాలి
అ: ఏమన్నదో నీ ఊపిరి
ఆ: ఏం విన్నదో నీ తిమ్మిరి
అ: ఎందుకటా అరచేతుల్లో ఈ చెమట



ఇష్టం నీది కష్టం నాది ఏం చేయను ఖర్మ
అ: మాటల్లో నిను కాదంటున్నా, టోటల్‌గా నువు చెప్పిందే వింటున్నా
ఆ: ఆటల్లో నిను వదిలేస్తున్నా, లైఫ్‌లో ఈ ఫ్రీడమ్ నీకిస్తానా
అ: వెనకే ఉంటా
ఆ: నిను చూస్తుంటా ॥రా పోదాం॥
చ/ఆ: ఎన్నాళ్ళయినా ఇలాగైనా పిల్లాడై ఉంటావా
చేసే అల్లర్లన్ని చేసి సేవ్ మి అంటావా
అ: రైటో, లెఫ్టో రూటేదైనా నాతో రానంటావా
నీ కేరాఫై ఉండడమంటే చాలా ఫీల్ అయిపోవా
ఆ: జన్మంతా నిను జాగ్రత్తగా నడపనా, ఇక వేరే పనేమిలేదా
అ: అందుకే నువ్వు పుట్టావుగా, తప్పదే అలా రాసిపెట్టున్నాక
ఆ: నిజమంటావా
అ: నమ్మనంటావా
ప/ఆ: ఋజువుందా నీ మాటకి
అ: ఒట్టేస్తా ముమ్మాటికి
ఆ: అయితే రా నాదారికి
అ: ఇంకాస్సేపు...
ఆ: పరుగే ఆపు... ॥రా పోదాం॥

రచన :సీతారామశాస్త్రి — 3 — గానం : మనో, గ్రేస్

ప/అ1: అత్తయ్యో మావయ్యో అంతా రారండయో
అ2: అక్కయ్యో బావయ్యో వింతే చూడండయ్యో
ఆ: కోపంతో కొంపల్లో ముడుచుకుపోకండయ్యో
నూతుల్లో కప్పల్లా ఎన్నాళ్ళుంటారయ్యో
చ/అ: మనగుమ్మంలో హరివిల్లే సిద్ధంగా ఉందయ్యో
రా రంగులు చూద్దాం, హంగామా చేద్దాం
ఆ: నడి సమ్మర్‌లో చినుకల్లే నవ్వే కురిసిందయ్యో
ఆ జల్లును చూద్దాం, స్నానాలే చేద్దాం
అ: ఆడా మగా అంతా ఈ అల్లర్లో చేరొచ్చండి
ఆ: ముసలి ముతకైనా పసి పాపల్లా మారొచ్చండి ॥అత్తయ్యో॥
చ/ఆ: ఎంతకాలం నుంచి రాని పండుగల్లే ఉంది ఇది
అ: ఎంతో దూరం నుండి వచ్చిన బంధువల్లే అందరికి ఆనందం ఇస్తున్నది
ఆ: ఎంతబాగుందో ఇల్లాగే కలిసుంటే అంతా
అ: అనుకుంటాంగాని ప్రతిరోజు ఇట్టా ఉంటుందా

ఉషాకిరణ్ మూవీస్





రామోజీరావు

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు **'రాజా'** పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.


చంద్రబోస్


విద్యాసాగర్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : విశ్వనాథ్ |
| సంగీతం | : విద్యాసాగర్ |
| పాటల రచయిత | : చంద్రబోస్ |
| కెమెరా | : ఛోటాకె. నాయుడు |
| ఆర్ట్ | : ఆనంద్ సాయి |
| డ్యాన్స్ | : బృంద, రాజశేఖర్, హరీష్‌సాయ్ |
| ఫైట్స్ | : విక్రమ్‌ధర్మ |
| ఎడిటింగ్ | : మార్తాండ్ కె. వెంకటేష్ |
| కాస్ట్యూమ్స్ | : కమల్ భాషా |
| మేకప్ | : మురళి |
| ప్రొ।।ఎగ్జిక్యూటివ్ | : వల్లూరుపల్లి వెంకటేశ్వరరావు |
| కో-డైరెక్టర్ | : రాంబాబు |
| నిర్వహణ | : వి.వి. రావు |
| పి.ఆర్.ఓ | : యస్. వేణుగోపాల్ |
| కథ, స్క్రీన్‌ప్లే - దర్శకత్వం | : జాన్ |
| నిర్మాత | : రామోజీరావు |

## తారాగణం

సూర్యప్రకాష్, మెహెత,

సునీల్, బ్రహ్మానందం,

ప్రకాష్‌రాజ్, తనికెళ్ళభరణి,

ఆహుతి ప్రసాద్, సుబ్బరాయశర్మ,

చిత్రంశ్రీను, రఘు,

బంటి, ఢిల్లీ రాజేశ్వరి



## తారాగణం

నరేష్, శ్వేత, కోట శ్రీనివాసరావు,
అపూర్వ, బేబి సత్య గాయత్రి,
చలపతిరావు, సుభాషిణి, నీలాంబరి,
సుధ, తనికెళ్ళ భరణి, లక్ష్మీపతి,
సంజయ్‌కుమార్

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు **'రాజా'** పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

# అల్లరి


రవిబాబు


సీతారామశాస్త్రి

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| రచన | : నివాస్ |
| పాటలు | : సిరివెన్నెల సీతారామశాస్త్రి |
| ఎడిటింగ్ | : మార్తాండ్.కె.వెంకటేష్ |
| కొరియోగ్రఫీ | : ప్రసన్న |
| ప్రొడక్షన్ డిజైనర్ | : భూపేష్ ఆర్.భూపతి |
| సంగీతం | : పాల్.జె. |
| సినిమాటోగ్రఫీ | : లోకనాథన్ |
| ప్రొడ్యూసర్, డైరక్టర్ | : రవిబాబు |


పాల్. జె.

## అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : కంపెనీ (2002)
రచన : నితిన్ రాయ్‌క్వర్
సంగీతం : సందీప్ చౌతా
గానం : ఆశాభోంస్లే, సుదేశ్ భోంస్లే, సప్నా అవస్థి
అభినయం : ఈషా కొపికర్ మరియు ఇతరులు

# ఖల్లాస్...





బచ్‌కే తూ రెహానారే బచ్‌కే తూరెహానా
నహీఁ దూజా మౌకా మిలేగా సంభల్‌నా
కహీఁ భీ ఛుపా హో
తుఝ్‌ ఢూంఢ్ లేగా
యే హై ఇష్క్ సమ్‌ఝా
తుఝే కర్ హి దేగా
ఖల్లాస్ ఏ ఖల్లాస్ ||బచ్‌కే తూ రెహానా||
నజరోఁ కే క్లైడ్ మేఁ తూ
జో ఆగయా సమఝ్‌లే
ఏక్ బార్ ఫఁస్ గయాతో
తూ ఫఁస్ గయా సమఝ్‌లే ||నజరోం కే క్లైడ్||
నహీఁ తేరే జైసా కోయీభీ నిశానా (2)
హాఁ బచ్‌కే తూ రెహానా రే బచ్‌కే తూ రెహానా
తూ భీంచా చలా ఆయేగా బస్ యహాఁ పే
యే హై రోగ్ ఐసా అగర్ హో గయాతో
ఖల్లాస్ హై ఖల్లాస్
జీనా హై తేరా ముష్కిల్
తూ మర్ గయా సమఝ్‌లే
మర్నా భీ తేరా ముష్కిల్
తూ హో కర్ గయా సమఝ్‌లే ||జీనా హై తేరా||
జహాఁ మేఁ తేరా బస్ యహీ హై ఠికానా (2)
బచ్‌కే తూ రెహానా రే బచ్‌కే తూ రెహానా
యేహో రాస్తా హై జహాఁ ముడ్‌నా ముష్కిల్
యేహో రాస్తాఁ హై షురూ హో గయాతో
ఖల్లాస్ హై ఖల్లాస్ ||బచ్‌కే తూ రెహానా||



సామాన్య ప్రజల్లో వాడుకలో ఉన్న అసాధారణమైన మాటలు పాటల్లో వాడుకుంటే ఆ పాటలు ప్రజాదరణ పొందటం సహజమే. ఆ మాటలు అర్థాలు మారిన పాత మాటలు కావచ్చు. లేక ఏ నిఘంటువులోనూ లేని కొత్త మాటలు కావచ్చు. ముంబాయి నగరంలో నేరప్రపంచంలో ఇలాంటి కొత్త మాటలు ఎన్నో పుట్టాయి. ఖల్లాస్, బిందాస్, భిడూ, టపోరీ ఇలాంటి మాటలే. ఇలాంటి కొత్త మాటలే కాక ఒక కొత్త మాండలికమే అక్కడ ప్రచారంలో ఉంది. అలాంటి మాండలికంలో వచ్చిన పాటలు 'ఆతీ క్యా ఖండాలా' (గులామ్), 'ఖానే కా పీనే కా' (బాంబే బాయ్స్) హిట్స్‌గా నిలిచాయి. 'ఖల్లాస్' అంటే 'అయిపోయింది' అనే అర్థం చెప్పుకోవచ్చు. ఒక మనిషిపని అయిపోయింది. ఒక వ్యాపారం మూతపడింది అని అనడానికి ఈ మాట వాడతారు.

'ఆతీ క్యా ఖండాలా', 'అపున్ బోలా' (జోష్) పాటలు వ్రాసిన నితిన్ రాయ్‌క్వర్ 'కంపెనీ' చిత్రంలోని ఈ 'ఖల్లాస్' పాటని కూడా రాశారు. ఈ చిత్రం కథ ముంబాయి అండర్‌వరల్డ్‌కి సంబంధించినది. దర్శకుడు రామ్‌గోపాల్‌వర్మ విభిన్న కథాంశాలతో చిత్రాలు రూపొందించి వెర్సటైల్ డైరెక్టర్‌గా పేరు తెచ్చుకున్నా ఈ తరహా చిత్రాలంటే ఆయనకు మక్కువ ఎక్కువ. 'శివ', 'అంతం' (హిందీలో 'ద్రోహి'), 'గాయం', 'సత్య' చిత్రాలు అండర్ వరల్డ్ మీద తీసిన చిత్రాలే.

అండర్‌వరల్డ్‌లోని ఇద్దరు మిత్రులు శత్రువులుగా మారి ఒకరి వినాశనానికి ఒకరు ఎలా కారణమయ్యారన్నదే 'కంపెనీ' కథ. నిజ జీవితంలోని ఇద్దరు మాఫియా డాన్‌ల కథను స్ఫూర్తిగా తీసుకుని ఈ కథ రూపొందించారనే వదంతులు కూడా వచ్చాయి. చిత్ర కథ ప్రకారం మలిక్ అనే ఒక గ్యాంగ్‌స్టర్ ఒక మాఫియా నాయకుడి దగ్గర పనిచేస్తుంటాడు. చందూ అనే యువకుడు అతని దగ్గర చేరతాడు. వీళ్ళు స్మగ్లింగ్‌తోబాటు, బెదిరించి డబ్బులు వసూలు చేయడం కూడా చేస్తుంటారు. మలిక్ అంచెలంచెలుగా ఎదిగి నాయకుడౌతాడు. చందూ అతని వద్ద విశ్వాసంగా పనిచేస్తూ ఒక దశలో అతని ప్రాణాన్ని కాపాడతాడు. కొత్తగా వచ్చిన పోలీస్ కమిషనర్ వీరి కదలికల్ని గమనిస్తూ వీరిని అరెస్ట్ చేయడానికి తగిన సాక్ష్యాధారాలు సంపాదిస్తాడు. అది తెలుసుకున్న మలిక్, చందూ తమ సన్నిహితులతో కలిసి హాంగ్‌కాంగ్ పారిపోతారు. అక్కడ ఉండి ఫోన్ ద్వారా ముంబాయిలోని తమ నేర సామ్రాజ్యాన్ని నియంత్రిస్తూ ఉంటారు. చందూకి మలిక్ ఇచ్చే ప్రాధాన్యతని సహించలేని కొందరు వారి మధ్య దూరాన్ని పెంచడంతో చివరికి వారు శత్రువులుగా మారతారు. వారి శత్రుత్వం వారి పతనానికి దారితీస్తుంది. నేర ప్రపంచంలోకి అడుగుపెట్టిన వారికి కొంతకాలం పాటు జీవితంలో అన్నీ దొరికినట్టు అనిపించినా చివరికి అంతా కోల్పోతారనే సందేశం అంతర్లీనంగా ఉంటుంది ఈ చిత్రంలో. ఇదే విషయం 'ఖల్లాస్' పాటలో కూడా చెప్పారు. కాకపోతే ప్రేమలో పడినవారు అంతా కోల్పోతారు అనే అర్థంలో ఈ పాట ఉంటుంది. చిత్రీకరణ ద్వారా ఈ పాటను అండర్‌వరల్డ్‌కు అన్వయింపజేశారు. అసలు 'ఖల్లాస్' అనే మాట వాడటమే ఒక విధమైన కరుకుదనాన్ని తెలియజేస్తుంది. పైగా 'ఖల్లాస్', 'బచ్‌కే రెహనా' అనే మాటలు ఈ చిత్రానికి క్యాప్షన్స్‌గా వాడుకున్నారు.

మలిక్ నాయకుడైన సందర్భంలో ఒక క్లబ్‌లో సినీతారలను, ఇతర వ్యక్తులను కలిసి తన కార్యకలాపాలను సాగిస్తుండగా ఈ పాట వస్తుంది. అసలు సినిమాతో సంబంధం లేకుండా ఈ పాట వింటే ప్రేమలో దెబ్బతిన్నవారు ఇతరులను హెచ్చరిస్తున్నట్టు ఉంటుంది. ఈ పాట గురించి చెప్పుకుంటే గత సంవత్సరం రామ్‌గోపాల్‌వర్మ నిర్మించిన 'ప్యార్ తూనే క్యా కియా' చిత్రంలోని 'కంబఖ్త్ ఇష్క్' పాట గుర్తు వస్తుంది. 'పాడు ప్రేమ' లక్షణాలన్నీ ఆ పాటలో వివరించారు. త్వరలో రాబోయే 'క్యాదిల్ నే కహా' చిత్రంలోని 'నికమ్మా కియా ఇస్ దిల్ నే' పాట కూడా ఇలాంటిదే. 'పనికిరాని వాణ్ని చేసింది ఈ మనసు' అని అర్థం.



ఈ పాటను ఈషా కొప్పికర్ మీద చిత్రీకరించారు. తెలుగులో వచ్చిన 'చంద్రలేఖ' చిత్రంలో ఈమె ఒక హీరోయిన్‌గా నటించింది. ఊర్మిళ, మనోజ్ బాజ్‌పాయ్, అఫ్తాబ్, ఫర్దీన్‌ఖాన్, అంత్రామాలి, వివేక్ ఒబెరాయ్ మొదలైన వారికి బ్రేక్ ఇచ్చిన రామ్‌గోపాల్ వర్మ హిందీ చిత్ర రంగంలో





నృత్యదర్శకుడు గణేష్ హెగ్డే

నిలదొక్కుకోవాలని ప్రయత్నిస్తున్న ఈషాకు ఈ పాట ద్వారా బ్రేక్ ఇచ్చారని అంటున్నారు. 'కంపెనీ' చిత్రంలో ఈషా ఈ పాటలో మాత్రమే కనిపిస్తుంది.

రామ్‌గోపాల్‌వర్మ నిర్మించిన 'కౌన్', 'మస్త్', 'జంగల్', 'ప్యార్ తూనే క్యా కియా' చిత్రాలకు సంగీతం అందించిన సందీప్ చౌతా 'కంపెనీ' చిత్రానికి కూడా సంగీతం అందించారు. మెలొడీ ప్రధానమైన ఇతర పాటలు కూడా ఈ చిత్రం కోసం రూపొందించినా చిత్రం నిడివిని దృష్టిలో ఉంచుకుని 'ఖల్లాస్' పాటని మాత్రమే చిత్రంలో పొందుపరిచారు. సీరియస్‌గా సాగిపోయే ఈ చిత్రంలో ఈ పాట ఒక్కటే ఉల్లాసభరితంగా ఉంటుంది. ఈ క్లబ్‌సాంగ్ పాశ్చాత్య పద్ధతిలో ఫాస్ట్ కట్స్‌తో చిత్రీకరించారు.



'బచ్‌కే రెహనా' అంటే 'తప్పించుకో' అని. 'జాగ్రత్త' అనే అర్థంలో ఎక్కువ వాడతారు. 'దూజా మౌకా' అంటే 'రెండో అవకాశం'. 'సంభల్‌నా' అంటే కూడా జాగ్రత్త పడమనే. 'ఛుప్‌నా' అంటే దాగడం. 'ఢూండ్‌నా' అంటే వెతకడం. 'ఇష్క్' అంటే ప్రేమ.

**జాగ్రత్తోయ్ జాగ్రత్త**
**మరో అవకాశం దొరకదు జాగ్రత్త**
**ఎక్కడ దాగినా**
**నిన్ను వెతికి పట్టుకుంటుంది**
**ఈ ప్రేమ సంగతి తెలుసా**
**నీ పని పడుతుంది.**

ప్రేమలో పడితే జీవితాన్ని సరిదిద్దుకునే అవకాశం దొరకదు. అది వెంటాడి జీవితాన్ని నాశనం చేస్తుంది.

'నజర్' అంటే చూపు. 'కైద్' అంటే ఖైదు, చెర. 'ఫఁస్ గయా' అంటే 'చిక్కుకోవడం, దొరికిపోవడం'. 'నిశానా' అంటే గురి. 'ఖీంచా చలా ఆయేగా' అంటే 'లాగినట్టు వస్తావ'ని. 'రోగ్' అంటే రోగం. మనం తెలుగులో ప్రేమ పిచ్చిలాపట్టింది అన్నట్టే హిందీలో ప్రేమ రోగంలా పట్టిందని అంటారు.

**చూపుల చెరలో నువ్వు**
**బందీవయ్యావంటే**
**ఓసారి చిక్కావంటే**
**నువ్వు దొరికిపోయినట్టే**
**నిన్నే గురిచూసి**
**వేటాడుతుంది**
**జాగ్రత్తోయ్ జాగ్రత్త**
**మంత్రం వేసినట్టు**
**లాక్కెస్తుంది**
**ఈ పిచ్చి పట్టిందంటే**
**నీ పని పడుతుంది**

ఒకసారి ఈ వలలో చిక్కితే తప్పించుకోలేరు. మళ్ళీ మళ్ళీ ఈ ఉచ్చులో చిక్కుకుంటారు.

'జీనా' అంటే బతకడం. 'మర్నా' అంటే చావడం. 'ముష్కిల్' అంటే కష్టం. 'ఠికానా' అంటే నెలవు. 'రాస్తా' అంటే దారి. 'ముడ్‌నా' అంటే మలుపు తిరగటం. 'దాస్తాన్' అంటే కథ. 'షురూ' అంటే మొదలు.

**నువ్వు బతకడం కష్టం**
**నీ ప్రాణాలు పోయినట్టే**
**చావడం కూడా కష్టమే**
**నువ్వలాంటి పని చేశావంటే**
**లోకంలో నీకిదే నెలవు**
**జాగ్రత్తోయ్ జాగ్రత్త**
**ఈ దారి నుంచి తప్పుకోలేవు**
**ఈ కథ మొదలైతే**
**నీ పని అంతే**

చావనివ్వదు, బతకనివ్వదు. ఒకసారి ఈ దారిలో అడుగువేస్తే మళ్ళీ వేరేదారి ఉండదు.

సందీప్ చౌతా సంగీతంలో తెలుగులో వచ్చిన 'ప్రేమకథ' చిత్రంలోని 'ప్రేమ సంగతి ప్రేమకే అసలు తెలుసా' అనే పాటలో కూడా ఇలాంటి భావాలే ఉంటాయి. కానీ అది క్లాస్ పాట అయితే ఇది కరుకు పదాలు ఉపయోగించి కూర్చిన మాస్ పాట. ఆశాభోంస్లే అద్భుతంగా పాడారు. ఆమె రేంజ్‌కి ఈ పాట ఒక ఉదాహరణ.



**-పి.వి. సత్యనారాయణ రాజు**

## కొంటె కొశ్చెన్లు - తుంటరి జవాబులు




☆ వి.మంజురాణి - హైద్రాబాద్

ప్ర॥ 'ఎక్స్‌ట్రాలొద్దు' అని అంటుంటారు.... అంటే ఏమిటి?

జ॥ పెళ్ళయ్యాక అరుంధతిని చూడమంటే 'పరస్త్రీలను చూడడం పాపం' అని అనడం లాంటివన్న మాట.

ప్ర॥ అప్సరసలు స్వర్గంలోనే ఎందుకుంటారు? పాతాళంలో ఎందుకుండరు?

జ॥ అప్ (up) అంటే పైన అనే అర్థం కదా.... మరి స్వర్గం పైనే ఉంటుంది కనుక 'అప్‌సరసలు' పాతాళంలో ఉండరు.

ప్ర॥ చమత్కారి కథకుడు?

జ॥ 'కథ పాకాన పడలేదు రైటరూ!?' అని నిర్మాత అంటే 'ప్రేక్షకుల్లో షుగర్ పేషెంట్లుంటే ఇబ్బంది పడతారండీ' అని తెలివిగా తప్పించుకునేవాడు.

## పేరు - రిపేరు



1. ఆంటీ - అంకుల్ - ఎవరికి వారే యమునాతీరే

-ఎం.డి.ముస్తఖీమ్, కొల్లాపూర్

2. దేశంలో దొంగలు పడ్డారు - పట్టుకుంటే లక్ష - అందరూ దొంగలే
3. వాసు - సుబ్బు - ఫ్రెండ్స్

-దేవులపల్లి రామమూర్తి, విజయవాడ



## చిలిపి లిపి



100-త్ - 1/2 రికా= సౌత్ ఆఫ్రికా

**ΠD - Mother =** పైడితల్లి

-జె.యస్.యన్.స్వామి, హైదరాబాద్

1న్ను = ఒక టిన్ను

-ఎ.సూర్యనారాయణ, పాయకరావుపేట

## ఈ రూటే వేరు



Mother Leg = అమ్మకాలు

Fair Leg = సంతకాలు

-దేవులపల్లి రామమూర్తి, విజయవాడ

పేరెంట్స్ = అద్దెలు చెల్లించుట

-తరిగొప్పుల విఎల్లెన్ మూర్తి, హైదరాబాద్

## చిలిపి కవిత



సాయంత్రం కాగానే
కళ్ళూ, కాళ్ళూ
సిద్ధమై పోతాయి - వేటకి
అయితే
నాలుక బాగా తడిసే చోటుకి
లేదా
జీవితం పూర్తిగా మునిగిపోయే పేటకి!
ఎక్కడో ఉంటారు నూటికి కోటికి
వాళ్ళే తిన్నగా చేర్తారు గూటికి!!

-బివిరావు, రుద్రారం

# పేరడీ పేరేడ్





రమ్‌జిన్ రమ్‌జిన్ హైదరాబాద్
విస్కీవాలా 'జిన్'దాబాద్
మూడు పూటలా మందు దొరుకునిట
స్వర్గం కూడా బలాదూర్ ॥రమ్‌జిన్॥
ఒక చేతిలో విస్కీసీసా... ఒక చేతిలో సారా పీపా
'క్యాసాలే' అని అంటాడొకడు
'నీ యవ్వ'ని తిడతాడొకడు
మతాలు, భాషలు వేరైనా
మన మత్తొకటేరా భాయీ ॥రమ్‌జిన్॥
అటు చూస్తే బారుల బార్లు
ఇటు చూస్తే గుడుంబా ఏర్లు
ఆ వంకన కేబరే డాన్సు
ఈ పక్కన డిస్కో థెక్సు
తళతళమెరిసే తళుకులబాదు
రాత్రీ పగలూ బాదూ ॥రమ్‌జిన్॥
నల్లాలో నీళ్లే బందు
ఎటు చూసిన మందే మందు
రోడ్ల మీద గొడవలు కనరా
సైడు కాల్వలో గురకలు వినరా
మందు బాబులూ పోయే రోజా
ఎపుడొస్తుందో ఏమో! ॥రమ్‌జిన్॥

(టూరిజం అభివృద్ధి కోసం హైదరాబాద్‌లో అర్ధరాత్రి వరకు తెరిచి వుంచే బార్లను చూసి స్పందించి)

-గోపి, హైదరాబాద్

అయ్యయ్యో పరీక్ష మళ్ళీ పోయెనే
అయ్యయ్యో మెదడు ఖాళీ ఆయెనే
ఉన్నది కాస్త ఊడింది
సర్వమంగళం పాడింది
అమ్మానాన్నల ఆస్తిపాస్తులకు
తిరుక్షవరమయిపోయింది ॥అయ్యయ్యో॥
ఆ మహా మహా 'పెడి మహారాజు'కే
తప్పలేదు భాయి ఓటమి తప్పలేదు భాయి
మరి నువ్ చెప్పలేదు భాయి
అది నాక్ తట్టలేదు భాయి
తెలివి తక్కువగ ఎగ్జామ్స్‌లో
దెబ్బతింటివోయి
బాబూ నిబ్బరించవోయీ ॥అయ్యయ్యో॥
చదువు కాక ఏ బిజినెస్ చేసిన
ఫలితం దక్కేది
ఎంతో లాభం వచ్చేది
ఎపుడో మ్యారేజ్ అయ్యేది
చక్కగ కట్నం వచ్చేది
పాలిటిక్సులో చేరి వుంటె
ఎమ్మెల్యే దక్కేది
మనకు అంత లక్కేది ॥అయ్యయ్యో॥
గెలుపు ఓటమి దైవాధీనం
స్టారు తిరగవచ్చు
మళ్ళీ మార్చికెళ్ళవచ్చు
ఇంకా ఎలా పాసవొచ్చు!?
స్లిప్పులు పెట్టి చూడవచ్చు
ఛాన్సు తగిలితే
ఈ దెబ్బతో నీకు
డిగ్రీ వొచ్చి చచ్చు
పోతే....!?
బతుకు తెలిసివచ్చు
చివరకి
చిప్పచేతికొచ్చూ ॥అయ్యయ్యో॥

('కులగోత్రాలు' సినిమాలోని 'అయ్యయ్యో చేతిలో డబ్బులు పోయెనే' పాటకు పేరడీగా)

-ఎం.శ్రేష్ఠ, హైదరాబాద్

## డబుల్‌రోల్



(1) అతడు 'రేసుకు' వెళ్లి డబ్బు పోగొట్టుకుని 'ఉరేసుకు' చనిపోయాడు.

-మామిడి శ్రీలత, రేపల్లె

(2) నిన్నరాత్రి మీ నాన్న ఓ సభలో 'లౌకిక' తత్వం ఉండాలన్నాడు. కాబట్టి మన 'లౌకిక' గ్రీన్‌సిగ్నల్ లభించినట్టే.

-జి.రామారావు, శృంగవరపుకోట

(3) 'పేరయ్యా'... నువ్విచ్చిన సైకిల్ కొన్న దగ్గర్నుంచి ఒకటే 'రిపేరయ్యా'

-పి.శోభన్‌బాబు, గార

## సీరియల్ 10



-మల్లాది వెంకట కృష్ణమూర్తి

### జరిగిన కథ

అనగనగా ఓ బామ్మ, వయసుతో సంబంధం లేని కుర్రమనసామెది. అనన్య ఆ బామ్మకు మనవరాలు. భక్తి ఎక్కువ. అయితే సినీ తారల పౌరాణిక గెటప్పుల లోని ఛాయా చిత్రాలను పూజించే తత్వం. అనన్య పనిచేసే బాంక్‌లోనే ఆఫీసర్‌గా పని చేస్తున్న నిరుపమ్ అన్నయ్య వెంకటరత్నం ఓ పెద్ద ఇల్లు ఆ ఊళ్ళోనే వుందని అతి త్వరలో అది తమకు రాబోతుందని అందరితోనూ చెబుతూ వుంటాడు. లింగమయ్య అనే వ్యక్తి ఎప్పుడు ఇంటికి వచ్చినా బామ్మ అనారోగ్యం నటిస్తూ ఉంటుంది. అంతే కాదు అనన్య ఎంత అడిగినా వివరాలు చెప్పకుండా దాట వేస్తుంది. అంచేత అనన్యకి ఆ విషయం ఎప్పుడూ ఓ సస్పెన్సే...



లింగమయ్య లోపలకి వచ్చి అడిగాడు.

"బామ్మగారు బావున్నారా?"

"బాలేదండి. పడుకుంది" చెప్పింది అనన్య.

"అయ్యో పాపం! ఏమిటి సుస్తీ ఈసారి?" ఎప్పటిలా దూరదర్శన్ న్యూస్‌రీడర్‌లా ఆనందంగా నవ్వుతూ, బాధగా అడిగాడు లింగమయ్య.

"ఎబ్డామినల్ పెయిన్స్, రండి చూద్దురు గాని"

ఇద్దరూ బామ్మ పడుకున్న గదిలోకి వెళ్ళారు. కళ్ళు మూసుకుని మూలుగుతోంది బామ్మ.

"బామ్మగారూ ఎలా వున్నారు?" అడిగాడు లింగమయ్య.

ఆవిడ మూలుగు ఆపి కళ్ళు తెరవక పోవడంతో మళ్ళీ గట్టిగా అడిగాడు లింగమయ్య అదే ప్రశ్నని.

ఆవిడ నింపాదిగా కళ్ళు తెరిచి చూసి

"నువ్వా లింగమయ్యా" అని మళ్ళీ కళ్ళు మూసుకుంది.

"కాస్తంత అజీర్తి చేసినట్లుంది మీకు?" చెప్పాడు లింగమయ్య పెద్దగా.

"అజీర్తి కాదు. నాకు తెలుసు. ఇవాళ నా ప్రాణం పోతుంది" నీరసంగా చెప్పింది బామ్మ.

"ఏమిటి సుస్తీ?"

"కడుపులో ఏదో మిక్సర్ ఆన్ అయినట్లు ఒకటే బాధ. కడుపంతా పచ్చి పుండయి పోయింది".

"డాక్టర్ గారేమన్నారు?".

"ఆయన ప్రెగ్నెన్సీ టెస్ట్ చేయించమన్నారు" చెప్పింది బామ్మ.

"ఆఁ... నిజంగా?" వులిక్కి పడ్డాడు లింగమయ్య.

అతను క్రితం రోజే ఈనాడులో 'టూకీ'గా లో 'ఎనభై ఏడేళ్ళ వృద్ధురాలు జపాన్‌లో బిడ్డని కన్న సంగతి చదివి వున్నాడు. నిజానికి అది బామ్మ కూడా చదవబట్టే ఆ మాటన్నదావిడ."

ఆవిడ కళ్ళు తెరచి నీరసంగా చూస్తూ చెప్పింది.

"కంగారు పడకు లింగమయ్యా. డాక్టర్ వచ్చి నన్ను పరీక్షించ లేదు. ఫోన్‌లో లక్షణాలు విని ఆ ముక్కన్నాడు, అప్పుడు నా వయసు చెప్పాను. దాంతో కడుపులోకి ట్యూబ్ పంపే పరీక్ష చేయించాలన్నాడు. దాని చివర బల్బు వెలుగు తూంటుందిట. కంప్యూటర్‌లో కడుపులోపలి భాగం అంతా సినిమాలా కనబడుతుందిట."

"కడుపులో పుండు లాంటిదేమైనా వుంటే, ఆ టెస్ట్ చేయమంటారు. ఒకోసారి కేన్సర్‌కి కూడా ఇదే పరీక్ష చేయిస్తుంటారు".

"నీకంత అదృష్టమా?" చెప్పింది బామ్మ.

"ఏమన్నారు?"అడిగాడు లింగమయ్య వులిక్కిపడి.

"నాకంత అదృష్టమా అన్నానయ్యా లింగమయ్యా. నాతో పుట్టిన బంధుమిత్రులంతా ఇట్టే తేలిగ్గా పైకిపోతున్నారు. నేనొక్కదాన్నే మిగిలి పోయాను".

"నిజమే. వాళ్ళు మళ్ళీ పుట్టేసి, వాళ్ళలో కొందరు మళ్ళీ చచ్చిపోయి కూడా వుంటారు" చెప్పాడు లింగమయ్య.

వంట గదిలో కాఫీ కలుపుతూ వీళ్ళ సంభాషణకి నవ్వుకున్న అనన్య కాఫీ కప్పుతో వచ్చి దాన్ని లింగమయ్యకిచ్చింది. ఇంకోటి బామ్మకిచ్చింది.

"కాఫీ తాగచ్చట" చెప్పింది బామ్మ లేచి కూర్చుని.

"మా బామ్మ కీమధ్య పెద్దగా బావుండడం లేదండి. రోజూ ఏదో ఓ నొప్పి".

"మొన్న నిద్రమాత్రలు నాలుగు మింగాను. చచ్చానా? పెట్టానా? అవి దండగ తప్ప. ఇవాళ పొద్దున దాకా మాంఛి నిద్రపోయానంటే నమ్మ".

"నిద్రమాత్రలు మింగి చావాలనుకునే వారు కనీసం డజను మాత్రలైనా మింగాలి" చికాకుగా చెప్పాడు లింగమయ్య.

"చద్దామని కాదు లింగమయ్యా హాయిగా మాంఛి నిద్రపోదామని మింగాను".

"మా బామ్మ అబద్ధం చెప్తోంది. చద్దామనే మింగింది. కాని నాలుగు మింగాక చావంటే భయం వేసి అంతటితో ఆపేసింది" నవ్వుతూ ఆ అబద్ధాన్ని పొడిగించింది అనన్య.

"చావాలంటే దేనికి భయం? ఈ రోజుల్లో బ్రతకాలంటే భయం కాని. మాకు నీళ్ళు లేవు. వాటర్ టేంకర్ కోసం వెళ్తే ఎల్లుండి దాకా బుక్ అయి పోయాయన్నాడు" చెప్పాడు లింగమయ్య మొహం చిన్నబుచ్చుకుంటూ.

"ఏం చేస్తాం చెప్పు. ఏదీ మన చేతిలో లేదు. అనుకుని పుట్టానా, అనుకుని చావడానికి?" చెప్పింది బామ్మ.

కాఫీ తాగాక లింగమయ్య చెప్పాడు.

"సరే వెళ్ళొస్తాను. మీకు కాస్తంత నిమ్మళంగా వున్నారో లేదో చూద్దామని వచ్చానంతే".

"లింగమయ్యా" పిలిచింది బామ్మ.

"ఏమిటి?"

"ఈసారి మీ ఆవిడని తీసుకురా చూడాలని వుంది".

"అలాగే. తప్పక తెస్తాను".

"ఏవైనా కోరికలుంటే, అవి తీరకుండా కొందరు చావరు కదా" అనుకున్నాడు లింగమయ్య మనసులో.

"రేపే తీసుకురా. ఎల్లుండి దాకా వుంటానో లేదో".

"నొప్పి అంత ఎక్కువగా వుందా బామ్మా?" అడిగాడు లింగమయ్య.

"ఊహు. నీతో మాట్లాడుతూంటే ఆ నొప్పి ఇట్టే తగ్గిపోయింది. వృద్ధాప్యం వచ్చాక ఎప్పుడు హరీమంటామో చెప్పలేం కదా. అందుకని"

లింగమయ్య వెళ్ళాక అనన్య చెప్పింది గట్టిగా.

"బామ్మా. నువ్వు ఇవాళ ఈ లింగమయ్య కథ చెప్పి తీరాల్సిందే"

"ఏమిటీ? ఏ కథా?"

"ఈ పెద్దమనిషి ఎందుకు నువ్వు చావాలనుకుంటున్నాడు?" పట్టుదలగా చూస్తూ అడిగింది.

"చెప్తాలేవే"

"ఎప్పుడో కాదు. ఇప్పుడే చెప్పు".

"దానికి మూడ్ రావాలి కదే".

"మూడ్ వచ్చేదాకా నువ్వు వుంటావో వుండవో. ఇప్పుడే నువ్వున్నావుగా, వృద్ధాప్యం వచ్చాక ఎప్పుడు హరీమంటారో చెప్పలేం అని".

"పిచ్చిదానా. నా వయసు ఎనభైఏడే కదే. అప్పుడే వృద్ధాప్యం ఎక్కడ వచ్చింది? తొంబయ్యవ పడిలో పడ్డాక కాస్త ఆలోచించాలి కాని"

"అదేం కుదరదు. నువ్వు చచ్చేది రేపే. నాకు తెలుసు. కాబట్టి ఇవాళ ఈ ఇంటి కథ, ఆ లింగమయ్య కథ, నా తల్లిదండ్రుల కథ చెప్పాలి. ఈ మూడు పరమ రహస్యంగా ఇన్నాళ్ళు దాస్తూ



వస్తున్నావు. ఇంకదానికి ఫుల్‌స్టాప్ పెట్టు. కథ మొదలెట్టు".

అనన్య మాటల్లో పట్టుదలని చూసింది బామ్మ.

"సరే చెప్తాలే. ఇంకాసేపట్లో సిటికేబుల్ నంది అవార్డుల ఫంక్షన్ లైవ్ టెలికాస్ట్ వుంది. అదయ్యాక చెప్తాను".

"అదయ్యే సరికి చాలాసేపవుతుంది".

"అవనీ, వెంకటేష్, చిరంజీవి, నాగార్జున, సౌందర్య... ఓహ్... ఎంతమందిని మేకప్ లేకుండా చూడచ్చో".

"నీ సినిమా పిచ్చిపాడుగాను" తిట్టింది అనన్య.

****

వాళ్ళ పైపోర్షన్‌లో అద్దెకుంటున్న వాసవి టీ.వీ. చూస్తోంది.

తను స్వంతంగా నీళ్ళు పోసుకోవడం అలవాటు చేసుకుంటున్న రాజు బాత్‌రూంలో సోప్‌తో వీపుని రుద్దుకోవడానికి ప్రయత్నించాడు. అయితే వీపు పూర్తిగా అందక పోవటంతో తల్లిని పిలిచాడు. వాసవి రాగానే వీపు తోమమని చెప్పాడు. వాసవి వాడి వీపు రుద్దుతుంటే, టి.వి. ప్రకటనలకి అలవాటు పడ్డ రాజు చెప్పాడు.

"రాజు స్నానంలోని ఈ భాగాన్ని అమ్మ స్పాన్సర్ చేస్తోంది".

చిన్నగా నవ్వి మృదువుగా వాడినెత్తిన మొట్టింది వాసవి.

"అమ్మా. "విష్ యూ హేపీ న్యూఇయర్" అంటే నువ్వేం అంటావు?" అడిగాడు రాజు.

"సేమ్ టు యూ"

"నాన్న?"

"అదేమాటంటారు"

"హృదయాంజలి ఆంటీ?"

"ఏమంటుంది? సేమ్ టు యూ అనే అంటుంది".

"ఏం కాదు. "షేమ్ టు యూ" అంటుంది. చేతులు కదల్చకుండా ఉంచడం, 'స' పలకడం టీ.వీ. అమ్మాయిలకి రాదు కదమ్మా".

"అల్లరెక్కువైంది నీకు" మళ్ళీ ముద్దుగా ఇందాకటిలా మొట్టింది వాసవి.

"నా ఫ్రండ్ టి.బల్వంత్‌సింగ్ నాన్న వాడిని దింపడానికి వచ్చినప్పుడల్లా నన్ను చూసి 'క్యాబాత్ హై' అంటాడు. అప్పుడు నేనేమంటానో తెలుసా?"

"ఏమంటావు? అచ్చా హై అంటావా?"

"మొట్టకు. 'టొమేటో బాత్ హై' అంటాను".

"రోజు రోజుకీ నీకు తెలివి ఎక్కువై పోతుంది".

"నీది తగ్గిపోతోంది".

"నాదెందుకు తగ్గుతుంది? నాది నాదగ్గరే వుంటుంది."

"నిన్న రాత్రి నాకు కలలో మళ్ళీ సాయిబాబా కనబడ్డాడు మమ్మీ" చెప్పాడు రాజు ఉత్సాహంగా.

"కనబడి ఏం చెప్పాడు? షిరిడి రమ్మన్నాడా?"

"కాదు. మీ అమ్మ పేరు స్పెల్లింగ్‌లో ఓ తమాషా వుంది. అదేమిటో నీకు తెలుసా అని అడిగాడు. తెలీదన్నాను. రేపురాత్రి కల్లో మళ్ళీ కనబడి చెప్తాను. ఈలోగా ఆలోచించు అన్నాడు సాయిబాబా".

"నా పేరులోని స్పెల్లింగ్‌లో ఏం తమాషా వుంది? ఏంలేదు?"

"ఏమో మరీ? ఏదో వుండే వుంటుంది, సాయిబాబా అడిగాడుగా".

"ఆయన కింకేం పని పాటాలేదా?"

"ఏమో మరి! నువ్విలా అన్నావని ఈ రాత్రి కల్లో కనబడితే ఆయన్నే అడుగుతాను".

"అడుగడుగు. నా కుడికాలి వెండి పట్టా వారం నించి కనబడడం లేదు. అదెక్కడ పడిందో కూడా అడుగు".

"అలాగే" చెప్పాడు రాజు.

****

అరగంట తర్వాత ఎక్సర్‌సైజు బైక్ మీంచి దిగాడు సుబ్బారావు. తెల్లటి టర్కిష్ టవల్ అందుకుని వంటికి పట్టిన చెమటని తుడుచుకుని ఆ గదిలోంచి హాల్‌లోకి నడిచాడు.

"కాస్తంత హార్లిక్స్ ఇవ్వమనవోయ్" చెప్పాడు సుబ్బారావు భార్యతో.

ఆవిడ వంట మనిషికి ఆ సంగతి చెప్పి భర్తనడిగింది.

"రోజూ ఎందుకు ఆ అనవసరపు ఎక్సర్‌సైజు?"

"ఎందుకేమిటి? బరువు తగ్గడానికి".

"ఏం తగ్గారు? గత పదిహేనేళ్ళుగా ఎక్సర్‌సైజు చేస్తున్నారు, అప్పుడు చూడడానికి ఎలా వున్నారో ఇప్పుడు అలానే వున్నారు కదా?"

"పిచ్చి మొహందానా" నవ్వాడు సుబ్బారావు.,

నిజానికి క్షణం కూడా వృథా చేయడు సుబ్బారావు. కోట్లలో రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసే అతనికి క్షణం వెయ్యి రూపాయలకన్నా ఎక్కువ.

సుబ్బారావు మనసు నిండా బామ్మ ఇంటిని గురించి ఆలోచనే. అతని కళ్ళు ఆ ఇంటి మీద పడిన క్షణం ఎలాంటిదో కాని, అప్పటినించి దాన్ని కొని, పడగొట్టి, ఆ స్థలంలో ఎప్పుడు నాలుగు ఫ్లోర్ల కాంప్లెక్స్ కడదామా అని వుందతనికి.

అతని పోటీదారులు కూడా అందుకు ప్రయత్నించి విఫలం అయ్యారు. కాని సుబ్బారావు మాత్రం ఆశ వదులు కోలేదు. అదతని స్వభావం కాదు.



సుబ్బారావు ఇంటినించి ఆఫీస్‌కి బయలుదేరాడు. దారిలో కొత్తగా కట్టిస్తున్న నాలుగు అపార్టుమెంట్స్‌లో వర్క్ ఎలా సాగుతోందో చూసుకుని ఆఫీస్‌కి చేరుకునే సరికి పదకొండున్నరయింది.

అతని టేబుల్ మీద ఇన్‌ట్రేలో వున్న కాగితాలలో పైది తీసుకుని చదివాడు. అది తన చెల్లెలి పెళ్ళికి వారం రోజులు సెలవు కోరుతూ లీవ్‌లెటర్. అది రాసిన క్లర్క్‌ని పిలిపించాడు. ఆమెని ఎగాదిగా చూసి అడిగాడు.

"దీన్లో అబద్ధం ఎందుకు రాసావు?"

"ఏం అబద్ధం రాయలేదు సార్".

"మీ నాన్నగారికి ఇప్పుడే ఫోన్ చేసాను. మీ చెల్లెలికి ఎప్పుడో పెళ్ళయి పోయిందని చెప్పాడాయన".

"సారీ సర్" ఠక్కున చెప్పింది.

"పని. పని ముఖ్యం అమ్మా. సెలవులు తీసుకుని క్రికెట్ మేచ్‌లు చూడడం కాదు. నీ పేరు నాగమణి. కాని అంతా నిన్ను 'నాగా' మణి అని పిలుస్తున్నా సిగ్గు లేదు. ఆఫీస్‌కి డుమ్మా. ఒక వేళ వస్తే, లేటు. దొంగ సెలవు చీటిలు. వెళ్ళు. లింగమయ్యని రమ్మని చెప్పు".

నాగమణి బయటికి వచ్చి తన మేనేజర్ లింగమయ్యతో చెప్పింది కోపంగా.

"ఉట్టి అబద్ధాల కోరు".

"ఎవర్ని తిడుతున్నావు?" అడిగాడు లింగమయ్య.

"మన ప్రొప్రయిటర్ సుబ్బారావుని మా చెల్లెలు పెళ్ళి కోసం శెలవు చీటి పంపితే, 'మా నాన్నకి ఫోన్ చేసాను. మా చెల్లెలు పెళ్ళి ఎప్పుడో అయిపోయిందని ఆయన చెప్పాడని' అంటాడా అబద్ధాల కోరు కాకపోతే? అసలు నాకు చెల్లెలే లేదు".

"బాస్ గొప్పమేధావి అని నేను ఊరికే చెప్తూంటాను. నిన్న ఆఫీసులోని సామానంతా దొంగలబారి నించి ఇన్సూర్ చేయించాడు కాని ఒక్క గోడ గడియారం మాత్రం వద్దన్నాడు. ఎందుకో తెలుసా? మన కళ్ళన్నీ ఎప్పుడు దానిమీదేట".

"అందుకనేనా స్టాఫ్ అంతా చూడాల్సిన సర్క్యులర్‌ని గోడ గడియారం దగ్గర తగిలించ మన్నాడు.? అన్నట్లు మిమ్మల్ని రమ్మన్నారు".

లింగమయ్య చేతిలో కాగితాలతో సుబ్బారావు గదిలోకి వెళ్ళాడు.

"గుడ్ మార్నింగ్ సార్. మన బేంక్ అకౌంట్‌లో ఈ నెల ఖర్చులకి సరిపడా బేలన్స్ లేదు సార్".

"అలాగా? మిసెస్ లక్ష్మీ సుబ్రమణ్యం ఇంకా మనకివ్వాల్సిన మొత్తం ఇవ్వలేదా?"

"లేదండి. ఎన్నిసార్లు ఫోన్ చేసినా ఇవాళ - రేపూ అంటూ వాయిదా పెడుతోంది".

"ఓ పని చెయ్యి. ఆవిడ అప్పులాళ్ళందరికీ మన అప్పు మనకి తీర్చేసిందని ఫోన్ చేసి చెప్పు".

లింగమయ్య ముక్కుమీద వేలు వేసుకుని చెప్పాడు మెచ్చుకోలుగా.

"చచ్చిందన్నమాటే. ఇందుకా ఆవిడ ఎవరెవరికి బాకీనో వాళ్ళ ఫోన్ నంబర్లు మీరు కలెక్ట్ చేయ మన్నది?"

ఫోన్ మోగింది. రిసీవర్ అందుకున్నాడు సుబ్బారావు.

"హలో సుబ్బారావు గారు. నేను వెంకటేశ్వ్రరావునండి. పోయిన్నెల ఉద్యోగం కోసం మీ దగ్గరికి వచ్చానండి".

"నీకప్పుడే చెప్పాను కదయ్యా నీకన్నా పెద్దవాడు ఆ జాబ్‌కి కావాలని"

"నేను అప్పటికన్నా నెల పెద్దవాడినయ్యాను కదా అని, ఆ జాబ్ ఇస్తారోమోనని ఫోన్ చేస్తున్నానండి".

"నువ్వు ఎంతకాలంగా ఆ టైర్ల కంపెనీలో పని చేస్తున్నావు?" అడిగాడు సుబ్బారావు అతని రీజనింగ్ నచ్చి.

"మా మేనేజర్ ఉద్యోగంలోంచి పీకేస్తానన్నప్పటినించండి".

"ఇది ఇండిపెండెన్స్ ఎక్కువగా వున్న ఉద్యోగం. నీకు అట్టే సరిపడదు".

"జాబ్‌లో ఇండిపెండెంట్‌గా ఉండడం అంటే నాకెంతో ఇష్టం సార్".

"అయితే విను. నువ్వు ఉదయం ఎనిమిదిలోగా ఎప్పుడైనా ఆఫీస్‌కి వచ్చే స్వతంత్రం వుంటుంది. రాత్రి తొమ్మిది తర్వాత ఎప్పుడైనా ఇంటికి వెళ్ళిపోయే స్వతంత్రం కూడా వుంటుంది. జీతం రెండు నెలలకోసారి ఎప్పుడైనా ఓసారి తీసుకునే స్వతంత్రం వుంటుంది".

"మరీ అంత ఇండిపెండెన్స్ వున్న జాబ్ కష్టం సార్... సేలరీ ఎంతన్నారు సార్?"

"నెలకి పదిహేను వందలు".

"నెలకి రెండున్నర వేలు తక్కువ వచ్చే జాబ్‌లో చేరద్దంది సార్ మా ఆవిడ. జీతం మొత్తం తీసుకుని ఇంటి ఖర్చులన్నీ చూసేది మా ఆవిడేసార్".

"సర్లే. రేపు ఫోన్ చెయ్యి. మా ఆవిడ్ని అడిగి చెప్తాను. ఇక్కడ జీతాల ఖర్చులన్నీ చూసేది మా ఆవిడే" ఫోన్ పెట్టేసాడాయన.

లింగమయ్య వంక చూసి చెప్పాడు సుబ్బారావు.

"కూర్చో నీతో మాట్లాడాలి. ఓ చక్కటి ఓల్డ్‌హౌస్ ఒకటి చూసానయ్యా. ఆ ఇంటావిడ దాన్ని ససేమిరా అమ్మనంటోంది. అది మనకి దక్కి దాన్ని డెవలప్ చేయాలన్నది నా ఆశ. ఎలా ఆవిడ్ని వప్పించడం?"

"మార్కెట్ రేట్ కన్నా కొద్దిగా ఎక్కువ ధర చెప్తే?"

"ఊహు. వప్పుకోలేదు".

"నన్ను మాట్లాడమంటారా సార్?"

"లాభం లేదయ్యా. అసలు ఆ పనిమీద అంటే తన ఇంట్లో కాలే పెట్టనివ్వదు ఆవిడ".

"ఓసారి కాలు పెట్టనిస్తే నేనెలాగో కన్విన్స్ చేస్తాను అడ్రస్ చెప్పండి".

సుబ్బారావు అడ్రస్ చెప్పాడు.

అది 'బావున్నారా?' అని తను చూడడానికి తరచు వెళ్ళే బామ్మగారిల్లని తెలీగానే లింగమయ్య మొహం ఒక్కసారిగా పాలిపోయింది.

**(ఇంకా వుంది)**






తెలుగు సినీ సంగీత చరిత్ర పుటలకు ఎక్కిన మంచి పాటలలో -ఉదాత్త స్థాయిని ఉంచదగ్గ వాటిని తిరిగి మరో చోట చేర్చి పరిశీలిస్తే - అందులో సింహ భాగాన్ని ఓ పదిహేనేళ్ళ పాటు అన్నపూర్ణ సంస్థ నుంచి వచ్చిన గీతాలకు ఇవ్వవలిసి ఉంటుంది. కథ, సంభాషణలు, నటనాస్థాయి, చిత్రీకరించే తీరు-వీటితో పాటు సంగీత సాహిత్యాల విషయంలో కూడా నిబద్ధతతో కూడిన బాధ్యత ఇవన్నీ ఆ సంస్థ తీసిన చిత్రాలలో కనిపిస్తూ ఉంటాయి. అసలు ఈ సంస్థకు పెట్టిన 'అన్నపూర్ణ' పేరు అక్కినేని నాగేశ్వరరావుగారి భార్యపేరు అని చాలామంది అనుకుంటారు. కానీ అది నిర్మాత దుక్కిపాటి మధుసూధనరావు గారిని పెంచిన తల్లి పేరు. కృతజ్ఞతా సూచకంగా ఆ పేరు పెట్టుకున్నారు. అంతకుముందు ఈ పేరుతో పాటు దుక్కిపాటి మధుసూధనరావుగారి కూతుళ్ళ పేర్లయిన లలిత కుమారి, కళ్యాణి పేర్లను కూడా పరిగణనలోకి తీసుకున్నారు. సముద్రాల రాఘవాచార్యులు గారు, నార్ల వెంకటేశ్వరరావు గారు కలిసి సంఖ్యాశాస్త్రం ప్రకారం 'అన్నపూర్ణ' పేరు కలిసొస్తుందని చెప్పటంతో ఈ పేరునే తమ సంస్థకు ఖరారు చేసుకున్నారు.

తొలి చిత్రానికి దర్శకుడిగా మొదటి భరణి పిక్చర్స్ అధినేత, భానుమతిగారి భర్త అయిన రామకృష్ణని అనుకుని అడ్వాన్సు కూడా ఇచ్చారు. కానీ ఆయన తన వ్యక్తిగతమైన ఒత్తిడుల వలన ఆ అడ్వాన్సు తిరిగి ఇచ్చేసి చెయ్యలేనని చెప్పేశారు. ఆ తర్వాత పి. పుల్లయ్యగారిని అనుకున్నారు. అయితే తమ చిత్రం పూర్తయేమేరకు ఇంకే చిత్రాన్నీ అంగీకరించరాదని మధుసూధనరావుగారు షరతుపెట్టారు. పుల్లయ్యగారు అందుకు అంగీకరించినా, అంతకుముందే ఒప్పుకున్న చిత్రాల ఒత్తిడి అందుకు సహకరించలేదు. దాంతో ఆయన కూడా తప్పుకోవలసివచ్చింది. ఆ తర్వాత బి.యన్.రెడ్డి గారిని కలిశారు. వాహినీ సంస్థ నుండి బైటికివచ్చి మరో చిత్రం చెయ్యాలంటే లక్ష రూపాయలు ఇవ్వవలసి ఉంటుందన్నారు బి.యన్. రెడ్డి. అంత ఇవ్వలేక ఆ ప్రపోజల్‌ని డ్రాప్ చేసుకున్నారు. చివరకు అక్కినేని నాగేశ్వరరావు, దుక్కిపాటి మధుసూధనరావు కలిసివెళ్ళి కె.వి. రెడ్డి గారిని కాంటాక్ట్ చేశారు. అప్పుడాయన 'పెద్ద మనుషులు' చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. అదయ్యేవరకు ఆగక తప్పదు. ఎందుకంటే కె.వి. రెడ్డిగారు ఒకేసారి రెండు చిత్రాలకు దర్శకత్వం వహించరు. సరే ఆగుతాం అన్నారు దుక్కిపాటి వారు.

ముందు కె.వి. రెడ్డిగారు ఓ కథను సూచించారు. దానిపై 6 నెలలపాటు చర్చలు జరిగాయి. మధుసూధనరావు గారికి ఆ కథ నచ్చలేదు. మొదటి సగం ఒక కథలాగ, రెండో సగం ఇంకో కథలాగ మొత్తం 2 కథలు కలిపినట్టు ఉంది అని అనుకున్నారు. ఈ సంగతి కె.వి. రెడ్డి గారికి డి.వి. నరసరాజుగారి ద్వారా తెలిసి - సందేహాలు పెట్టుకుంటూ సినిమా తియ్యకూడదు. మరో సబ్జెక్ట్ వర్కవుట్ చేద్దాం - అన్నారు. అలా ఆ సబ్జెక్ట్ పక్కనపడింది. పక్కన పడిన ఆ సబ్జెక్ట్‌తో కె.వి. రెడ్డి గారు కొన్నాళ్ళ తర్వాత 'పెళ్ళినాటి ప్రమాణాలు' అనే సినిమా తీశారు. అది వేరే సంగతి.

ఈలోగా హిగ్గిన్ బాదమ్స్‌లో 'లవింగ్ బ్రదర్స్' అనే పుస్తకం దుక్కిపాటివారి కంటబడింది. అట్టమీద ఇచ్చిన సంక్షిప్తకథను చదివి పుస్తకం కొని మొత్తం చదివారు. తమ్ముడి కోసం అన్న దొంగతనాలు చేసి చదివించడం అందులోని పాయింట్. ఆ పాయింట్ తీసుకొని తమ్ముడి పాత్రను చెల్లెలు పాత్రగా మారిస్తే ఎలా ఉంటుందన్న ఆలోచన వచ్చింది. దుక్కిపాటి వారు, డి.వి. నరసరాజుగారు ఆ పాయింట్ మీద వర్క్ చేసి కె.వి. రెడ్డి గారికి వినిపించారు. ఆయన బావుందన్నారు. పూర్తిస్థాయిలో ట్రీట్‌మెంట్ మొదలయింది.

అలా 1951లో సంస్థను రిజిష్టర్ చేసిన అన్నపూర్ణావారు తమమొదటి ప్రయత్నంగా నిర్మించి 1955లో విడుదల చేసిన ఆ చిత్రమే




ఈ చిత్రానికి సంగీతదర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావు. ఉన్న తొమ్మిది పాటలకు కర్త సముద్రాల రాఘవాచార్యులు - ఆ 9 పాటలలో 'దొంగరాముడు' సినిమా పేరు వినగానే చటుక్కున స్ఫురించే ఓ ఆరు గీతాలివి...



*This feature is*
*sponsored by*
**Sri M.V.S. Haranatharao**
(Dialogue writer)
*for this issue*

అంద చందాల సొగసరివాడు (2)
విందు భోంచేయ వస్తాడు నేడు
చందమామ...ఓహో చందమామ
చందమామ ఓహో చందమామా... ఓఓఓ...
ఓ...ఓ...ఓ...చూడచూడంగ మనసగువాడు
ఈడు జోడైన వలపుల రేడు
ఊ...వాడు నీకన్నా సోకైన వాడు...
విందు భోంచేయ వస్తాడు నేడు ॥చందమామ॥
ఓ..ఓ..ఓ..వాని కన్నుల్లో వెన్నెల్ల జాలు
వాని నవ్వుల్లో ముత్యాలు రాలు
ఊ...వాడు నీకన్నా చల్లని వాడు
విందు భోంచేయ వస్తాడు నేడు ॥చందమామ॥
ఓ..ఓ..ఓ..నేటి పోటీల గడుసరివాడు
మాట పాటించు మగసిరివాడు
ఊ...వాడు నీ కన్నా సిరిగలవాడు...
విందు భోంచేయ వస్తాడు నేడు ॥చందమామ॥





ఈ పాటను జిక్కి పాడగా సావిత్రి అభినయించింది. సన్నివేశప్రాధాన్యంగా చివర్లో అక్కినేని నాగేశ్వరరావు కనిపిస్తారు. పహడీ రాగచ్ఛాయలలో అన్యస్వరాలు కలుపుకుంటూ స్వతంత్ర సంచారం చేసుకుంటూ ఈ పాటను స్వరపరిచినట్టు అనిపిస్తుంది. పాట సాహిత్యాన్ని చూస్తే - ఇటువంటి ఎక్స్‌ప్రెషన్స్‌తో మనం చాలా పాటలు వినేశాం కనుక - 'ఏముందంత?' అని అనిపించవచ్చు కానీ ఇది 47 ఏళ్ళక్రితం రాసినది అని ఒక్కసారి మనసుకి సజెషన్ ఇచ్చుకుని చూడండి. అప్పుడు కలిగే అభిప్రాయం ఖచ్చితంగా బావుంటుంది.

అ: ఓ... చిగురాకులలో చిలకమ్మా
చిన్నమాట విన రావమ్మా
ఆ: ఓ - మరుమల్లెలలో మావయ్యా
మంచి మాట సెలవీవయ్యా
అ: పున్నమి వెన్నెల గిలిగింతలకు
పూచిన మల్లెల మురిపాలు
నీ చిరునవ్వుకు సరికావమ్మా ॥ఓ... చిగురాకులలో॥
ఆ: ఎవరన్నారో ఈ మాట
వింటున్నాను నీ నోట
తెలిసీ పలికిన విలువేనా ॥ఓ... మరు మల్లెలలో॥
అ: వలచే కోమలి వయ్యారాలకు
తలచే మనసుల తియ్యదనాలకు
కలవా విలువలు సెలవీయ ॥ఓ... చిగురాకులలో॥
ఆ: పై మెరుగులకే భ్రమపడకయ్యా
మనసే మాయని సొగసయ్యా
గుణమే తరగని ధనమయ్యా ॥ఓ... మరు మల్లెలలో॥



ఈ పాటను జిక్కి, ఘంటసాల పాడగా తెరపై సావిత్రి, అక్కినేని అభినయించారు. పాటలో మొత్తం సాహిత్యం అంతా ఒక ఎత్తు, 'వలచే కోమలి వయ్యారాలకు అనే చరణంలోని సాహిత్యం ఒక్కటీ ఒక ఎత్తు. పాడుకునేందుకు వీలుగా భాష ఎంత సరళంగా, వినసొంపుగా ఉందో భావం అంత గుంభనంగా గుబాళిస్తూ ఉంటుంది. ప్రేమకు మనం ఆదర్శంగా ఉదహరించుకునే లైలా-మజ్ను జంటలో లైలా అంత అందంగా ఉండదట. "మరి ఆమె గురించి ఎందుకంత పడి చచ్చిపోతావ్?" అని అడిగితే "నా కళ్ళతో చూడు" అన్నాడట మజ్ను. గాఢమైన ప్రేమకు నిదర్శనంగా చెప్పుకునే ఆ సంఘటనను

కవితా రూపంలో చెప్పాల్సి వస్తే దానికి ఈ చరణాన్ని మించిన ఉదాహరణ లేదనిపిస్తుంది. భీంప్లాస్ రాగంలో మిగిలిన సంగీత దర్శకులు ఇచ్చిన బాణీలతో పోలిస్తే పెండ్యాల పోకడ ప్రత్యేకంగా ఉంటుంది. ఈ పాట వరకూ ఆయన అక్కడక్కడ శుద్ధ ధన్యాసి రాగాన్ని స్పృశించినా ఎక్కువగా భీంప్లాస్ రాగం మీదే నడిపారు. మధ్య మధ్య వినిపించే ఫ్లూట్ బిట్స్‌కి ఈ చిత్రం విడుదలకు కొన్ని సంవత్సరాల ముందు వచ్చిన 'దిల్లగీ' హిందీ చిత్రంలో నౌషాద్ స్వరపరిచిన 'తూ మేరీ చాంద్‌నీ' అనే పాటలోని ఫ్లూట్ బిట్స్ ప్రేరణ అని కొందరంటారు.

బలే తాత మన బాపూజీ -బాలల తాతా బాపూజీ (2)
బోసి నవ్వుల బాపూజీ - చిన్నీ పిలక బాపూజీ ॥బలే॥
కుల మత భేదం వలదన్నాడు - కలిసి బతికితే బలమన్నాడు
మానవులంతా ఒకటన్నాడు - మనలో జీవం పోశాడు ॥బలే॥
నడుం బిగించి లేచాడు -అడుగూ ముందుకు వేశాడు
కదం తొక్కుతూ పదం పాడుతూ - దేశం దేశం కదిలింది !
గజ గజలాడెను సామ్రాజ్యం -
మనకు లభించెను స్వారాజ్యం!(2) ॥బలే॥
సత్యా హింసలే శాంతి మార్గమని - జగతికి జ్యోతిని చూపించాడు
మానవ ధర్మం బోధించాడు (2)
మహాత్ముడై ఇలవెలిశాడు ॥బలే॥



ఈ పాటను పి. సుశీల, బృందం పాడగా ప్రధాన పాత్రధారిణిగా జమున అభినయించారు. అన్నపూర్ణావారి ప్రతి చిత్రంలోనూ దేశభక్తి సంబంధించినది గాని, సామాజిక ధర్మానికి సంబంధించినది గాని కనీసం ఒక్క పాట అయినా ఉండి తీరుతుందన్న నమ్మకానికి, సంప్రదాయానికి పునాది వేసిన పాట యిది. ఇవాల్టికీ ఖద్దరును ధరించే దుక్కిపాటి మధుసూధనరావు, అక్కినేని నాగేశ్వరరావుల కమిట్‌మెంట్‌కి ఓ సూచిక - ఈ గీతం! దేశానికి సంబంధించిన పాట కాబట్టి దేశ్ రాగాన్ని ఈ పాటకి ఎక్కువగా వాడుకున్నారనిపిస్తుంది...! అప్పట్లో సుశీల గాత్రాన్ని సెకెండ్ హీరోయిన్‌కే ప్రిఫర్ చేసేవారు. దుక్కిపాటి మధుసూధనరావుగారి ప్రోత్సాహం వల్లనే ఆవిడ హీరోయిన్‌లకు పాడేస్థాయికి ఎదిగింది. ఆ కథా కమామీషు 'తోడి కోడళ్ళు' సినిమాను గురించిన వివరాలలో చర్చించడం జరుగుతుంది. ఇంతకూ ఈ విషయం ఎందుకు ప్రస్థావించవలసి వచ్చిందంటే ఆ రోజుల్లో సుశీల గొంతు ఎంత షార్ప్‌గా ఉండేదో తెలియజేయడానికే. ఈ పాట దొరికితే వినిచూడండి మీకే తెలుస్తుంది.

అనురాగము విరిసేనా - ఓ... రేరాజా
అనుతాపము తీరేనా!
వినువీధి నేలే రాజువే
నిరుపేద చెలిపై మనసౌనా? ॥అను॥
నిలిచేవు మొయిలు మాటున
పిలిచేవు కనుల గీటునా! ॥నిలిచేవు॥
పులకించు నాదు డెందము
ఏనాటి ప్రేమబంధమో! ఓ... రేరాజా... ॥అను॥
మునుసాగే మోహాలేమో
వెనుకాడే సందేహాలేమో ॥మునుసాగే॥
నీ మనసేమో తేటగా
తెనిగించవయ్యా మహారాజా.. ఓ... రేరాజా... ॥అను॥



ఈ పాటను పి. సుశీల పాడగా జమున అభినయించారు. సన్నివేశ ప్రాధాన్యంగా జగ్గయ్య వేరే షాట్‌లలో అక్కడక్కడ కనిపిస్తారు. ఇది బొత్తిగా, పూర్తిగా పెండ్యాల వారి పాట. పెండ్యాల మార్క్ భీంప్లాస్ రాగం పాటంతా పరుచుకుని వినిపిస్తూ ఉంటుంది. కావాలంటే - చరణాలలోని మొదటి రెండు లైనులూ ఆలపించుకొని చూడండి. ఆ ఆలాపన - ఓ నెలరాజా వెన్నెల రాజా మా వన్నెలన్ని చిన్నెలన్ని నీకేనోయీ (భట్టి విక్రమార్క), ఆ పూలదారులలో ఆ నీలి తారల వెన్నెల స్నానాలు చేయుదమా (నాకంటి పాపలో నిలిచిపోరా - వాగ్దానం), నీలి మేఘాలలో గాలి కెరటాలలో (బావా మరదళ్ళు), ధరణి నేమి మహిమ చూప ద్వారకలో నుంటివో (దేవ దేవ నారాయణ పరంధామ పరమాత్మ - శ్రీ కృష్ణార్జున యుద్ధం)... లీలా శుకులు ఋష్యశృంగులు మన యతీంద్రులై వెలసిరిగా (స్వాముల సేవకు వేళాయె - శ్రీ కృష్ణార్జున యుద్ధం)... వంటి వరసల్ని వరసగా మన మనసుల్లో కదలాడేట్టు చేస్తుంది. భీంప్లాస్‌లో పెండ్యాల మార్కు వరసలివి.

ఈ పాటలో జమునని ఎక్కువగా ఎడంవైపునుండే చిత్రీకరించటం జరిగింది. దాంతో ఆమెకి కుడివైపున గల 'పన్ను మీద పన్ను' దృశ్య పరంగా కొత్తందాలను చూపించటం, ఆ పన్ను మీద పన్ను తర్వాత చిత్రాల్లో ఓ విశేషాకర్షణగా మారడం, తహశీల్దార్ గారమ్మాయి వంటి చిత్రాల్లో ఆ పన్ను మీదే ఓ డైలాగు ఉండడం - వీటన్నిటికీ - అనురాగము విరిసేనా పాటే శుభారంభం కావటం ఓ చెప్పుకోదగ్గ విశేషం.



(పెండ్యాల తను చనిపోవటానికి వారం పదిరోజుల ముందు స్వహస్తాలతో ఒక అభిమానికి రాసిన ఉత్తరంలోని కొంత భాగమిది)

లేవోయి చిన్నవాడా
లే లే లేవోయి చిన్నవాడా
నిదుర లేవోయి వన్నెకాడా
నిదుర లేవోయి వన్నెకాడా
పొడిచింది చందమామ...
చేరి పిలిచింది వయ్యారిభామా(2)
కురిసింది వెన్నెలవాన...
ఆహా...విరిసింది పన్నీటివాసన ॥లేవోయి॥
కన్నుల్లో కలమాసె నేల
నీ మదిలో మబ్బు మూసె నేల (2)
వెత చెంది సుఖపడలేవురా...
నీ బతుకల్లా కలయైపోవురా ॥లేవోయి॥
నిన్న కలసి మొన్నలోన
మొన్న నేడు రేపు సున్న (2)
ఉన్ననాడే మేలుకో
నీ తనివే తీరా ఏలుకో ॥లేవోయి॥



ఈ పాటను జిక్కి పాడగా నృత్య కళాకారిణి కుచల కుమారి అభినయించింది. సన్నివేశ ప్రాధాన్యంగా అక్కినేని నాగేశ్వరరావు, ఆర్. నాగేశ్వరరావు ఉంటారు. అక్కడక్కడ హాస్య నటులు పద్మనాభం, బాలకృష్ణకూడా కనిపిస్తారు. మధ్యమావతి రాగచ్ఛాయలలో ట్యూన్ చేయబడిన చక్కటి మధురగీతమిది.

హీరో డిప్రెషన్‌లో ఉంటే అతడి మనసుకి సేద తీరుస్తూ తిరిగి ఉత్తేజితుణ్ణి చేయడానికి ఉద్దేశించబడిన గీతమిది. ఇది దృష్టిలో పెట్టుకుని సాహిత్యాన్ని గమనించండి. ఇదే కాన్సెప్ట్‌తో ఇలాంటి సన్నివేశాలకు రూపకల్పన చేయవలసివస్తే ఇప్పుడు ఎలా రూపుదిద్దుకుంటాయన్నది ఊహించుకుని పాటను మరోసారి వినండి. అన్నపూర్ణా సంస్థపైనా, ఆనాటి కళాకారుల నిబద్ధత మీద గౌరవం ఎంతగా పెరిగిపోతుందో బేరీజు వేసుకుని చూడండి, అంతకుమించి వివరంగా విశ్లేషించటం అనవసరం.

రారోయి మా ఇంటికి - మావో
మాటున్నది - మంచి మాటున్నది ॥రారోయి॥
నువ్వునించుంటె నిమ్మచెట్టు నీడున్నది
నువ్వు కూసుంటె కురిసీల సీటున్నది
నువ్వు తొంగుంటె పట్టెమంచం పరుపున్నది
మాటున్నది - మంచి మాటున్నది ॥రారోయి॥
ఆకలైతే సన్నబియ్యం కూడున్నది
నీకాకలైతే సన్నబియ్యం కూడున్నది
అందులోకి అరకోడి కూరున్నది
ఆపైన రొయ్యపొట్టు చారున్నది
మాటున్నది - మంచి మాటున్నది ॥రారోయి॥
రంజైన మీగడ పెరుగున్నది
నంజుకోను ఆవకాయ ముక్కున్నది
నీకు రోగమొస్తే ఘాటైన మందున్నది (2)
నిన్ను సాగనంప వల్లకాటి దిబ్బున్నది
మాటున్నది - మంచి మాటున్నది ॥రారోయి॥





'రారోయి మాయింటికి' పాటను జిక్కి పాడగా తెరపై సావిత్రి, ఆర్. నాగేశ్వరరావు అభినయించారు. ఈ పాటలో మరో పురుష కంఠం కూడా వినిపిస్తుంది. ఆ మాటలను ఆర్ నాగేశ్వరరావే పలికేరనుకునేవాళ్ళు ఇప్పటికీ ఉన్నారు. నిజానికి ఆ కంఠం మద్దాలి కృష్ణమూర్తి అనే ఓ నటునిది. అంత గొప్పగా పలికారాయన ఆ తాగుడు మాటలను.

ఈ పాటకి పెండ్యాల వారు చాలా తెలివిగా హిందుస్థాని సంప్రదాయంలోని మజ్రా శైలిని అనుసరించేరని చెప్పాలి. ముజ్రాలలో శృంగార పూరితమైన ఆహ్వానం వశీకరణం పద్ధతిలో ధ్వనిస్తూ ఉంటుంది. ఓ రకమైన ఊపు, మత్తు ఉంటాయి. అవన్నీ ఈ పాట స్వభావానికి సరిపోయాయి. ఈ పాట మ్యూజిక్ సిట్టింగ్స్‌లో తాగిన వాడి నోటికి ఏవి రుచిస్తాయో అవి ఉదహరిస్తే బాగుంటుందన్న సలహా రావడంతో సముద్రాల వారు పెండ్యాల గారిని అడిగారట... 'ఓరే... నాగేశ్వరరావు... కోడి కూర అంటారు కదా... అదెలా ఉంటుందిరా?' అని పెండ్యాల గారు 'నాకంతగా అనుభవం లేదండి' అన్నారట. చివరకు ఆర్ట్ డైరెక్టర్ కృష్ణారావు గారిని అడిగితే - అరకోడి కూర, రొయ్య పొట్టు చారు బ్రహ్మాండంగా ఉంటాయని చెప్పారట. అప్పుడా రెండింటినీ రెండో చరణంలో అద్వితీయంగా జొప్పించి అందర్నీ మెప్పించారు సద్బ్రాహ్మణుడైన సముద్రాల రాఘవాచార్య. ఇక తెరపై చిత్రీకరణ పరంగా ఈ పాట ఎంత బాగా రక్తి కట్టిందంటే 'అప్పుడు ఆర్. నాగేశ్వరరావు దొరికి పోయాడు సావిత్రి చేజిక్కి- ఎందుకంటే అక్కడ అద్భుతంగా పాడింది గాయని జిక్కి" అంటూ కొందరు కవితాత్మకంగా చెప్పుకునేవారు ఆ రోజుల్లో.



(పెండ్యాల తను చనిపోవడానికి వారం పదిరోజుల ముందు స్వహస్తాలతో ఒక అభిమానికి రాసిన ఉత్తరంలోని కొంత భాగమిది)


చదువుల్రావు
సత్యమూర్తి BV
చదువుల్రావు నలవుల వ్యైకా కాలేజీలో జేరడానికి హైద్రాబాద్ ప్రయాణమయ్యేడు
ఆ రోజు జయశ్రీ కూడ వాళ్ళ తాతగారు బామ్మగారితో సహా రైల్వేస్టేషన్‌లో కనిపించింది.
ఓహో... కాలేజీలో జేరడానికి హైద్రాబాద్ వస్తూందిలాగుంది
ఇంతలోకి రైలు వచ్చి ఆగింది. ముసలి దంపతులు, జయశ్రీ ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్లోకి ఎక్కేరు
అబ్బాం... వీళ్ళు ఫస్ట్‌క్లాస్‌లోకి ఎక్కేరేంటి?! సరే నా కాలేజీ జీతానికి తెచ్చిన డబ్బుతో ఫస్ట్‌క్లాస్
టికెట్ కొనేస్తా
టికెట్ మార్చుకుని వచ్చి సరిగ్గా జయశ్రీ ఎదురుకుండా కూర్చుంటాడు
ఇంతలోకి రైలు కదలడానికి గంట కొట్టేరు
ఇంక దిగమ్మా, బాలాసేపు కూర్చున్నావే మా కోసం
జాగ్రత్తగా వెళ్ళిరండి తాతయ్యా వెళ్ళొస్తా బామ్మా టాటా...
టాటాగారు మంచినీళ్ళు మంచినీళ్ళు

# 'నిమ్మ'ళంగా రసానుభూతిని పంచిన

# వాసా అప్పయ్యగారి సంగీతం!!

**రెండు వందల సంవత్సరాల్నించీ వంశపారంపర్యంగా సంగీతం నేర్చుకుంటున్న కుటుంబం ఎల్లా ఉంటుందో ఊహించండి!**

**భూపాలం వచ్చి ఆ గుమ్మం ముందు కళ్ళాపి చల్లి ముగ్గు లేస్తుంది.**

**మలయ మారుతం వొచ్చి తోరణాలు కట్టి మంగళవాయిద్యాలు వాయిస్తుంది.**

**ఆ ఇంట్లో ముత్తయిదువ దువ్వెన్నతో కురులు దువ్వుకుంటోంటే వాయులీనం మీద కమాను సంచారం చేస్తుంది!**

**ఊయల మంచం మీద కన్నెపిల్ల బోర్లా పడుకునీ ఉంటే ఊగుతోన్న 'వీణ'...**

**పెద్దాయన కచ్చికతో దంతధావనం చేస్తోంటే... మోర్సింగ్ ధ్వని....**

**కుర్రాడు పందుం పుల్లతో పళ్ళు తోమితే వేణువు...**

**అడంగులు కుండలో నీళ్ళు పడ్తోంటే - టకటకా .... ఘటం....**

**గాడి పొయ్యి మీద అత్తెసరు పడేస్తే... కుతకుత మృదంగం-**

**సరళీ స్వరాలు వాళ్ళ పసిపాపల నోళ్ళల్లో పాలపీకలైతే జంట స్వరాలు గిలకలౌతాయ్...**

**వాళ్ళ బంధాలు, అనుబంధాలూ... ఆనందాలు... అలకలు - అల్లర్లూ అన్నీ సంగీతానుబంధాలే....**

**వాళ్లింట్లోంచి 'శివరంజని' వినిపిస్తోంటే... అంతా ఏదో బెంగతో ఉన్నారన్నమాట...**

**వారే ... సంగీతంలో పేరెన్నికగన్న వారు - 'వాసా' వారు.**

వాసా వారి కుటుంబంలో చాలామంది బొబ్బిలి ఆస్థాన విద్వాంసులుగా గాత్ర విద్వాంసులుగా, వైణికులుగా ఉండేవారు!

వాసా వెంకటరావుగారు విజయనగరం మహారాజా ఆహ్వానం మేరకు విజయనగరం వెళ్లి అక్కడ రాజావారి కుమార్తెలకు వీణ నేర్పించారు...

వాసా సాంబయ్యగారు ఆధ్యాత్మరామాయణ కీర్తనలని స్వరపరిచీ కీర్తనలు పాడే వారు...

వాసా జగన్నాధంగారు స్వర పల్లవులు....

వాసా కృష్ణమూర్తిగారు గీతాలూ అవీ రాసేవారు....

ఇలాగ ఒక్కొక్కళ్ళదీ ఒక్కొక్క ప్రత్యేకత...

వీళ్ళలో వాసా అప్పయ్యగారికి... సంగీతమే గాకుండా నృత్యం కూడా వొచ్చు.

గొప్ప వైణికుడు... ఆయన జీవితంలోని ఓ సంఘటన:

అవి సంక్రాంతి పండగ రోజులు....

ఓ రోజు వాసా అప్పయ్యగారు... తెల్లారగట్టే .... స్నానం సంధ్యా ముగించుకుని... గుమ్మంలో కూర్చునీ... వీణశ్రుతి చేసుకుంటున్నారు...

ఈలోగా ...హరిలోరంగ హరీ ...అంటూ ఓ హరిదాసొచ్చీ.... గుమ్మం ముందు కాస్సేపు 'కృష్ణం కలయ సఖి సుందరం.... బాలకృష్ణం కలయ సఖి సుందరం' అంటూ నారాయణతీర్థుల వారి తరంగాల్ని... మృదుమధురంగా పాడుతూ చిన్న చిందు కూడా వేసాడు....

ఇంట్లో ఆడవాళ్ళొచ్చీ... దోసిళ్ళతో బియ్యం వేసారు...

హరిదాసు...ఒడుపుగా వొంగీ... బియ్యం తీసుకునీ...

మరో తరంగం అందుకునీ... వెళ్ళిపోయాడు!!!

అప్పయ్యగారి దృష్టి హరిదాసు నెత్తిమీది.... రాగి గిన్నె మీద పడింది....

పాట పాడుతూనే... ఒంగి... ఎంత ఒడువుగా బియ్యం వేయించుకున్నాడు...!? ఏదైనా సాధన అనిపించింది!

అవును మరి... నీళ్ళకెళ్ళే ఆడాళ్ళు కూడా కుండ మీద కుండెట్టుకునీ నీళ్ళు పట్టుకురారూ అనుకున్నాడు....

వెంటనే ఓ ఆలోచన వొచ్చింది!

వీణ వాయించడం - వైణికులంతా చేసే పనే...

అందులో ఏదన్నా తమాషా చేస్తే!....

ఏం చేద్దాం?

తను కూడా నెత్తిమీద ఓ గిన్నో చెంబో పెట్టుకుని.... దాన్ని కింద పడకుండా వాయించగలిగితే -

కష్టం!!! ఏంచేతంటే....

వీణ వాయిస్తోంటే... వింటున్నవాళ్ళే.. కాళ్ళు... చేతులు... తలలు ఊపేస్తూ ఉంటారు...

ఇక వాయించేవాడు ఊపకుండా - ఉండడమా?

ముందు తల ఊపకుండా... కాస్సేపు వాయించి చూశాడు...

అబ్బే వల్ల కాలేదు....

తరువాత హరిదాసుని గుర్తు తెచ్చుకునీ.... నెత్తిమీద మెత్తటి తలగడ పెట్టుకునీ ప్రయత్నం చేసాడు...

ఫరవాలేదు...

మళ్ళీఈసారి... హరిదాసు గిన్నిని పోలిన గుమ్మడిపండు పెట్టుకునీ సాధన చేసాడు.

రెండు మూడుసార్లు ... తొడమీద పడింది!

ఫర్వాలేదు... దార్లో పడ్డాం అనుకున్నాడు...

కానీ ఇంత పెద్ద పండు పెట్టుకుని వాయిస్తే.... అదేం పెద్ద విశేషం!....

ఒకళ్ళు చెయ్యలేనిది - మనం చేస్తేనే కదా...

కీర్తి - ప్రతిష్టా.... ఆత్మ తృప్తినీ...

మళ్ళీ మనసులో ఏదో మెరుపు మెరిసింది!!

****

విజయనగరం మహారాజా వారికి వాసా అప్పయ్యగారంటే గౌరవం... ఆయన సంగీతం అంటే ఇష్టం....

ఆయన కచేరీలు అవీ పెట్టించడం కాకుండా... ఏదైనా శుభ సందర్భంలో కేవలం కుటుంబ సభ్యుల్ని.... అందులోనూ సంగీతం అంటే ఇష్టం ఉన్న వాళ్ళని పిలిచీ... వాసా అప్పయ్య గారికి కబురు పెట్టేవాడు.

సరే అప్పయ్యగారు రావడం....

కోరిన కీర్తనలు విని... కమ్మగా కరువుతీరా వాయించడం!!

రాజా వారిచ్చిన బహుమానాన్నీ - పట్టుకుని -దణ్ణాలెట్టుకుని

వెళ్ళిపోవడం ఆనవాయితీ!

ఒక్కొక్కసారి రాత్రి తెల్లవార్లూ వీణావాదనం సాగేది!!

సూర్యకిరణాలు మీద పడ్తుండగా స్పృహలోకొచ్చి సంగీత సభ చాలించే వారు!

అదీ రసికత్వం....!!!

అలాంటి సందర్భమే మళ్ళీ వచ్చింది... వెంటనే అప్పయ్యగారికి కబురు....

అప్పయ్యగారూ, వీణా సిద్ధం!....

రాజా వారు మందహాసం చేసి... "అప్పయ్యగారూ ఇవాళ ఘన రాగ పంచాకాన్ని వినాలని ఉంది.... తేనె పానకాన్ని అందించండి!"

"చిత్తం ప్రభూ. అయితే తేనే పానకంలో కొంచెం నిమ్మ రుచి తగిలిద్దామనుకుంటున్నా."

"నిమ్మరసం కలిసిన తేనెపాకం మరీ మధురంగా ఉంటుంది.... అంటే ఏం చేస్తారూ!"

అప్పుడు అప్పయ్యగారు పచ్చటి నిమ్మ పండొకటి తీసి చేత్తో పట్టుకున్నాడు...

మెరిసిపోతోంది... కనక పుష్యరాగం లాగ....

"ప్రభూ మీరు అనుమతిస్తే... దీన్ని నెత్తిమీద పెట్టుకునీ.... పడెయ్యకుండా వాయిస్తాను... రాగాలన్నింటినీ..."

"ఛా"

ఆశ్చర్యపోయి కనుబొమలెగరేసారు రాజా వారు.

"ఇది మరీ అద్భుతం కానివ్వండి! సంగీతం ఇంతవరకు శ్రావ్య మేననుకున్నాను. దీన్లో దృశ్యం గూడ చేర్చారూ..." మెచ్చుకోలుగా మరో మారు కళ్ళెగరేసారు రాజా వారు.

**వీణ ఠంగున మోగింది!**

**మొదలైంది ఘన రాగంగా పంచకం**

**మొదటిది నాట రాగం...**

**వీణ మెట్లుమీద వేళ్ళు... పైకి కిందికీ పరిగెడ్తున్నాయ్....**

**నెత్తిమీద నిమ్మ పండు... "జగదానందకారకా" రక్షించు తండ్రీ అనుకుంది!**

**రెండో రాగం.. గౌళ... వీణమీద తర్జని హోయలు పోతోంది!**

**నిమ్మ పండు ఉండబట్టలేక... తన చుట్టూ తాను తిరిగింది... "దుడుకు గల కొడుకు"లా**

**మూడో రాగం.. ఆరభి....**

**రాజా వారితో సహా బంధువులంతా తలలూపేస్తునన్నారు వీణా వాద్యానికి.. ఒక్క వాయిస్తున్న అప్పయ్య తప్ప...! అప్పుడనుకుంది నిమ్మపండు 'సాధించెనే ఓ మనసా' అని.**

**నాలుగో రాగం... నాలుగో ఝాము ... వరాళి రాగం....**

**సరిగ్గా నిద్రా దేవత.. అందర్నీ కావలించుకునే సమయం!**

**వీణతీగల మీద వేళ్ళు నాట్యం చేస్తున్నాయ్!**

**అంతా ఊపిరి బిగించి చూస్తున్నారు... అప్పయ్యగారి వీణనీ.... ఆయన నెత్తిమీదున్న నిమ్మపండునీ... ఊహూ....**

**నిమ్మపండు.. నిమ్మకు నీరెత్తినట్టుంది!**

**ఆఖరి రాగం.... శ్రీరాగం....**

**నిర్భీతిగా ఉన్నాడు అప్పయ్య...**

**రాజావారిలో కొద్ది ఆందోళన... ఇంతదాకా లాక్కొచ్చాడు...**



**చివరికేం చేస్తాడో అని**

**నిమ్మపండు మాత్రం.... ఎందరో మహానుభావులూ.... అందరికీ వందనములూ ...అంది!....**

**అయిపోయాయ్ అయిదు రాగాలు..**

**రాజా వారు గబగబా వొచ్చి కావలించుకున్నాడు!!**

**ఇప్పుడు కింద పడింది నిమ్మపండు!**

ఇద్దరి కాళ్ళ మధ్య...!

ఇద్దరి స్నేహానికీ... పరస్పర గౌరవాలకీ... రసజ్ఞతకీ సాక్షిగా...

నెత్తిమీద నిమ్మపండు పెట్టుకుని... రాత్రి తెల్లవార్లూ వాయించిన మహా విద్వాంసుడు వాసా అప్పయ్య....

రాజా వారు... బహుమతుల్ని ఇచ్చి... శాలువాలు కప్పి...

మర్నాడు... ఓ బండెడు నిమ్మపళ్ళు కూడా పంపాడు.

భర్త శక్తి సామర్ధ్యాలకి మురిసి పోయి...

ఓ నిమ్మపండుని ఆయన చుట్టూ తిప్పి దిష్టి తీసి పారేసింది... వాసా అప్పయ్య గారి శ్రీమతి.

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**

కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212, మోతీనగర్, హైదరాబాదు - 500 018

అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.

జూన్ 28 ముళ్ళపూడి వెంకట రమణ జన్మదిన సందర్భంగా

# రమణీయ కథ




**రమణగారి గురించి బాగా తెలిసిన వ్యక్తి శ్రీ నండూరి రామమోహనరావు. జర్నలిస్టు కులపతి నం॥రా॥రా ఆంధ్రపత్రిక వీక్లీలో పని చేసే రోజుల్లో రమణకు సీనియర్. రమణ తొలి జీవితాన్ని, తొలి రచనలను బాగా దగ్గర నుండి చూసిన వ్యక్తి. ఇద్దరూ ఆంధ్రపత్రిక వదిలేసి వెళ్లిపోయిన చాలా రోజులకి తన సోదరి శ్రీదేవిని రమణగారికిచ్చి వివాహం జరిపించారు. తానా (1995) సువెనీర్ కోసం ఇంగ్లీషులో వ్రాసిన వ్యాసాన్ని ఆయనే తెనిగింపు చేసి 'అక్షరయాత్ర'లో ప్రచురించారు. ఆ రచనలో కొన్ని భాగాలు:**

దాదాపు అర్థశతాబ్ది నాటి సంగతి. ముళ్ళపూడి వెంకటరమణ 'అనే ఒకానొక రచయిత' వున్నట్టుండి అశేష పాఠక హృదయాలలోకి ఝామ్మని దూసుకుపోయి తిష్ఠవేసుకుని కూర్చున్నాడు. హాస్యం ఆయన వచన శైలిచేత మనోహర లాస్యం చేయించింది; అది సెటైరును ఒక ఆయుధంగా ప్రయోగించింది. మధ్య తరగతి మనుషుల లేనిపోనీ భేషజాలను తన కథలలో ఆయన వేళాకోళం చేశాడు. మాటలతో గారడీ చేశాడు. కలాన్ని మంత్ర దండంలా ప్రయోగించాడు. పేదరికంతో చెట్టాపట్టాలు వేసుకుని అరకప్పు టీ కోసం, ఒక ప్లేటు సానుభూతికోసం వీధుల వెంట వెదుకుతూ తిరిగే నిరుద్యోగ యువకులతోను, తమ క్లాసు అమ్మాయిల మీద మధుబాలను, సావిత్రిని సూపర్ ఇంపోజ్ చేసుకుని, వేడి నిట్టూర్పులు విడుస్తూ, విరహవీణలు వాయించుకుంటూ తిరిగే అపర దిలీప్ కుమార్ల తోను, అభినవ నాగేశ్వరరావుల తోను కిటకిటలాడే ఒక కొత్త ప్రపంచాన్ని ఆ మంత్రదండంతో ఆమంత్రించాడు.

ఆయన మొదటి కథ "ఆకలీ ఆనందరావు". ఆంధ్రప్రభ వారపత్రికలో అచ్చు అయింది. బహుశా 1953లో. కథా సాహిత్య భవనం




బాల్కనీలో కాలరెత్తుకుని నిలబడిన ఆ కథ చదివిన పాఠకులు "ఎవరార్రైటరు, ఏమా స్టోరీ" అని చాలాసేపు ఆశ్చర్య పోయారు, వెనక్కి తిరిగొచ్చారు; ఆనందపడ్డారు, లేచి కూర్చున్నారు.



ఒకానొక రాత్రి మద్రాసు నగర వీధులలో ఒకానొక నిరుద్యోగ యువకుడు కప్పెడు వేడి తేనీరు కోసం, వేడకపోయినా దొరికే నీరు కోసం లోపలా బయటా చేసే సాహసాల ఇతివృత్తం అది. వాక్యాలు కొత్తరకంగా వున్నాయి. ఇదివరకు ఎక్కడా ఎవరూ రాయని శైలిలో వున్నాయి. హాస్య తరంగాల వేషం ధరించినా, జీవిత గాంభీర్యాన్ని, విషాదాన్ని అంతర్వాహినిగా దాచుకున్న శైలి అది.

ఆనందరావుకీ కడుపులో కాముడికీ మధ్య నడిచే డైలాగులు చిరునవ్వుల పువ్వులు పూయిస్తూనే గుండెను పట్టేస్తాయి. ఆ ఇడియమ్ ఎక్కడిదబ్బా? ఆ అదీ. చార్లీ చాప్లిన్ చూడండి: ఎంత విషాద గంభీర సన్నివేశాన్నయినా బుజాలెగరవేసో, ఏడవడానికి సిద్ధంగా వున్న పెదవులపైకి రాని నవ్వును లాక్కు వస్తూనో దులిపేసుకుంటాడే! అదీ ఆ టెక్నిక్కు. కథా నాయకుడైన ఆనందరావు ఒకవైపు విషాద వీచికలతో పేచీ పడుతూనే, మరోవైపు మధురోహాల మృదుడోలలలో ఉయ్యాల లూగుతూ, తన కష్టాల కన్నీళ్లకు సుఖాంతాల ఇంద్రధనుస్సుల్ని తగిలించాలని ప్రయత్నిస్తాడు. కరుణ, హాస్యరసాల కలనేతతో కథ నడిపించడం అప్పటికింకా పూర్తిగా కాదు గాని, చాలవరకు కొత్త. తెల్లవారే సరికి ముళ్లపూడి వెంకటరమణ పేరు పొందిన రచయితగా మేలుకున్నాడు.

ఆనందరావు ఎవరంటే ముళ్లపూడే. బాల్యం అఖరై యౌవనపు గుమ్మంలో అడుగుపెట్టే రోజుల్లో ముళ్లపూడికి ఆకలి కొత్తకాదు. ఆకలీ, ఆయనా కలిసి ఒకే హైస్కూల్లో చదువుకున్నారు. ఒక మధ్య తరగతి కుటుంబంలో జన్మించాడాయన. గోర్కీలాగా ఆరంభ యౌవనంలోనే తన జీవిత పథం తాను వెదుక్కోవలసి వచ్చింది. పేదరికంతో చుట్టరికం ఏర్పడింది. ఎంతటి కష్టాన్నయినా తేలికగా నవ్వేసారేసే తత్వం, ఎప్పటికయినా రచయితగా పేరు తెచ్చుకోవాలనే తపన ఆయన్ని నిస్పృహకు లోను కాకుండా కాపాడాయి. ఉన్నత విద్య అభ్యసించలేదు. కాని, తిరిగి గోర్కీలాగా తన చుట్టూ జీవితమే ఆయనకు యూనివర్సిటీ అయింది. ఇక పుస్తకాల సంగతి చెప్పనక్కరలేదు. తెలుగులోను, ఇంగ్లీషులోను చెప్పుకోదగిన రచయిత లెందరి గ్రంథాలో చదివి ఆకళించు కున్నారు. హైస్కూలు రోజుల్లోనే రచనా వ్యాసంగం ప్రారంభించారు. బాపుతో స్నేహం కలిసింది. యాభై ఏళ్లనాడు ప్రారంభమైన వారి స్నేహయాత్ర అవిచ్ఛిన్నంగా అలాగే కొనసాగుతున్నది.

ఒక లక్ష్యం, గమ్యం లేకుండా తిరిగారు. రకరకాల ఉద్యోగాలు చేశారు. మద్రాసులో అప్పుడే క్రొవ్విడి లింగరాజు ఎడిటరుగా ప్రారంభ మైన ప్రకాశం గారి "ప్రజాపత్రిక"లో చేరారు. అప్పుడే జర్నలిస్టుగాను, కథా రచయితగాను పేరు తెచ్చుకోవడం ప్రారంభించారు. కొద్దికాలం తర్వాత (1954లో) ఆంధ్రపత్రికలో చేరారు.

మొదట కొన్ని కథలు ఆంధ్రప్రభ వారపత్రికలో పడిన తర్వాత, ఆంధ్రపత్రిక వారపత్రికలో వరసగా కథ తర్వాత కథ, సీరియల్ తర్వాత సీరియల్ ప్రచురించడం ప్రారంభించారు.

ఆయన ఆ రోజులలో రాసిన కథలు యువతరం పాఠకులను ఉర్రూత లూగించాయి. కల్పనా చాతుర్యం, భావనా వైచిత్రి, పందెపు గుర్రంలా పరిగెత్తే వచనం, మానవ స్వభావ పరిశీలన, ముఖ్యంగా చాప్లిన్‌లాగా దగాపడిన తమ్ముళ్ల పాత్రల చిత్రణ ఆయనకొక ప్రత్యేకత సంతరించి పెట్టాయి.

నాలాంటి కొందరు అతడిని మార్క్‌ట్వేన్ ప్లస్ వుడ్‌హౌస్ ఇజీక్వల్టు ముళ్లపూడి అనిన్నీ, హాస్యమూ ఇంటూ సెటైర్ డివైడెడ్ బై వర్డ్ పన్నింగ్ ఇజీక్వల్టు ముళ్లపూడి కథలు అనిన్నీ అనుకునేవారు, అనేవారు. ఇద్దరమ్మాయిలూ - ముగ్గురబ్బాయిలూ, ఏకలవ్యుడు, సెరిబ్రల్ సినేమియా, రాధాగోపాలం కథలు, ఋణానందలహరి, విక్రమార్కుడి మార్కు సింహాసనం, ఇంకా బోలెడు కథలూ 1950లలో ఆంధ్రవార పత్రికలో వెలువడి ముళ్లపూడిని అశేష పాఠకుల అభిమాన రచయితగా చేశాయి. రమణ రమణీయం రచనల్నిటిని బాపు అంతకంటే రమణీయమైన చిత్రాలతో అలంకరించేవాడు. జంటగా చేసిన ఈ కృషితో వీరిద్దరూ పాఠకులకు మరింతగా అభిమాన పాత్రులయ్యారు. నిజానికి ఆ రోజుల్లో (1950లలో) బాపు, రమణ అంటే పాఠకులకు ఇంచుమించుగా చలన చిత్ర తారలంతా గ్లామర్ వుండేది.

ముళ్ళపూడి ఆ రోజుల్లో ఆంధ్రవార పత్రికలో సినిమా శీర్షిక ఎడిటరుగా వారం వారం చిత్రసమీక్షలు వ్రాసేవారు. ఎంత అగ్రశ్రేణి నిర్మాత, దర్శకుడు, నటి, నటుడు అయినా ముళ్లపూడి నిశిత విమర్శక దృష్టినుంచి తప్పించుకునే వారు కారు. అయితే ఆయన విమర్శ ధోరణి వేరు. అది గుచ్చుకునే విమర్శ కాదు. సరదాగా వేళాకోళం చేస్తూ సమీక్షించడం ఆయన పద్ధతి. ఆయన ఎవరిని వేళాకోళం చేసినా, వారే నవ్వుకునే వారు. నిర్మాతలను, డైరెక్టర్లను సన్నిహితంగా స్టడీ చేసిన వాడైనందునే, వారి లోపాలను సెటైర్ చేస్తూ గిరీశం లెక్చర్లు లాంటి ఉత్తమ రచనలు చేయగలిగారు.

ఇలాగే సెటైర్ అనే ఆయుధాన్ని అవినీతిపరులు, వంచకులు అయిన రాజకీయ వాదులపై విజయవంతంగా ప్రయోగిస్తూ ముళ్లపూడి చేసిన మరొక రచన రాజకీయ బేతాళ పంచవింశతి. కాని, ముళ్లపూడి రచనలన్నిటికి తలమానికమైనది బుడుగు. చిచ్చరపిడుగులాంటి బుడుగును ప్రధాన పాత్రగా చేసి రాసిన కథలు ఆ రోజులలో పిల్లలను, పెద్దలను ఎంతగా ఉర్రూత లూగించాయో, ఎంతగా అలరించాయో చెప్పనలవి కాదు.

బుడుగు కాక, పాఠకుల మనస్సులలో కలకాలం నిలిచిపోయే పాత్రలను ఇంకా ఎన్నిటినో ముళ్లపూడి సృష్టించారు. రాధ, గోపాలం (అప్పుల) అప్పారావు, వరలహారాజు (సినేమియా వ్యాధి పీడితుడు), రెండు జెళ్ల సీత, బుడుగు బాబాయ్, లావుపాటి పక్కింటి పిన్నిగారు, సీగాన పెసూనాంబ - ఇలా ఎందరో తెలుగు పాఠకుల నిత్య వ్యవహారంలో అభిమాన పాత్రలుగా నిలిచిపోయారు.

ఇలాంటి రచనలతో మనగొప్ప కథా రచయితల శ్రేణిలో సముచిత స్థానం సంపాదించుకున్న ముళ్లపూడి చలని చిత్ర రచనలోను, చిత్ర పరిశ్రమలోను కూడా ఎంతో కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించుకున్నారు. జర్నలిస్టుగా జీవితం ప్రారంభించిన ముళ్లపూడి జర్నలిస్టుగానే కొనసాగివుంటే, బహుశా ఏ అత్యధిక ప్రచారం గల వారపత్రికకో సంపాదకుడుగా పేరు తెచ్చుకుని ఊరుకునేవారు. కాని 1960లో ఆయన జీవిత పథం ఒక మలుపు తిరిగింది. జర్నలిజం కంటె ఆకర్షణీయమైన సినిమా రంగంలో ఆయన ప్రవేశించారు. మొదటగా డి.బి.నారాయణగారు తమ "దాగుడుమూతలు" సినిమాకు సంభాషణల రచయితగా ముళ్లపూడిని బుక్ చేశారు. కాని ఆ తర్వాత ఆయన్ని బుక్ చేసిన డూండి "రక్తసంబంధం" చిత్రం ముందుగా విడుదల అయింది. ఈ రెండు చిత్రాల తర్వాత ముళ్ళపూడి ఇక వెనుదిరిగి చూడలేదు. ఒక దశలో కథ, సంభాషణల రచయితగా ముళ్ళపూడి పట్ల నిర్మాతల మోజు ఇంతింతని చెప్పవీలులేనంతగా వుండేది. అయితే ఆయన ఎప్పుడూ రెండు మూడు చిత్రాల కంటె ఎక్కువ ఒప్పుకునే వారు కాదు. వాటికి కూడా తీరుబడిగా పని చేసేవారు తప్ప హడావిడిగా గిలికెయ్యడం ఆయనకు చేతనయ్యేది కాదు. జాగ్రత్తగా ఆచితూచి ఆలోచించి స్క్రిప్టును చిత్రిక పట్టడం ఆయన పద్ధతి. అందుకే సంభాషణల రచయితగా అర డజనుకు పైగా అవార్డులు సంపాదించు కున్నారు ఇన్నేళ్లలోను.

రచయితగా చిత్రరంగంలో ప్రవేశించిన కొద్ది సంవత్సరాలకే ముళ్లపూడి చిత్ర నిర్మాణ రంగంలో కూడా అడుగు పెట్టారు. ఆ రంగంలోకి ఆయనతోపాటు చిన్ననాటి స్నేహితుడు బాపు కూడా వచ్చి కలిశారు. వారి మొదటి చిత్రం "సాక్షి". ఆ చిత్రంతో ప్రారంభించి చలన చిత్ర దర్శకుడుగా బాపు ప్రతిభా పారమ్యాన్ని ప్రదర్శించారు.

చిరకాలం జ్ఞాపకం పెట్టుకోదగిన మంచి చిత్రాలనేకం బాపు, రమణ నిర్మించారు. అన్నీ బాక్సాఫీసు రికార్డులు బద్దలు కొట్టాయని కాదు. ఆర్థికంగా విజయం పొందినవి, పొందనివి కూడా వారి చిత్రాల జాబితాలో వున్నాయి. కాని, ఎక్కువ భాగం చిత్రాలు వారికి మంచి పేరు తెచ్చిపెట్టాయి. వాటిలో "బుద్ధిమంతుడు" ఒకటి. ఆర్థిక విజయం సంగతి ఎలా వున్నా వారి చిత్రాలలో పెక్కింటికి ప్రభుత్వ బహుమతో, అభిమానుల ఆదరణో విధిగా లభించింది. వారి "సీతాకళ్యాణం" చిత్రాన్ని సెల్యులాయిడ్ కవిత్వంగా పలువురు పరిగణించారు.

కాగా, దర్శకుడుగా బాపు, రచయితగా



రమణ అగ్రగతమశ్రేణిని అందుకున్న చిత్రం "ముత్యాలముగ్గు".

ఇటీవలి చిత్రాలలో బాపు, రమణ ఒక కొత్త మార్గం పట్టినట్టు కనిపిస్తుంది. 'పెళ్లిపుస్తకం', "మిస్టర్ పెళ్లాం" వారి పూర్వ చిత్రాల కంటె భిన్నమైనవి. అవి ప్రేక్షకుల హృదయాలలో నవ్వుల పంట పండించిన చక్కని కామెడీలు. దర్శకత్వం లోను, రచనలోను ఒక సారళ్యం, సినీ మీడియమ్‌పై ఒక మాస్టరీ, పరవళ్ళు తొక్కే హాస్యం ఆ చిత్రాలలోని విశిష్ట లక్షణాలు. ఆ రెండింటికి రాష్ట్రంలోను, కేంద్రంలోను అవార్డులు లభించాయి.

బాపు, రమణల మైత్రి చిత్రమైనది. యాభై ఏళ్లుగా అదొక అవిచ్ఛిన్న ప్రవంతి. ఒకరు మాటలతో ఇంద్రజాలం చేస్తారు. రెండవవారు బొమ్మలతో ఒక మంత్రనగరం సృష్టిస్తారు. ఒకరు తన జీవితానుభవాల నుంచి మానవతావాదాన్ని కాచి వడబోసి అందిస్తారు. రెండవ వారు కొద్దిపాటి సుతారపు గీతలతో అతిలోక సౌందర్యం పండిస్తారు. ప్రవృత్తులలో వారు భిన్నధ్రువాలు, ఒకరిది జలపాతంలా హోరెత్తే ఉద్విగ్న ప్రకృతి. రెండవవారిది మైదానంలో ప్రశాంతంగా, గంభీరంగా ప్రవహించే నదిలాంటి స్వభావం. ఒకరిది తనకు నచ్చని వాటితో రాజీపడలేని మనస్తత్వం. రెండవ వారిది మానవుల ఔన్నత్యాలను, బలహీనతలను ఒకే విధంగా సాక్షి మాత్రంగా పరికించే సమ్యక్ దృష్టి. ఈ భిన్నత్వమే వారి చిరమైత్రిలోని ఏకత్వానికి ప్రాతిపదిక అయింది.

## పక్కలో బల్లెం

**సంగీతం: యస్.పి.కోదండపాణి** **గానం: సుశీల, సరోజిని అండ్ పార్టీ**

ఆ1: కదలే నీడలలో కనబడువారెవరో
కన్నూ కన్నూ కలిపీ కవ్వించినాడే
చెలీ అలుగబోయి నవ్వినాను యేలనే
ఆ2: తెలుసులే లేలేలే తెలిసిన కథలే
వలపులే లేలేలే వలపుల కథలే
కో: వలచినా వాడెకా - వలసినా వాడేలే
ఆ1: కలలోనా కలగంటీ రేయి
ఎవరో చెంతచేరి చెంప నిమిరినాడే
కనులు కావన్నాడే - కలువ పూలన్నాడే
అనుచు... కనుల మోమి యానినాడే
ఆ2: తెలిసెలే లేలేలే తెలిసెను కథలే
వలపులే లేలేలే వలపుల కథలే
కో: కలసినా వానిపై కలగెనూ వలపులే
ఆ1: లేడితోడ ఆడుచుండ నేనూ
ఎవరో నన్ను చూసి గేలిచేసినాడే
నడుము లేదన్నాడే - ఏదీ చూపన్నాడే
అనుచు... చూచీ... మనసు దోచినాడే
ఆ2: దొంగలే లేలేలే దొంగల దొరలే
దొరికెలే లేలేలే దొంగ దొరికెలే
కో: వలపులా దొంగలే - వానినీ ఖైదుచెయ్
ఆ1: జలకమాడి - తిలకమిడుగ నేనూ
ఎవరో అద్దములో ముద్దులాడినాడే
తానే నేనన్నాడే... తప్పు లేదన్నాడే
అనుచు... మరల... మరల... మరల...
హోయ్... హోయ్... హోయ్...
ఆ2: తెలిసెలే లేలేలే... తెలిసెను కథలే
వలపులే లేలేలే... వలచిన కథలే
కో: లా లా లా లా.... లా లా లా లా...
లా లా లా లా... లా లా లా లా...

**గానం: పి.బి. శ్రీనివాస్**

తెలుసో! యేమో! అందానికి అలకే అందం
అవునో! యేమో! అందులకే అలిగిందేమో
అందం నీదే కానీ
ఆనందం నాదే రాణీ
చెంతకు రావే చెలియా
నా కనులను చూడవె నీ ప్రతిబింబం ॥తెలుసో॥
కమ్మని మోమే పసుపూ
కాటుక కనులూ నలుపూ
బుగ్గల సిగ్గులు ఎరుపూ
ఇది వలపని నీ చిరునవ్వే తెలుపు ॥తెలుసో॥
చినదానా వలచిన దానా
అందంగా అలిగిన దానా
చాలించవె నీ కోపం తాపం
లాలించవె ఈ దీనుని పాపం

## ప్రేమించి చూడు

**సంగీతం: మాస్టర్ వేణు** **గానం: పి.బి.శ్రీనివాస్, అండ్‌పార్టీ**

అ: మేడమీద మేడగట్టి - కోట్లు కూడబెట్టినట్టి కామందూ
హలో హలో కమాన్ కమౌట్ రా ముందూ
అందుకుంటె జుట్టుపట్టి-
అందకుంటె కాళ్ళుపట్టు కామందూ
హలో హలో కమాన్ కమౌట్ - రాముందూ దిగి రాముందూ
కో: బుచ్చబ్బాయ్ పని కావాలోయ్
బుచ్చబ్బాయ్ పని కావాలోయ్ (2)
అ: ఆడపిల్ల మాటమీద ఉద్యోగాలూడగొట్టు -
అకతాయి కామందూ
మీసకట్టు తీసివేసి కాసెబోసి కోకచుట్టి-
గాజులేసుకొమ్మందూ
డొక్క చీరివేస్తాము - డోలు కట్టి తెస్తాము
డోలు కొట్టి గోలపెట్టి రచ్చకెక్కుతాం ॥బుచ్చబ్బాయ్॥
అ: రాత్రికి నేనొక రాక్షసినై నీ కలలో పీడిస్తా
రేపటి వేళకు నీ పని నీదని దారికి రాకుంటే
మాపటి వేళకు నీ పని నే పడతానోయ్, బుచ్చబ్బాయ్
మిన్ను విరిగి మీదపడ్డ
మన్ను మిన్ను ఏకమైన
నన్ను గెల్చువరకు మేము
ఆడి తీరుతాం - పోరాడి తీరుతాం ॥బుచ్చబ్బాయ్॥

# తెలుగు పాటలు - తమిళ మాతృకలు

| వ.నెం. | చిత్రం పేరు | - పాట (తమిళం) | - తెలుగుచిత్రం | పాట |
|---|---|---|---|---|
| 1. | మోటార్ సుందరం పిళ్లై | -తుళ్లితుళ్లివిలయాడ | - మంచికుటుంబం | "తుళ్లితుళ్లిపడుతోంది" |
| 2. | మోటార్ సుందరం పిళ్లై | - మనమే మురుగనిన్ | - మంచికుటుంబం | "మనసే అందాల బృందావనం" |
| 3. | శారద | -ఒరుత్తి ఒరువనై | - సుమంగళి | "కనులు కనులతో కలబడితే" |
| 4. | శారద | -కన్నానాలల్ | - సుమంగళి | "కన్నులు నీవే కావాలి" |
| 5. | శారద | -మనమగళే మనమగళే | - సుమంగళి | "కొత్త పెళ్లికూతురా రారా" |
| 6. | శారద | -కూందలుక్కుం | - సుమంగళి | "శిగలోకి విరులిచ్చి" |
| 7. | పోలీస్‌కారన్‌మగళ్ | -నిలవుక్కు | - కానిస్టేబుల్ కూతురు | "వెన్నెలకేలా నాపై కోపం" |
| 8. | పోలీస్‌కారన్‌మగళ్ | -ఇందమంద్రత్తిల్ | - కానిస్టేబుల్‌కూతురు | "చిగురాకుల ఊయలలో" |
| 9. | పోలీస్‌కారన్‌మగళ్ | -కన్నిలే నీరెదర్‌కే | - కానిస్టేబుల్‌కూతురు | "కళ్ళలో నీరెందులకు" |
| 10. | పాశం | -ఉలగం పిరందదు | - మంచిచెడు | "పుడమి పుట్టెను నాకోసం" |
| 11. | పాశం | -ఉరవుసొల్ల | - మంచిచెడు | "తోడునీడ ఎవరులేని ఒంటరి" |
| 12. | పాశం | -పాల్‌వన్నం పరువం | - మంచిచెడు | "రేపంటి రూపం కంటి" |
| 13. | కర్పగం | -అత్తమడి మెత్తమడి | - తోడునీడ | "అత్తఒడి పువ్వువలే" |
| 14. | రాము | -పచ్చైమరం ఒంద్రు | - రాము | "పచ్చని చెట్టు ఒకటి" |
| 15. | రాము | -నిలవే ఎన్నిడం | - రాము | "మంటలు రేపే నెలరాజా" |
| 16. | రాము | -ముత్తుచిప్పి | - రాము | "మామిడికొమ్మ నెలరాజా" |
| 17. | రాము | -కన్నన్‌వందాన్ | - రాము | "రారాక్రిష్ణయా" |
| 18. | నెంజం యిరుక్కుంవరై | - ముత్తుకళ్లో ఎన్నై | - బందిపోటుదొంగలు | "విన్నానులేప్రియా" |
| 19. | పావమన్నిప్పు | -అత్తాన్‌ఎన్నత్తాన్ | - ఒకే కుటుంబం | "ఔనే తానే నన్నేనే" |
| 20. | పావమన్నిప్పు | -వందనాళ్‌ముదల్ | - ఒకేకుటుంబం | "మంచిని మరచీ" |
| 21. | మంత్రికుమారి | -వారాయ్‌నీవారాయ్ | - వీరకంకణం | "రావే రావే" |
| 22. | కళత్తూర్‌కణ్ణమ్మ | -అమ్మయుం నీవే | - మూగనోము | "తల్లిని నీవే" |
| 23. | కళ్యాణపరిసు | -వాడిక్కైమరందిదివేనో | - పెళ్లికానుక | "వాడుక మరచెద వేలా" |
| 24. | కళ్యాణపరిసు | -ఉన్నైకండునాన్‌ఆడ | - పెళ్లికానుక | "ఆడేపాడే పసివాడ" |
| 25. | కళ్యాణపరిసు | -తుళ్లాదమనముమ్‌తుళ్లుం | - పెళ్లికానుక | "పులకించని మది పులకించు" |
| 26. | నెంజిల్ ఒరు ఆలయం | -ముత్తానా ముత్తల్లవో | - మనసేమందిరం | "అల్లారుముద్దుకదే" |
| 27. | నెంజిల్ ఒరు ఆలయం | -నినపదెల్లాం నడుందు | - మనసేమందిరం | "తలచినదే జరిగినదా" |
| 28. | ఇరుళం ఒళియుం | -తిరుమగళ్ | - ఇద్దరు అమ్మాయిలు | "నా హృదయపు కోవెలలో" |
| 29. | పడిక్కాదమేదై | -సీవిముడిచ్చి | - ఆత్మబంధువు | "చీరకట్టి సింగారించి" |
| 30. | పడిక్కాదమేదై | -ఒరేవూరు వూరిలే | - ఆత్మబంధువు | "అనగనగా ఒక రాజు" |
| 31. | పడిక్కాదమేదై | -ఎంగిరిందో వందాన్ | - ఆత్మబంధువు | "ఎవరో ఏవూరో" |
| 32. | పడిక్కాదమేదై | -పక్కత్తిలే ఎన్‌పెన్ | - ఆత్మబంధువు | "దక్కెనులే నాకు నీ సొగసు" |
| 33. | పడిక్కాదమేదై | - పడిదతనాళ్ | - ఆత్మబంధువు | "చదువురానివాడివనీ" |
| 34. | ఆడబ్రతుకు | -ఉనైత్తాన్‌నాన్ | - ఆడబ్రతుకు | "పిలిచేనామదిలో" |
| 35. | ఆడబ్రతుకు | -చిన్నచిన్నకణ్ణినిక్కు | - ఆడబ్రతుకు | "బుజ్జిబుజ్జిపాపాయి" |
| 36. | పాశమలర్ | -వారాయిఎన్‌తోళి | - రక్తసంబంధం | "బంగారుబొమ్మరావేమే" |
| 37. | పాశమలర్ | -మలరవిద మలరాద | - రక్తసంబంధం | "చందురినిమించు" |
| 38. | పాశమలర్ | -ఎంగళుక్కుం | - రక్తసంబంధం | "మంచిరోజువస్తుంది" |
| 39. | తైపిరందాళ్ వళి పిరక్కుం | -సొల్లాట్టుమ సొల్లాట్టుమా | - మంచిమనసుకు మంచిరోజులు | "వినవమ్మా వినవమ్మా" |
| 40. | తైపిరందాళ్ వళి పిరక్కుం | -నెరక్కదె వొన్ను | - మంచిమనసుకు మంచిరోజులు | "అనుకున్నదొక్కటి" |
| 41. | తైపిరందాళ్ వళి పిరక్కుం | - మన్నుకుమరబారమా | - మంచిమనసుకు మంచిరోజులు | "ధరణికి గిరి భారమా" |
| 42. | తైపిరందాళ్ వళి పిరక్కుం | -ఎళివరెతాళవి | - మంచిమనసుకు మంచిరోజులు | "కలవారి స్వార్థం నిరుపేద" |
| 43. | తైపిరందాళ్ వళి పిరక్కుం | -ఆశయేఅలబోలే | - శభాష్‌రాముడు | "ఆశలే అలలాగా" |

-సేకరణ: ఎస్.శ్రీనివాసరావు, ఎమ్మిగనూర్

(వచ్చే సంచికలో మరి కొన్ని)




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు
నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



# ఎన్నిటికో ఆది ఎందరికో పునాది
# రామకృష్ణ శాస్త్రి మల్లాది

మోకాళ్ల మీదికి కట్టిన ముతక పంచె, సాధారణమైన చెప్పులు, మోచేతుల పైకి లాగిన చేతుల జుబ్బా, భుజం మీద నుంచి వేల్లాడే కండువా, నోట్లో కొడిగడుతున్న సిగరెట్టుతో ఒకాయన, మద్రాసు పాండీ బజారు పేవ్‌మెంటు మీద విస్తరింపబడ్డ పాత పుస్తకాల్ని గొంతుకూచుని తిరగేస్తున్నారు. నాలుగైదు తెలుగు పుస్తకాల్ని ఏరుకుని ఇంగ్లీషు పుస్తకాల వేపు కూచునే నడిచి, తీస్తూ వుంటే - "ఇష్ - అవన్నీ ఇంగ్లీషు. అటు వెళ్లకు" అని కోప్పడ్డాడు తమిళంలో - పుస్తకాలు అమ్మేవాడు. అప్పుడే గ్రామం నుంచి పట్టణం దిగొచ్చినట్టున్న ఆ ఆసామి పలు భాషా ప్రవీణుడనీ, ఇంగ్లీషులో మూడు ఎమ్మేలు కలవాడనీ, కవులకీ పండితులకీ నిఘంటువు వంటివాడనీ, ఆయన పేరు మల్లాది రామకృష్ణశాస్త్రిగారనీ - ఆ పాత పుస్తకాల విక్రేతకి తెలీదు! ఏ భేషజం లేదు! ఒరియా, అస్సామీ, బెంగాలి లాంటి దేశభాషలే కాకుండా ఫ్రెంచి, గ్రీకు, జపనీస్, జర్మన్, లాటిన్, చైనీస్ వంటి విదేశ భాషలు చదవడం, రాయడం అటుంచి - ఖగోళ, జ్యోతిష, అలంకార, తర్క, సంగీత, నృత్య, వేదాంత, వ్యాకరణ శాస్త్రాలు కూడా అధ్యయనం చేసిన ఆ అసలు సిసలు "శాస్త్రి"గారికి ఆడంబరం అంతకంటె లేదు! పాత పుస్తకాలు అమ్మేవాడికే కాదు - తెలియని వారెవరికైనా, ఆయన బాహ్యా(డ)oబరమే కనిపిస్తుంది గాని, అనంతాంబరం వంటి జ్ఞాననిధి కనిపించదు.

పనిలేకపోతే పగటిపూట పాండీ బజారు, సాయంకాలం వేళ పానగల్ పార్కు. ఆ పార్కులో



కవి దర్బారు. పెద్దపీట మీద కూచున్నట్టు కనిపించే ఆయనే - రామకృష్ణశాస్త్రి. చమత్కారాలు, చతురోక్తులతో 'కబుర్ల కొలువు' నడిపించేవారు. పింగళి నాగేంద్రరావు, ఆరుద్ర, కమలాకర కామేశ్వరరావు, దైతా గోపాలం, మద్దిపట్ల సూరి, పాలగుమ్మి పద్మరాజు, జలసూత్రం రుక్మిణీ నాథశాస్త్రి, డి.వి.నరసరాజు వంటి పెద్దలు నాలాంటి పలువురు పిన్నలూ సదస్యులు.

"సరిగ్గా మా యింటికి ఎదురుగానే జలరుహా వారు ఆఫీసు పెట్టారు. రోడ్డు మీద నాలుగడుగులు దాటితే వాళ్ల ఆఫీసు. డైరెక్టరు గారు (వేదాంతం రాఘవయ్య. 'రాజనందిని' తీస్తున్నారు) వచ్చారనీ నన్ను రమ్మన్నారు. కారు పంపించమన్నాను. కబురు తెచ్చిన వాడు కంగారు పడ్డాడు. చెయ్యి చాస్తే అందే ఆఫీసుకు కారేమిటని. తెచ్చి గుమ్మం ముందు పెట్టమన్నాను. పెట్టారు. ఈ తలుపు తీసి, లోపలికి ఎక్కి ఆ తలుపుతీసి దిగి ఆఫీసుకెళ్లాను. అవును మరి! కవిగారు సినిమాఫీసులకి నడుచుకుంటూ వెళ్లిపోతున్నాడనీ, సినీ రైటర్ల పరువుని రోడ్ల పాలు చేస్తున్నాడనీ మీరంతా అనరూ!" అని తాను చేసిన ప్రాక్టికల్ జోక్ పేల్చి సదస్యుల్ని గొల్లుమనిపించారు శాస్త్రిగారు.

శాస్త్రిగారి రాత తెల్ల కాయితం మీద నల్ల ముత్యాలు పేర్చినట్టుంటుంది. ఒక్క తప్పుండదు, దిద్దుబాటూ వుండదు. నేను "జ్యోతి" పత్రికలో వున్నప్పుడు, ఆయన దగ్గర కథ కలెక్ట్ చేసుకోవడానికి వెళ్తే కథ ఇచ్చారు. ఎంతో శుభ్రంగా వుంది. "నేనే ఫెయిర్ కాపీ చేసే వాడిని కదా, అలా ఇచ్చేయక పోయారా?" అన్నాను. "అది తొలిసారి రాసిందే, ఫెయిర్ చేసింది కాదు" అన్నారు. గుండె ఫెడీమంది. ఆ ముత్యాల్ని చూస్తూ వుండి పోయాను. "అర్థం కానట్టు రాస్తే కంపోజిటర్లు, ప్రూఫ్‌రీడర్లూ తిట్టుకుంటారు. పాఠకుల కంటె ముందు వీళ్ల దీవెనలు అందుతాయి. ఆ బాధలేకుండా నీటుగా రాస్తే పోలా;" అన్నారు శాస్త్రిగారు వేళ్ల మధ్య వున్న సిగరెట్టు నుంచి పొగలాగుతూ.

నెమ్మదయిన స్వభావం, నెమ్మదయిన మాటా... అందర్నీ "బాబూ" అనడం అలవాటు. "పార్థివన్ కణవు" అని ఒక తమిళచిత్రం. యస్.వి.రంగారావు ముఖ్యపాత్రధారి. ఆ సినిమా తెలుగులోకి డబ్ చేశారు. శాస్త్రిగారు రచయిత. మద్దిపట్ల సూరిగారు, నేనూ అసిస్టెంట్లం. డబ్బింగ్ దగ్గరికి ఆయన వచ్చేవారు కాదు. డబ్బింగ్ జరుగుతున్నప్పుడు, రంగారావు గారితో పేచీ వచ్చింది. తమిళంలో వున్న ఒక మాటని, "తెలుగులో కూడా అలాగే వుంచేయక, మార్చారెందుకూ?" అన్నారు తన పాత్రకి తానే డబ్బింగ్ చెబుతున్న రంగారావుగారు. అలాంటి



మాట తెలుగులో లేదనీ, అది తమిళంలోనే ఉపయోగిస్తారనీ చెప్పాం. ఆయన వినలేదు. లాభం లేదని, శాస్త్రిగారికి కారు పంపిస్తే వెంటనే వచ్చారు. విషయం విన్నారు. "అలవాటులో మనం తమిళ మాటల్ని ఉపయోగిస్తున్నాం గాని, అది తెలుగుకాదు. ఆ మాటకి తెలుగు మాట కుదిరింది గనక వేశాం. లేకపోతే అదే వుంచేసే వాళ్లమేమో. మీ యిష్టం - మీరు తమిళ మాటనే పలుకు తానంటే పలకండి. అభ్యంతరం లేదు. కాని ఏ తమిళ మాటని విన్నా, తెలుగుకి దగ్గర్లోనే వుంటుందని అన్నీ అలాగే వదిలేసే కంటే, తమిళ సినిమానే యథాతథంగా విడుదల చేసేయొచ్చు గదా. ఎందుకూ - మీకు తెలుగుమాట ఇబ్బంది పెడుతున్నట్టుందే. వొద్దుబాబూ - ఒరిజినలే పలకండి " అని కండువా సర్దుకుంటూ లేచారు. "అహ హ... ఆదికాదు మాస్టారూ..." అంటూ రంగారావుగారు దారికొచ్చారు.

"జయభేరి" సినిమా విడుదలవుతున్న రోజునో, ఆ కిందటి రోజునో పత్రికల్లో ప్రకటనలు వచ్చాయి. అందులో టెక్నీషియన్లందరీ పేర్ల వెనకా డిగ్రీలు కనిపించాయి. "మల్లాది రామకృష్ణశాస్త్రి ఎమ్.ఎ." (పాటలు) అని కూడా వుంటే శాస్త్రిగారు రౌద్రులయ్యారు. "ఎవడికి పుట్టిన బుద్ధిరా ఇదీ?" అని 'జయభేరి' వాళ్ల ఆఫీసుకి ఫోన్ చేసి అడిగితే, లే ఔట్లన్నీ పేకేటి శివరామ్ చేయించారనీ, ఆయన బుద్ధే కావచ్చుననీ చెబుతే, శాస్త్రిగారు పేకేటిని నిలవేశారు. "పేరు వెనక ఎమ్మే ఎప్పుడైనా వేసుకున్నానా - నేనే మర్చిపోయాను గదా" అన్నారు. పేకేటి ఏదో సమాధానం చెప్పి తప్పించుకోవాలని చూశారు. "నాకు మూడు ఎమ్మేలు కాదు, తలమీద నాలుగు వెంట్రుకలు కూడా వున్నాయి. ఈసారి నాపేరు వేస్తే ఫోర్ హెయిర్స్ అని కూడా వెయ్యి" అని చల్లగా చీవాట్లు పెట్టారు మల్లాదివారు.

శాస్త్రిగారు అందరికీ పాటలు రాసే వారు కాదు. ఎంచేతంటే, ఆయన రాసినది రాసినట్టుంచాలి. అదీ ఇదీ మార్చమంటే ఒప్పుకోరని, చాలామంది అడిగే వారు కాదు. ఓసారి ఓ కంపెనీకి పాట రాయడానికి కూచుని, పల్లవి రాసిచ్చారు. "ఇంకొంచెం తేలిగ్గా రాస్తే బావుంటుంది" అన్నాడు దర్శకుడు. "మీకే అర్థం కాకపోతే, సామాన్య ప్రేక్షకుడికేం అర్థమవుతుంది? వద్దులెండి" అని పల్లవి రాసిన కాయితం వెనక్కి తీసుకున్నారు శాస్త్రిగారు. సామాన్య ప్రేక్షకుడి కంటె తక్కువ స్థాయిలో వున్నావన్న వ్యంగ్యభావం - ఆ దర్శకుడికి అసలు అర్థం కాలేదు.

సముద్రాల రాఘవాచార్య పేరుతో వచ్చిన చాలా పాటల్లో కొన్నిపాటలు రామకృష్ణశాస్త్రిగారు రాసినవేనన్న అజ్ఞాత సత్యం అందరికీ తెలిసినదే కానీ, శాస్త్రిగారు మాత్రం ఎన్నడూ బయట పెట్టుకోలేదు. "నా పేరుతో రాని ఏ పాటనైనా సరే, నాదని చెప్పుకోను" అన్న విశాల హృదయం ఆయనది. "నేను ఇతరత్రా బిజీగా వుండడం వల్ల శాస్త్రి చేత రాయించుకున్నాను. అతనికి డబ్బు అవసరం. నాకు టైము అవసరం" అని రాఘవాచార్యుల వారు చెప్పినట్టే - "నాకు డబ్బిచ్చాడు, రాయమన్నాడు రాశాను" అని శాస్త్రిగారూ చెప్పేవారు కాని, "ఫలానా పాట నేనే రాశాను" అని ఎన్నడూ చెప్పుకోలేదు. శైలి, ధోరణిని బట్టి రసజ్ఞులే గ్రహించే వారు. అలాంటి రసజ్ఞుడే, 'దేవదాసు'లోని 'కుడిఎడమైతే పొరబాటు లేదోయ్' పాటకి అర్థం ఏమిటని అడిగితే, 'తాగుబోతు వాడి పాటకి అర్థమేమిటి బాబూ" అని శాస్త్రిగారు కొట్టిపారేసినా, గ్రహించ గలిగే వాడికి కావలసినంత వేదాంతార్థం కనిపిస్తుందని ఆరుద్ర గారు సమర్థించారు.

రామకృష్ణశాస్త్రి గారి చమత్కారాలు, జోకులూ ప్రచారంలో వున్నవి చాలా వున్నాయి. అవి నేను ప్రసక్తి చెయ్యడం లేదు. అటు తేలిక పాట, ఇటు కఠినగీతం, యక్షగానాలు, భాగవతాల ధోరణి, జానపదశైలీ - అన్నీ ఆయనవే. 'చిలుకపాలు మాయి వజీరా' 'తటిల్లతికమే మెరుపో', 'చివురాకు బాకు వాని రాణి' 'చిలుక తత్తడి రౌతు' లాంటి ప్రయోగాలు ఎన్నో శాస్త్రిగారి సొంతం. "ఏదైనా ప్రజలకి అర్థమయేలా రాయాలి గాని, అర్థం కాకుండా రాస్తే ఏం ప్రయోజనం?" అని అడిగితే, "అర్థం చేసుకుంటారు. చేసుకోవాలి. అడిగి తెలుసుకోవాలి. ఆసక్తి వున్న వాళ్లకి భాషాభివృద్ధి ఎలా అవుతుంది మరి?" అని తిరిగి అడిగిన మల్లాది రామకృష్ణశాస్త్రి కవి కులానికి మేస్త్రి. 'బాపూ కార్ట్యూన్' చెప్పినట్టు వచన రచనకు మాత్రమే మేస్త్రీయా - నిర్వచన రచనకూ మేస్త్రీయే - సాహో! మల్లాది రామకృష్ణశాస్త్రి!!.

## ఇంటిగుట్టు

గానం: జిక్కి, ఘంటసాల సంగీతం:ఎమ్మెస్ ప్రకాష్

ఓహో వరాలా రాణీ
ఓహో వయారీ రాణీ
వెలిగే రేయీ వెన్నెల హాయీ మనదని తేలెనులే-
మనకథ మారెనులే॥
ఓహో వరాలా రాజా-ఓహో వయారీ రాజా
వలచిన వారూ పిలిచే తీరూ
వేరని తెలిసెనులే ప్రేమే గెలిచెనులే
మనసైన సోయగము నీది చనవైన గారవము నాది
అనురాగ మానందమేలే
ఓఓ కనులార చూసి మురిపించే దరిజేరి మేను మరపించే
నెరజాణ నీవౌదువోయీ నీ చిరునవ్వు నా వశమాయె
నీ చిరునవ్వు నావశమాయె ప్రియతమ ప్రియమిదెలే
ప్రేమకు ఫలమిదిలే ప్రేమకు ఫలమిదిలే ఓహో
కొనసాగు వేడుకలు నావీ - ఎనలేని కోరికలు నీవీ
మన ప్రేమ ఆనందమేలే
మృదువైన వేడుకలు నీవీ పదునైన వేదనలు నావీ
ఇది జీవితానందమేలే
వెన్నెల పూతా కోయిల పాటా నీవూ నేనేలే
ప్రేమకు వరమిదిలే ప్రేమకు వరమిదిలే ఓహో

## భక్తశబరి

సంగీతం: పెండ్యాల గానం: ఘంటసాల

ఓ వన్నె వన్నెల - చిన్నారీ - నీ
మోము చూడ వేడుకా
గోముచూడ వేడుకా
ఓ వన్నె వన్నెల - చిన్నారీ
మరీ మరీ నీ సొగసరి ॥మోము॥
విరజాజులె చిరునవ్వులు
మరుమల్లెలె వాల్ చూపులు
నీ కలకల లోకా లేలునె
అందరాని అందాలబాల ॥మోము॥
పైరుగాలి అలలతేలె
మొయిలు తీరు ముంగురులు
కనుల తళుకు కదలే కులుకు
నిలువ నీయవే వయ్యారి ॥మోము॥
అలిగినా కలిగినా
నీ అందము మారదే
వాడి వేడి చూపులె
పూబోణి మాకు వరాలే
కలకాలము మనకీ
పరవశమే మనకీ
పరవశమే శాశ్వతమే
నీవు మారినా నేను మారనే - ఏ మారనే ॥మోము॥

## చివరకు మిగిలేది

సంగీతం: అశ్వత్థామ గానం: పి. సుశీల

కవికోకిల తీయని పలుకులలో
చెలువారు నవరసాలూ
కవిరాజు హంస నడకలలో
కులికే వయారాలూ
కలవోయీ యీలేమ నగమోములో
కనుల విందు వెన్నెలలో కానరాని వాడి
విరిసీ విరియని పూలలో అలముకునే హాయీ
మెల మెల్లని గాలిలో వినిపించే ఆలాపన
మేను మరచు పరవశాన అనిపించే ఆవేదన ॥కలవోయీ॥
తన జీవితమే ఘన విజయంగా చేసికునే తెలివీ
తెలివిగా యీ లోకంలో మెలగగలననే లీవీ
లీవిగా తలచినది కొనసాగించే సాధన
మాట పడని మొగమాటం మరియాదగ చెలగాటం॥కలవోయీ॥

## రహస్యం

సంగీతం: ఘంటసాల గానం: ఘంటసాల,కోమలి, వైదేహి, పద్మ, సరోజిని

లలిత భావ నిలయా నవ
రసానంద హృదయా
వికచారవింద నయనా
సదయా జగదీశ్వరీ ॥లలిత॥
మధువు చిలుకు గమక మొలుకు
వరవీణా పాణి
సుమరదనా విధువదనా దేవీ
అంబరాంతరంగ శారదాభ్రరూపిణీ
చిదంబరేశ్వరీ శ్రీ శారదాంబికే
శ్రీదేవీ కైవల్య చింతామణీ
శ్రీరాగ మోహినీ చిద్రూపిణీ
బింబాధరా రవి బింబాంతరా
రాజీవి రాజీవిలోల
శ్రీ రాజరాజేశ్వరీ పరమాకామ సంజీవనీ
నిటలలోచన నయనతారా తారా భువనేశ్వరీ
ప్రణవధామా ప్రణయధామా
సుందరీ కామేశ్వరీ
అరుణవసనా అమలహాసనా
మాలినీ వనోన్మణీ
నాదబిందు కళాదరీ భ్రామరీ పరమేశ్వరీ

## జయభేరి

సంగీతం: పెండ్యాల గానం:ఘంటసాల, పి.బి.శ్రీనివాస్, రఘునాథపాణిగ్రాహి

మది శారదాదేవి మందిరమే
కుదురైన నీమమున కొల్చేవారి
రాగభావమమరే గమకములా
నాద సాధనలె దేవికి పూజ
తరళ తానములె హారములౌ
వరదాయిని కని గురుతెరిగిన మన ॥మది॥

## అనురాగం

**సంగీతం: పెండ్యాల** **గానం: పి. భానుమతి**

సన్నజాజి తీవలోయ్
సంపంగి పూవులోయ్
చిలిపీ సింగారులోయ్
పాపలు సిరులొలికే చిన్నారులోయ్ ॥సన్నజాజి॥
కన్నుల విందులోయ్
వెన్నెల చిందులోయ్
పచ్చని బ్రతుకులో పన్నీటి జల్లులోయ్
బాలల సందడే పరువూ వేడుకా
ఇలు వాసికి మరో పేరు ఈ చిన్నారులే ॥సన్నజాజి॥
లోగిలి బలిమే బాలల నవ్వులూ
ఇల్లాలి కలిమే పిల్లల కిలకిలా
ఊరికి పండుగే ఇంటను ఊయలా
సిరిసంపద మరో పేరు ఈ చిన్నారులే ॥సన్నజాజి॥
దాగుడుమూత లాడితే సూరీడు మెచ్చేను
చెమ్మచెక్క లాడితే చందమామ మెచ్చేను
చెమ్మచెక్క చారెడేసి మొగ్గ
ఇల్లుదీసి పందిరేసి పకపకలాడితే
పిల్లలున్న లోగిలని దేవుడే మెచ్చేను ॥సన్నజాజి॥

## చిరంజీవులు

**సంగీతం: ఘంటసాల** **గానం: ఘంటసాల, పి. లీల**

కనుపాప కరవైన కనులెందుకో తనవారె పరులైన బ్రతుకెందుకో
విరజాజి శిలపైన రాలేందుకే మరుమల్లెకెందుధూళి కలిసేందుకే
మనసైన చినదాని-మనసిందుకే-రగిలేందుకే ॥కనుపాప॥
చిననాటి మురిపాలు కలలాయెనా
అలనాటి కలలన్ని కథలాయెనా
తలపోసి తలపోసి కుమిలేందుకా తనువిందుకా ॥కనుపాప॥
తనవారు తనవారె విడిపోరులె-కనుమూసి గగనాన కలిసేరులే
ఏనాటికైనా నే నీదాననే-నీదాననే
చిననాటి మన పాట మిగిలేనులే
కలకాల మీగాథ రగిలేనులే ॥కనుపాప॥

## చివరకు మిగిలేది

**సంగీతం: అశ్వత్థామ** **గానం: ఘంటసాల**

సుధవోల్ సుహాసినీ
మధువోల్ విలాసినీ
ఒహో కమనీ
సరసం సరాగమేలా
రావే వరాల బాలా
అంతులేని ప్రేమనాదిగా
ఆనందజ్యోతి నీవుగా
నీవేనె యీ వెన్నెలా
నేనేనె యీ తెమ్మెరా
సడిలేని నడిరేయిగా
జవరాల మనమోదమే

## వీరాంజనేయ

**(గరుడ దండకము)**

**సంగీతం: యస్.రాజేశ్వరరావు** **గానం: బాలసుబ్రహ్మణ్యం**

శ్రీ మన్మహా మేరు గాంభీర్యమే మూర్తి
మంతమ్ముగా క్షీర వారాన్నిధిన్
యోగ నిద్రన్ వినోదించు ఆదిత్య హాసమ్మె
భక్తాళి సంక్షేమ ధామమ్ముగా
ధారుణిన్ తేజరిల్లంగ; ప్రత్యక్ష
దైవంబునే గాంచి సేవించగా నోచ
గాలేని అజ్ఞానిపై, జాలిగా
భక్త హృద్మందిరంబందు ప్రత్యక్షమై
రక్ష చేసేవ దేవా! అమేయ ప్రభావా!

## జయభేరి

**సంగీతం: పెండ్యాల** **గానం:ఘంటసాల**

రాగమయీ రావే అనురాగమయీ రావే
నీలాల గగనాన నిండిన వెన్నెల నీ చిరునవ్వుల కలకల లాడగ॥రాగ॥
చివురులు మేసిన చిన్నారి కోయిల మరిమరి మురిసే మాధురి నీవే
చనువై మనసై నెలరాయనితో కలువలు కులికే సరసాలు నీవే
సరసాలు నీవే- సరాగాలు నేనే ॥రాగ॥
సంజెలలో హాయిగసాగే చల్లనిగాలిలో
మరుమల్లెల విరజాజుల పరిమళమే నీవు
జిలుగే సింగారమైన చుక్కకన్నెలు అంబరాన
సంబరపడు చక్కిలిగింతల పరవశమే నేను నవ పరిమళమే నీవు
రావే రాగమయీ - రా అనురాగమయీ
నీడజూసి నీవనుకొని పులకరింతునే
అలవికాని మమతలతో కలవరింతునే
నీ కోసమే ఆవేదనా - నీ రూపమే ఆలాపనా
కన్నెలందరు కలలుకనే అందాలన్నీ నీవే - ని
న్నందుకొనీ మైమరచే ఆనందమంతా నేనే ॥రావే॥

## రహస్యం

**సంగీతం: ఘంటసాల** **గానం: పి.లీల**

శ్రీలలితా శివజ్యోతి సర్వకామదా
శ్రీగిరి నిలయా గిరామయా సర్వమంగళా
జగముల చిరునగవుల పరిపాలించే జననీ
అనయము మము కనికరమున కాపాడే జననీ
మనసే నీ వశమై స్మరణే జీవనమై
మాయని వరమీయవె పరమేశ్వరి మంగళనాయకి ॥శ్రీలలితా॥
అందరికన్నా చక్కని తల్లికి సూర్యహారతి
అందాలేలే చల్లని తల్లికి చంద్రహారతి
రవ్వల తళుకుల కళలా జ్యోతుల కప్పుర హారతి
సకల నిగమ వినుత చరణ
శాశ్వత మంగళహారతి ॥శ్రీలలితా॥

## ఇంటిగుట్టు

**సంగీతం: ఎం.యస్. ప్రకాష్ గానం: పిఠాపురం**

హోయ్ మందూ కానీ మందూ - మన చేతిలోనే ఉందన్నా
తల తిరుగుడుకూ మెడతిరుగుడుకూ- దరువే మందోరన్నా
దీనికి ఢోకా లేదన్నా హేయ్ జంబలకరి పంబా! ॥మందూ॥
మేడల్లో ఉండేవారీ-మాడున తన్నును వేడి
అయిలు గీయిలు రాస్తా-గుమ్మైన మాలిషు చేస్తా
షోకైన పట్టూ పట్టి-జోరుగ ఛట్టీ తట్టి
హోయ్ హోయ్ అనిపించేను
చప్పుడు గిప్పుడు లేని సందడి-జంతరమంతర చేతిగారడి
రారండి బాబూ రారండి-హేయ్ జంబలకరి పంబ॥మందూ॥
ముక్కుకు సూటిగ నోరు-నోటికి మనదే పేరూ
మాటకు నోటికి పోటీ-ఆ చేతికి చెంపకు పేచీ
కలబడితే కాజాయిస్తా-నిలబడితే తాజా చేస్తా
మనమే ఓ తాలింఖానా-ఎగిరే వాళ్లను పైకెగరేస్తా
ఎదురు తిరిగితే-ఎత్తికుదేస్తా
ఆహోజీ తాఖతు దేఖోజీ-హేయ్ జంబలకరి పంబా ॥మందూ॥

## వీరాంజనేయ

**సంగీతం: యస్.రాజేశ్వరరావు గానం: ఘంటసాల**

అహో! రామకథ
హనుమ జనమకు తారకమౌ
ఆనంద ధాముని దివ్యకథ ॥అహో॥
దశరథ తనయుడు తపసి యాగము కాచి
మునితో మిథిలకు జేరి;
హరుని విల్ విరువ, బాల మైమరువ
సీతారాముల కళ్యాణమాయెనహో ॥అహో॥
రా చిలుకల వలె రమణీ రాముడు
వనముల విహరించగ
మాయలేడి ఎరజేసి వారి విడ
దీసె పదితలల మోసాలవాడు ॥అహో॥
హృదయేశ్వరికై - పరిభ్రమించే
ఘనశ్యామునికి - రామునికి - శ్రీరామునికి
కపిరాజొకడు - అనుచరుడై - ఆ
దేవిజాడలరయ బనిచె అనుచరుల ॥అహో॥

## రహస్యం

**సంగీతం: ఘంటసాల గానం: ఘంటసాల**

తిరుమలగిరి వాసా దివ్య మందహాసా
వరదాభయ లీలా విలాసా నవ్య చిద్విలాసా ॥తిరుమల॥
మా కనుదమ్ములె నీ ఆలయ మనుకొని
మా మనమే మందిర మనుకొని
వందారు జన మందార
నీ దాసులందరిలో మమ్మధికుల జేసెవ ॥తిరుమల॥
సిరిగలవాడవు నీవని
సరసుడవని దరి జేరగా
సానంద పరమానంద మమ్మేల
సిగపాయ చేసెనంది చిడిముడి చేసేవ ॥తిరుమల॥
కలిలో వరదైవమవై
తెలుగువారి యిలవేలుపువై
సాకార నిగమాకార మాకైన
దీవన లీవయ్యా శ్రీ వెంకటేశ ॥తిరుమల॥

## రేచుక్క

**సంగీతం: అశ్వత్థామ గానం: ఘంటసాల**

బలే బలే పావురమా - గడుసూ పావురమా!
ఎగరాలీ సరదా తీరగ పావురమా!!
మబ్బులకు సరాసరి ఎగరాలీ హంసలా
చిక్కాలీ నీకూ చక్కని చుక్కలూ
ఆకసమంతా నీ రాజ్యమే
ఓ పల్టీ వేయించగ బల్ మొనగాడూ
మనకన్నా ఘనుడూ ఏనాడు లేడు
బల్ గడుసరి లేడు!!
ప్రతిపూటా పంతాలే రోజూ పందెములే
అయితేనేలే హోయీ - ఈ రవ్వలకు
కాలికి తోడా జోడించుకో
కనుచూపు మేరల అందాలన్నీ చేదుకో
మనసైన దినుసు ఏ జాడనైనా
అందిన మరీ బాగూ !!

## కలిమిలేములు

**సంగీతం: అశ్వత్థామ గానం: ఘంటసాల, యస్.జానకి**

గాలిలో తేలే పూలడోలలో
పన్నీరు జల్లే వెన్నెల తీవ
కన్నుల కలకల ఏమో
చిననాటి ఆనందసీమలో
అలనాటి ఆనందసీమలో
అదే చెలిమిగ విహరించేమని
అనుకున్న కన్నె కలలే ॥చిననాటి॥
గాలిలో అలలు అలలుగా అల్లారుగ
గానమేలే కనక వీణ
నగుమోమున తళతళ ఏమో ॥చిననాటి॥
అలనాటి కలలవేడుకలే
మనసైన వాని చేరువచేయ
మోదములో ఆదమరచే పరవశమే ॥చిననాటి॥
గగనాన వెలిగే రేరాజు
చెంగల్వకు కలకాలము చేరవె
ఆ పలుకే నిజమై ఆ మనసే తనదై
కన్నె వలపు మాయని పున్నమి వెలుగాయే ॥చిననాటి॥

# 'నన్ను వదిలి నీవు పోలేవులే' పాటే నన్ను ఇండస్ట్రీకి లాక్కొచ్చింది

## కె.వి.మహదేవన్ గురించి నిర్మాత కె.మురారి



మహదేవన్ గారి గురించి నేను చెప్పాలంటే 30 ఏళ్ళు వెనక్కి వెళ్ళాలి. అంటే 72-73లో, 'మంచి మనసులు' చిత్రంలోని 'నన్ను వదలి నీవు పోలేవులే' పాటతో ఆయన పాటలంటే నాకు ఇంట్రస్ట్ కలిగింది. ఆ పాటకోసం ఆ సినిమాను 5 సార్లు చూసాను. చాలా బాగుంది. అప్పటిదాకా రాజేశ్వరరావుగారి సినిమాలను, ఆయన పాటలను అభిమానించినా, మంచి మనసులు చిత్రంలోని పాటలు విన్న తర్వాత మహదేవన్‌పై అభిమానం అనండీ ప్రేమ అనండీ కల్గింది. అందరూ 'మామ మామ' అన్న పాట తమకు బాగా నచ్చిందని అంటున్నారు. కాని నాకు మాత్రం 'నన్ను వదలి నీవు పోలేవులే' పాటే బాగా నచ్చింది. అప్పట్నించి ఆయన సినిమాలు చూడటం. ఆయనపై అభిమానం ఏర్పడటం జరిగింది.

ఎం.బి.బి.యస్ పూర్తయిన తర్వాత మద్రాస్ వచ్చి అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేసినప్పుడు, వీనస్ పిక్చర్స్ వారి 'మంచివాడు' చిత్రం మ్యూజిక్ సెట్టింగ్ సమయంలో మహదేవన్ గారితో పరిచయం ఏర్పడింది. అప్పుడు కంపోజింగ్ ఎలా చేస్తారు? ఏంటి? అనేది తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది. అంతకు ముందు రాజేశ్వరరావుగారి కొన్ని చిత్రాలకు (పవిత్రబంధం) కంపోజ్ చేయటం చూడటం జరిగింది. మహదేవన్ గారితో కూర్చున్నప్పుడు 'మంచివాడు'లో 'అమ్మాయే పుడుతుంది అచ్చు అమ్మలాగే ఉంటుంది', (ఆత్రేయగారు రాసారు) పాట మధ్యలో కొంచెం ఖాళీ దొరికింది. పిచ్చాపాటి పరిచయాలు అయ్యాక నేను అది ఇది మాట్లాడుతూ ఎం.బి.బి.యస్ చేసానని చెప్పాను. అది వినగానే" ఏరా, ఎందుకొచ్చావురా ఇండస్ట్రీకి, ఎం.బి.బి.యస్. చదివిన తర్వాత ?"అని ఆయన అంటే, 'నన్ను వదిలి నీవు పోలేవులే పాట నన్ను ఇక్కడికి లాక్కొచ్చింది -మామ' అని సరదాగా అంటే ఓ నవ్వు నవ్వారు. సరే పాట ట్యూన్ మొదలు పెట్టారు. 'అమ్మాయే పుడుతుంది' పాటకూడా దానికి దగ్గరగా ఉందో, లేదో తెలియదుకాని విన్న వెంటనే బాగుందనిపించింది. 'మంచిమనసులు'లో మిగిలిన పాటలు నీకు నచ్చలేదా' అని మామ అంటే 'నచ్చలేదా అంటే బాగున్నాయి కాని, 'నన్ను వదిలి నీవు పోలేవులే' పాటే బాగా నచ్చిందని అన్నాను. ఆయన బాగా ఇంప్రెస్ అయిపోయి, ఈ పాట నీకు నచ్చుతుంది. ట్యూన్‌లో చక్కటి మెలోడి ఉంది అన్నారు. అప్పట్నుంచి మా పరిచయం అలా పెరుగుతూ వచ్చింది.

'మామ'తో కంపోజ్ అంటే... హడావుడిగా



హార్మోనియం పెట్టె ముందేసుకుని, తబలా పై కిందా, మీద పడిపోవటం లాంటి హంగామాలు ఏమీ ఉండవు, పాటను ఏదో అలా చూస్తారు, (రెండు నిముషాలు). వుహాళేంది చెవిలో గొణుగుతారు. అక్కడ్నుంచి ట్యూన్స్ వస్తూ ఉంటాయి. ఇక మనం చూసుకోవాల్సింది ఆ ట్యూన్ బాగుందా లేదా అంతే. బాగోకపోతే ఇంకోటి ఏదో అంటారు. నేను సినిమాలు చేసేటప్పుడు, పల్లవి బాగాలేని ఓ పాటకు ట్యూన్ ఎన్నిసార్లు చేసినా నాకు నచ్చలేదు. అప్పుడు ఆయన నాకు చెప్పారు. ఒక్కొక్క పల్లవికి ఒక్కో ట్యూన్ ఉంటుంది. ఎన్నిసార్లు చేసినా దానికి దగ్గరగానే ఆ ట్యూన్ ఉంటుంది. ఒకవేళ నీకు మొత్తానికి కొత్త ట్యూన్ కావాలంటే, తప్పని సరిగా పల్లవి మార్చాలి అని అన్నారు. (ఇఫ్ యు వాంట్ ఎన్టైర్లీ డిఫెరెంట్ వన్ - యు షుడ్ హేవ్ ఎ డిఫెరెంట్ పల్లవి) అందుకని ఇక 'మామ'ను శ్రమపెట్టడం, ఇది బాగాలేదు. అది బాగాలేదు అనటం కంటే, నా సినిమాలు ప్రారంభమయి నప్పుడే ట్యూన్స్‌కు సరిపడ్డ విధంగా ఏడెనిమిది పల్లవులు రాయించుకునేవాడిని. దానికి ఆత్రేయగారు, 'మామ'లతో నాకున్న పరిచయం కూడా బాగా దోహదపడింది. ఆత్రేయగారు నా సినిమాలన్నింటికీ చేశారు. మొదట్లో మాత్రం సుందర్రామ్మూర్తిగారు చేశారు (సీతామహాలక్ష్మి సినిమాకు). నా సినిమాల్లో ప్రతి పాటకీ 7 నుండి 8 పల్లవులు రాయించుకునే వాడిని కనుక ఒక పల్లవి ట్యూన్ నాకు నచ్చకపోతే మరో పల్లవి... ఇలా చేయించుకుంటూ ఉండేవాడిని. కొన్నాళ్ళకు

'మామ'కు నా సినిమాలంటే ఓ అవగాహన వచ్చేసింది. నాకు ఏ ట్యూన్ అయితే నచ్చుతుందో ఆయన బాగా క్యాచ్ చేశారు. అసిస్టెంట్ డైరెక్టర్‌గా ఉన్నప్పుడే నేను ఆయనతో ఎక్కువగా వీనస్, జెమిని, సురేష్ కంపెనీ లలో వర్క్ చేసాను. అప్పటికే రాజేశ్వరరావు గారితో, పెండ్యాల గారితో అనుభవం ఉంది. కానీ స్వంత సినిమా మొదలు పెడదామనుకున్నప్పుడు 'మామ' పాటలే నాకు బాగా నచ్చాయి. అది 'మూగమనసులు' కానివ్వండి, 'మంచిమనసులు' కానివ్వండి. 'సీతామహాలక్ష్మి' సినిమా మొదలు పెడదామనుకున్నప్పుడు ఇంకా డైరెక్టర్ ఫిక్స్ కాలేదు. నేనే డైరెక్ట్ చేద్దామనుకున్నాను. ఆ విషయం 'మామ' కు చెప్పి, అడ్వాన్స్ ఇవ్వటం జరిగింది. ఆయన కూడా చాలా సంతోషించారు. కొంతకాలం తర్వాత నా ఆలోచన మారి కొంచెం అనుభవం ఉన్న వ్యక్తితో నా మొదటి పిక్చర్ చేస్తే బాగుంటుందనిపించి విశ్వనాథ్ గారిని దర్శకునిగా పెట్టుకోవటం జరిగింది. కొంత డిస్కషన్ నడిచిన తర్వాత చంద్రమోహన్‌ను హీరోగా పెట్టుకున్నాం. అంతకుముందే చంద్రమోహన్, విశ్వనాథ్ గార్ల కాంబినేషన్‌లో వచ్చిన 'సిరిసిరిమువ్వ' హిట్ కావటంతో ఈ కాంబినేషన్‌కు క్రేజ్ పెరిగింది.

'సీతామహాలక్ష్మి' పాటల కంపోజింగ్ అప్పుడే మహదేవన్ గారి ట్యూన్‌కి కృష్ణశాస్త్రి గారితో ఓ పాట రాయించాం. అంతకుముందే కృష్ణశాస్త్రి గారు 'ఉండమ్మా బొట్టు పెడతా' చిత్రానికి పాటలు రాసి ఉన్నారు. ఆ చిత్రం ఫ్లాప్ కావటంతో విశ్వనాథ్ గారికి కొంచెం సెంటిమెంట్ అడ్డు వచ్చింది. అయితే ఆ విషయం ఆయన మాకు చెప్పలేక పోయేవారు. అయినా ఆ విషయాన్ని మేం కూడా పట్టించుకునేవాళ్ళం కాదు. 'మావిచిగురు తినగానే' పాట కృష్ణశాస్త్రి గారు రాసారు. ఆ పాట కంపోజింగ్‌కు కూర్చున్నాం. కంపోజింగ్ టైంలో 'మామ' రకరకాలుగా ట్యూన్స్ ఇస్తున్నారు. నేను 'నవరంగ్' చిత్రంలోని 'ఆధా హై చంద్రమా' ట్యూన్ గుర్తుందా మామా అని ఊరికే అన్నాను. అప్పటికి విశ్వనాథ్ గారు, నేను కొన్ని సినిమాలకు అసిస్టెంట్ డైరెక్టర్స్‌గా చేసి ఉన్నాం. మిగతా ప్రొడ్యూసర్లలా కాక నేను కొంచెం కల్పించుకోవటం, ...'అట్లా కాదు, ఇలా కాదు' అని చెప్తూ ఉంటే, మామ ట్రై చేసి , చక్కగా ఆ రాగంలోనే పాటను చేయటం జరిగింది. ఇక రెండో పాట వచ్చేసరికి, నేను మొదటలాగానే ఏవో చెప్పటం చూసి విశ్వం గార్కి కొంచెం కోపం వచ్చింది. అప్పుడు మామ క్లియర్‌గా ఆయనకు చెప్పారు. 'నచ్చవలసింది నీకు, నాకు కాదు, వాడికి. నిర్మాత వాడు. వాడికి నచ్చాలి' అని. బహుశా మహదేవన్ గారు గట్టిగా మాట్లాడటం అదే మొదటిసారి కావచ్చు. తర్వాత మహదేవన్‌గారు చెప్పారు -నాకు ఎందుకో కొంచెం గట్టిగా చెప్పాలనిపించింది. ఎందుకంటే పాట నచ్చకపోతే బాగోదు అని చెప్పాలి కూడా.



పుహళేంది, టి.కృష్ణ, కె.వి.మహదేవన్, ఎస్.జానకి

ఇది తర్వాత తర్వాత మామ ఎందుకు ఫాలో అయ్యారంటే -రికార్డు చేయించిన తర్వాత పాట నాకు నచ్చకపోతే కాన్సిల్ చేయించి వేరే పాట రికార్డు చేయించేవాడిని. ఈ సంగతి మామకు తెలిసేది కాదు. 'గోరింటాకు' సినిమాకు రెండు పాటలు కాన్సిల్ చేయించాను. ఆయన పాటలు చేస్తూ ఈ సినిమాలో ఎన్ని పాటలున్నాయిరా అని అడిగారు. ఎందుకంటే అప్పటికే 8 పాటలు దాకా రికార్డు చేసి ఉన్నాం. తర్వాత ఆయనే రికార్డింగ్ సమయంలో పాట నచ్చకపోతే దానిని పక్కన పడేసేవాళ్ళు. కంపోజింగ్ సమయంలో నాకు పాట నచ్చితేనే రికార్డు చేసేవారు. నేను చేసిన 9 చిత్రాలకు మహదేవన్ గారే సంగీతం అందించారు.

1984లో చక్రవర్తి గారు ఉధృతంగా ఉన్న



కీరవాణి సంగీతాన్ని ఇచ్చిన 'బొంబాయి ప్రియుడు' సినిమాలో 'గుప్పెడు గుండెను తడితే దాని చప్పుడు పేరు సంగీతం' పాటలో 'అదిరి పడితే పేదవికేంటి అర్థం...' అనే లైను 'మంచి మనసులు' సినిమాలో 'నన్ను వదిలి నీవు పోలేవులే' అనే లైనుని గుర్తుకు తెస్తూ ఉంటుంది. అలా ఆ లైన్‌ని గుర్తుకు తెచ్చేలా కీరవాణి తన పాటల్లో మరికొన్ని సార్లు ట్యూన్ చేయటం జరిగింది కూడా...ఇవన్నీ ఉదహరిస్తూ 'మామ' గురించి చెప్పమన్నప్పుడు కీరవాణి ఇలా అన్నారు:

"అందరూ మాల్కోన్ చేస్తే ఒకలా ఉంటుంది. మహదేవన్ గారు మాల్కోన్ ముట్టుకుంటే మరొకలా ఉంటుంది. రొటీన్‌గా ఉండదు. మామ చేసిన 'నన్ను వదలి నీవు పోలేవులే' పాట నాకు చాలా ఇష్టమైన పాట.దాన్నే ఎన్నో రకాలుగా మార్చి చేసినా, ఎంత చేసినా ఇంకా అందులో కొంత మిగులుతుంటుంది. ఆ ఒక్క పాటే ఒక నిధిలాంటిది. అది తవ్వే కొద్దీ మరికొన్ని పాటలు వస్తూనే ఉంటాయి.

'నన్ను వదిలి నీవు పోలేవులే' అనే ఫ్రేజ్ ఇళయారాజా గారి పాటల్లో కూడా ఒక పాటలో వస్తుంది. అది తెలుగులో ఎలా డబ్ చేసారో తెలియదు కానీ తమిళంలో మాత్రం ఆ పాట స్క్రిప్ట్ ఇది.

**పొత్తివిచ్చ్ మల్లిరమొట్ట్**
**పొత్తిరిచ్చ్ వెక్కట్టు విట్ట్**
**పేసి పేసి రాసి ఆనదే**

(ఇక్కడ 'నన్ను వదిలి నీవు పోలేవులే' లా ఉంటుంది)

**మామన్ పేర చొల్లి చొల్లి**
**ఆళానదే రొంబ నాళానదే"**

అంటూ వివరించారు కీరవాణి.

రోజుల్లో అంటే సంవత్సరానికి 40, 50 సినిమాలు చేస్తున్న రోజుల్లో నేను 'అభిమన్యుడు' చిత్రం చేస్తున్నాను. ఆ రోజుల్లో 'మామ'కు సినిమాలు లేవు, సెప్టెంబర్‌లో మా ప్రొడక్షన్ మేనేజర్‌ను పంపించి 'మామ' డేట్స్ తీసుకురమ్మన్నాను. నాకు 'మామ' ఖాళీగా ఉన్నట్లు తెలీదు. నిర్మాతల సంగతి మనకు తెలియంది ఏముంది ఎవరు పేరులో ఉంటే వాళ్ళ వెంట పడతారు. సాధారణంగా ప్రొడ్యూసర్లు ఒక 10 రోజులో లేక నెలరోజులో పాటల సెట్టింగ్స్‌కు, రికార్డింగ్‌కు పెట్టుకుంటారు. కానీ నేను మాత్రం నెలలో మొదటి వారం లేదా 10 రోజుల పాటు - 4 లేదా 5 నెలలు వీటికోసం కేటాయిస్తాను. ఈ విషయం మీదే ఓ పెద్ద ప్రొడ్యూసర్ గారికి మహదేవన్ గారిపై కోపం కూడా వచ్చింది. ఎందుకంటే మహదేవన్ గారు డైరీ ఆయన ముందు పడేసి ఈ డేట్స్ వాడివి, ఈ డేట్స్ తప్పించి నువ్వు ఏ రోజు అడిగినా వస్తాను. మీకు ఆ రోజులలో కావాలంటే వాడిని అడగండి. వాడు చేయకపోతే ఇస్తాను తప్ప లేకపోతే ఆరోజులలో మీకు ఇవ్వను అన్నారు. అంత అభిమానం ఎందుకొచ్చింది అంటే 1984 సెప్టెంబర్ సంఘటన- మా ప్రొడక్షన్ మేనేజర్ వెళ్ళినప్పుడు మామ సరదాగా - అందరూ చక్రవర్తి అంటుంటే మీ వాడు ఏమిటి నా వెంట పడ్డాడు - అన్నారంట. దానికి మా మేనేజర్ అయ్యో! అదేమి లేదు, మా నిర్మాతగారు ఎప్పుడూ మీ గురించే చెబుతూ ఉంటారు; అది, ఇదీ అని కొద్దిగా గొప్పగా చెప్పాడు.

నాకు నిజంగా అసలు తెలీదు. మామ అంతకు ముందు 8 నెలలుగా హార్మోనియం పట్టుకోలేదని, ఆ యేడు ఎవరూ రాలేదని కూడా నాకు తెలీదు. కంపోజింగ్ అయిపోయింది. నాలుగు పాటలు కూడా ఫైనలైజ్ అయిపోయాయి. అప్పుడు వుహళేంది అన్నాడు. '8 నెలలకు పైగానే అయింది హార్మోనియం పట్టుకుని. నువ్వు కబురు చేస్తే మామకు ఆశ్చర్యమేసింది' అని.

'త్రిశూలం' సినిమాకు చక్రవర్తిని పెడదామని రాఘవేంద్రరావు అంటే మామను వదులు కోవటానికి ఇష్టపడలేదు. అలాగే 'గోరింటాకు' ముందు సేతు మాధవన్ అనే ఓ డైరక్టర్ గారిని పెట్టుకున్నప్పుడు ఆయన ఎం.ఎస్. విశ్వనాధన్ గారిని పెట్టుకుంటానంటే ఆయనను వదులు కున్నాను కానీ మామను వదలలేదు. ఎందుకంటే 'సీతామహాలక్ష్మి' తోనే నాకు అనుభవం అయిపోయింది. నాకు నచ్చిన పాటలు ఆయన చేస్తాడు. నాకు నచ్చే వరకూ ఆయన చేస్తాడు. అలాంటప్పుడు వేరే వాళ్ళ గురించి ఆలోచించవలసిన అవసరం ఏముంది. 'త్రిశూలం' సినిమాకు ముందు రాఘవేంద్రరావు, చక్రవర్తి కాంబినేషన్‌లో మంచి హిట్స్ వచ్చాయి. ఆ ఊపుతోనే ఆయన కన్విన్స్ చేయటానికి ప్రయత్నించారు. రాఘవేంద్రరావుకు కూడా 'మామ' అంటే గౌరవం ఉంది. కానీ అప్పుడు ఊపున్న రోజులు కదా అవి.

ఎన్నాళ్ళు ఖాళీగా ఉన్నా, హార్మోనియం పట్టుకోకపోయినా నేను తన తోనే చేస్తానన్న ఫీలింగ్ ఉండి పోయింది మామకి. అభిమన్యుడు సినిమా పాటలు హిట్ కావటం, మామకు మళ్ళీ సినిమాలు రావటం మొదలైన తర్వాత ఏ ప్రొడ్యూసర్ వెళ్ళినా మురారి డేట్స్ ఉంటే ఆ రోజులు డిస్ట్రబ్ చేయటానికి వీలు లేదు అని ముందే చెప్పేవారు. ఈ విషయాన్ని ఇండస్ట్రీ అంతా చాలా గొప్పగా చెప్పుకున్నారు.

కొన్ని పాటలు మహదేవన్ గారు మాత్రమే చేయగలరేమో అనిపించే సంఘటనలు అనేకం ఉన్నాయి. 'త్రిశూలం' సినిమాలో హీరో హీరోయిన్ల పెళ్ళి సంబంధం కుదిరి, ఊహల్లో ఓ పాట రావాలి. ఆత్రేయగారితో కొత్త రకంగా రాయించాలని ప్లాన్ చేశాము. అప్పటికే చక్కటి మెలోడి కరువైపోయింది. ఆత్రేయగారు ఓ పల్లవి



రాసి పంపించారు. తప్పట్లు, తలంబ్రాలు, తాళాలు, మూడేముళ్ళు, ఏడే అడుగులు, మొత్తం కలసి నూరేళ్ళు....అని. తర్వాత కంపోజింగ్‌లో కూర్చొన్నప్పుడు(ఆత్రేయ గారు ఇంకా రాలేదు) చదివి మామ నా మొఖం వంక చూసాడు. అదే సమయంలో 'ఏక్ దూజే కేలియే' హిందీ చిత్రంలో 'తేరే మేరే బీచ్ మే'అంటూ శివరంజని రాగంలో ఉన్న పాట ఒకటి ఉంది...ఆ పాట చివరలో అంజానా అని సాగుతుంది. ఈ క్యాసెట్ ప్రక్క గదిలో ఆన్‌చేసి నేను ప్రక్కకెళ్ళిపోయాను. రెండు నిముషాలలో మామ నాకు అద్భుతమైన ట్యూన్...ఆ పాటకు దగ్గరగా ఉండేలాగా ఇచ్చారు.

మామ కోపంతో విసుక్కున్నాడంటే, ఆ పల్లవికి ఇక పాటరాదనే! ఒక్కొక్కసారి ఓ మంచి పల్లవికి మంచి ట్యూన్ రాలేదు అంటే ఆ పల్లవికి ఇంకో పల్లవి రాయించాలే తప్ప ఆ పల్లవికేట్యూన్ చేయమంటే ఇక రాదన్న మాటే! అలా వచ్చిన పాటను రికార్డు చేయటం, క్యాన్సిల్ చేయటం చాలాసార్లు జరిగింది...ఆఖరికి కృష్ణశాస్త్రిగారి పాటను కూడా ఎవరికి చెప్పలేక రికార్డు చేసి, క్యాన్సిల్ చేసి అలా స్టోర్‌లో ఉంచేసాం. అట్లా మామవి 16 పాటలు నా దగ్గర రికార్డు చేసి అలా ఉండి పోయాయి. చివరకు ఆయన 'సీతారామకళ్యాణం' చిత్రం టైం వచ్చేటప్పటకి, వీడు నేను ఇచ్చిన ట్యూన్ నచ్చకపోతే నన్నేమి అనడు, రికార్డు అయిపోయిన తర్వాత క్యాన్సిల్ చేసేస్తాడు, ఇంకొకటి చేయిస్తాడు అనే నిర్ణయానికి వొచ్చేసారు. ఎందుకంటే ఖర్చు గురించి నేను ఏనాడు భయపడలేదు.

'త్రిశూలం' సినిమాలో 'అనుకోలేదమ్మా...' పాటను రికార్డు చేస్తూ దానికి ముందు వచ్చే బీజియమ్స్ నాకు పంపించారు. నాకు అవి నచ్చులేదు. ఆ రోజుల్లో ఓ రూల్ ఉండేది. సాంగ్ రికార్డుకు ముందు సింగర్స్ కనుక పాడకుండా క్యాన్సిల్ చేస్తే ఆర్కెస్ట్రాకు సగం రేటే ఇవ్వాలి. సింగర్‌లకు ఏమీ ఇవ్వనవసరం లేదు. సరే-ప్రొడక్షన్ మేనేజర్ వచ్చి క్యాన్సిల్ చెప్పేసి వెళ్ళిపోయాడు. ఎందుకురా అంటే బీజియమ్స్ బాగా లేదంట అని చెప్పాడు. మామకు నేను ఎప్పుడూ ఎదురు చెప్పలేదు. కాని నాకు కావలసిన విధంగా ఎలా పనిచేయించుకోవాలో అలాగే చేసేవాడిని. ఓసారి ఏదో మాట మీద ఆయన - నేను మానేస్తారా - అన్నారు. వెంటనే - నేను కూడా మానేస్తాను- అన్నాను. దేవుడు అనుగ్రహించిన శాపమో, వరమో తెలియదు కానీ మామ సినిమాలకు దూరంగా ఉన్న తర్వాత, నేను కూడా సినిమాలకు దూరంగానే ఉన్నాను.

మామ మనుషులను ఎంతగా ప్రేమిస్తాడో, కోపం వస్తే అంతగానూ ద్వేషిస్తాడు. వుహళేంది గారంటే మామకు చాలా ఇష్టం. ఓ సారి ఓ కొత్త కంపెనీ హైదరాబాద్‌లో రికార్డింగ్ చేపట్టి మామను ఫ్లైట్‌లో, వుహళేందిని రైలులో రమ్మన్నారు. మామ నేను అసలు అక్కడకు రానని తేల్చి చెప్పేసారు. ఆయనను అంత బాగా చూసుకునేవారు.

శంకరాభరణం పెద్ద హిట్ అయింది. యూనిట్ మొత్తం అమెరికా ప్రయాణానికి సిద్ధమైంది. సుమారు 30 మంది. సడన్‌గా ఓ రోజు మామ ఫోన్ చేసి నువ్వు అమెరికా వస్తావేరా, నేను వాళ్ళతో వెళ్ళటం లేదు. మన ముగ్గురం కలసి వెళ్దాం అన్నారు. ఏదో జరిగుంటుందని అనిపించి

నేను తర్వాత చెప్తానని చెప్పి, వెంటనే కె.ఎల్.ఎన్. ప్రసాద్ గారికి ఫోన్ చేస్తే, అమెరికాలో మోహనరావు అనే అతను అక్కడి ఎరేంజ్‌మెంట్స్ చేస్తున్నారని, అన్నారు. నేను మోహనరావు గారితో మాట్లాడితే ఆ చిత్ర నిర్మాతలే వుహళేంది గారిని లిస్ట్‌లో నుండి తీసేసారని, మీ ముగ్గురు వస్తానంటే ఎరేంజ్‌మెంట్స్ చేస్తామని చెప్పారు. మర్నాడు వుహళేంది గారే 'ఎందుకురా అక్కడకు వెళ్ళటం' అనటంతో మేం మొత్తానికి మానేసాం. ఆ విషయం వారికి కూడా చెప్పేసాం. ఆ తర్వాత ఆ కంపెనీకి మరే చిత్రమూ మామ చేయలేదు, ఆ చిత్ర నిర్మాతలు ఎక్కడ కనబడినా మామ మాట్లాడేవారు కాదు. కొంతమంది పెద్దలు రాజీ చెయ్యాలని ప్రయత్నించినా మామ ఒప్పుకోలేదు.



మామ తన మనసు దోచుకున్న మనుషులను చాలా బాగా ప్రేమించేవారు. ఆదుర్తి సుబ్బారావు, బాపు, రమణలంటే మామకు చాలా ఇష్టం. నమ్మిన మనిషి మోసం చేస్తే ఆయన అసలు తట్టుకోలేరు. అలా నమ్మిన మనిషి మోసం చేయటం వలనే 'మామ' నెల రోజుల పాటు పెరాలసిస్‌తో హాస్పిటల్‌లో ఉన్నారు.

ఈ రోజు 'యువచిత్ర' నిలబడిందంటే, పదిమంది మా చిత్రంలోని పాటలు గురించి చెప్పుకుంటున్నారంటే నిజంగా మహదేవన్ గారు మాకిచ్చిన తోడ్పాటు, నన్ను అర్థం చేసుకున్న విధానం. నాతో ఏడుగురు దర్శకులు పనిచేసారు. కానీ సంగీతం ఇచ్చింది మాత్రం మహదేవన్ ఒక్కరే. ఒకసారి కృష్ణ గారు ఇదే విషయమై డైరక్టర్లను ఎందుకు మారుస్తావు అని అడిగారు. డైరక్టర్ల పేర్ల మీద కంపెనీ ఉండదు. నా కంపెనీగా నాకు గుర్తింపు ఉండాలన్నాను. మరి మహదేవన్ గారిని ఎందుకు మార్చలేదంటే - ఆయనతో ఐడెంటిఫై కావటానికి నేను సిగ్గుపడను. డైరక్టర్లతో ఐడెంటిఫై కావటం కంటే, ఫలానా 'యువచిత్ర'కు మహదేవన్‌గారు మంచి పాటలు చేసారు అనిపించుకోవటం నాకు ఆనందం. ఈ రోజు యువచిత్రకు ఏ మాత్రం గుర్తింపు ఉందనుకున్నా అందులో మహదేవన్‌గారి కంట్రిబ్యూషన్ చాలా ఉంది.

సంప్రదాయాలకు ఆయన ఇచ్చిన విలువ ఎవరూ ఇచ్చి ఉండకపోవచ్చు. త్యాగరాజ కీర్తనగాని, అన్నమయ్య కీర్తన గాని ఆయన చేసిన సినిమాలలో చూస్తే ఏ మాత్రం పొల్యూషన్ లేకుండా హాయిగా ఉంటాయి. ఓసారి నాకు తెలిసిన ఓ త్యాగరాజ కీర్తన పల్లవి తీసుకుని దాని రాగం మాత్రం మార్చి హిందోళం అని చెప్పాను. ఆయన దానిని హార్మోనియం పై వాయించి చూసి ఆ రాగం కాదన్నారు. "మారిస్తే ఏమయింది మామా" అన్నాను. "అంతకన్నా పాపం ఇంకొకటి లేదురా? నా జీవితంలో అలాంటి పని చేయను" అన్నారు. అది ఆయన గొప్పతనం.

పొడుగుపాటి పల్లవులు, అర్థం కాని మాటలు మామకు అంతగా నచ్చేవి కావు. పల్లవి అందంగా ఉండాలి. పల్లవిని ఎప్పుడూ మ్యూజిక్ డామినేట్ చేయ కూడదు. శబ్దాల హోరులో మాట వినబడకుండా ఉండటం మామకు ఇష్టముండదు. చాలామంది సంగీత దర్శకులకు మాట వినబడినా, వినబడకపోయినా వారు చేసే మ్యూజిక్ అందంగా ఉండాలని కోరుకుంటారు, కానీ మాట వినబడని పాట ఎలా బాగుంటుంది!?

## ఆత్మబలం

రచన: ఆచార్య ఆత్రేయ గానం: ఘంటసాల, సుశీల

ఆ: చిటపట చినుకులు పడుతూవుంటే
చెలికాడే సరసన వుంటే
చెట్టాపట్టగ చేతులు పట్టి
చెట్టునీడకై పరుగెడుతుంటే
చెప్పలేని ఆ హాయీ
ఎంతో వెచ్చగ ఉంటుందోయీ...
అ: ఉరుములు ఫెళఫెళ వురుముతువుంటే
మెరుపులు తళతళ మెరుస్తూ వుంటే
మెరుపు వెలుగులో చెలి కన్నులలో
బిత్తర చూపులు కనబడుతుంటే
చెప్పలేని ఆ హాయీ
ఎంతో వెచ్చగ ఉంటుందోయీ...
ఆ: కారుమబ్బులు కమ్ముతువుంటే
కళ్ళకు ఎవ్వరు కనబడకుంటే
జగతిని వున్నది మనమిద్దరమే
అనుకొని హత్తుకుపోతుంటే
చెప్పలేని ఆ హాయీ
ఎంతో వెచ్చగ వుంటుందోయీ... ॥ఉరుములు॥
అ: చలిచలిగా గిలి వేస్తూంటే
గిలిగింతలు పెడుతూవుంటే
చెలి గుండియలో రగిలే వగలే
చలిమంటలుగా అనుకుంటే
చెప్పలేని ఆ హాయీ
ఎంతో వెచ్చగా వుంటుందోయీ... ॥చిటపట॥

## ప్రేమనగర్

రచన: ఆచార్య ఆత్రేయ గానం: ఘంటసాల

తేటతేట తెలుగులా
తెల్లవారి వెలుగులా
తేరులా - సెలయేరులా
కలకలా - గలగలా
కదలివచ్చింది కన్నె అప్సర
వచ్చి నిలిచింది - కనుల ముందర ॥తేట॥
తెలుగువారి ఆడపడుచు ఎంకిలా - ఎంకి
కొప్పులోని ముద్దబంతి పువ్వులా
గోదారి కెరటాల గీతాలవలె నాలో
పలికినది - పలికినది - పలికినది...
చల్లగా - చిరుజల్లుగా
జలజలా గలగలా... ॥కదలి॥
రెక్కలొచ్చి వూహలన్నీ ఎగురుతున్నవి
ప్రేమమందిరాన్ని చుక్కలతో చెక్కుతున్నవి
లోలోన నాలోన ఎన్నెన్నో రూపాలు వెలిసినవి
వెలిసినవి...
వీణలా - నెరజాణలా
కలకలా - గలగలా ॥కదలి॥

## తేనెమనసులు

రచన: దాశరథి గానం: ఘంటసాల, సుశీల

దివినుండి భువికి దిగివచ్చే దిగివచ్చే
పారిజాతమే నీవై నీవై
గుడిలోని ప్రతిమ వచ్చింది వచ్చింది
కోటి ప్రభలతో నీవై నీవై ॥దివి॥
అందని జాబిలి అందాలు పొందాలి
అనుకున్నానొకనాడు ఆనాడు
అందిన జాబిలి పొందులో అందాలు
పొందాను ఈనాడు ఈనాడు (2)
కనరాని దేవుని కనుల చూడాలని
కలగంటి నొకనాడు ఆనాడు
కలనిజము చేసి కౌగిలిలో చేర్చి
కరగించేవీనాడు ఈనాడు (2) ॥దివి॥
కడలిలో పుట్టావు
అలలపై తేలావు
నురగవై వచ్చావు ఎందుకో
కడలి అంచువు నిన్ను
కలిసి నీ ఒడిలో ॥కడలి॥
ఒరిగి కరగాలనే ఆశతో ॥దివి॥

## సాక్షి

రచన:ఆరుద్ర గానం:కె.బి.కె.మోహన్‌రాజు

పదిమంది కోసం నిలబడ్డ నీకు
ఫలితం ఏమిటి? యమపాశం
ఎవరికి వారే ఈ లోకం రారు ఎవ్వరూ నీ కోసం
నిజము నిప్పులాటి దెప్పుడూ
నిన్ను దహించక తప్పదూ
లేదు లేదురా న్యాయమూ
నీకు చావు ఒక్కటే సాయము
నిట్టూర్చె గాలి నిదురించె భూమి
నిను చూసి నవ్వింది ఆకాశం
ఎవరికి వారే ఈ లోకం రారు ఎవ్వరూ నీ కోసం
వేసిన తలుపులు తీయరు
మూసిన కన్నులు తెరువరు
ఎంత పిలిచినా పలుకరు
నీకై రవ్వంత కన్నీరు విడువరు
చుట్టాలు లేరు పక్కాలు లేరు
నీ నీడతో చేయి సావాసం
ఎవరికి వారే ఈ లోకం రారు ఎవ్వరూ నీ కోసం
చందమామ నిజము చూడకు
చూసినా సాక్ష్యం చెప్పకూ
పరిగెత్తి వస్తోంది రాహువు
అయ్యో తరిగిపోతున్నాది ఆయువు
దైవానికైనా దయలేదు లేదు
ఒంటిగా చేరవోయి కైలాసం
ఎవరికి వారే ఈ లోకం రారు ఎవ్వరూ నీ కోసం

## ప్రైవేటుమాష్టారు

రచన: ఆరుద్ర    గానం: ఎస్.పి.బాలసుబ్రమణ్యం

పాడుకో... పాడుకో
పాడుతూ.... చదువుకో
పాడుకో
ఆదిలో మన విద్య లయబద్ధమే
వేదాలు నాలుగూ సంగీతమే
పాఠాలు పాటగా వల్లించితే
వినోదం వికాసం విరాజిల్లులే ॥పాడుకో॥
రాలైన కరిగించు గాంధర్వము
రమణీయము - అది కమనీయము
సంగీత మేదైనా సాధించును
స్వరాల ప్రభావం అమోఘం సుమా ॥పాడుకో॥

## మూగమనసులు

రచన: ఆత్రేయ    గానం:ఘంటసాల

పాడుతా తీయగా సల్లగా
పసిపాపలా నిదురపో తల్లిగా బంగారు తల్లిగా ॥పాడు॥
కునుకుపడితె మనసు కాస్త కుదుటపడతది
కుదుటపడ్డ మనసు తీపికలలు కంటది
కలలె మనకు మిగిలిపోవు కలిమి సివరకు
ఆ కలిమి కూడా దోచుకునే దొరలు ఎందుకు ॥పాడు॥
గుండె మంటలారిపే సన్నీళ్ళు కన్నీళ్ళు
వుండమన్న వుండవమ్మ శానాళ్ళు
పోయినోళ్ళు అందరూ మంచోళ్ళు
వున్నోళ్ళు పోయినోళ్ళ తీపి గురుతులు ॥పాడు॥
మణిసి పోతెమాత్రమేమి మనసు వుంటదీ
మనసుతోటి మనసెపుడో కలిసిపోతదీ
సావు పుటక లేనిదమ్మ నేస్తమన్నదీ
జనమ జనమకది మరీ గట్టిపడతది ॥పాడు॥

## అదృష్టవంతులు

రచన: ఆరుద్ర    గానం: ఘంటసాల, సుశీల

ము ము ము ము ముద్దంటె చేదా- నీకా ఉద్దేశం లేదా?
ఇపుడొద్దన్నావంటె కుర్రవాడా-రేపు ఇమ్మన్నా ఇస్తానా వెర్రివాడా
ము ము ము ము ముద్దంటె మోజె-ఇపుడా ఉద్దేశం లేదే
నిను ముద్దాడాలంటే కుర్రదానా-
అసలు మనసంటు వుండాలె వెర్రిదానా
పెదవులు రెండు కలగలపినచో-తేనెలు కురిసే ముద్దు
మనసులు రెండు పెనవేసినచో-మమతకు లేదు హద్దు
చూడు ఉబలాటం-ఆడు చెలగాటం
పెడమోమైనా విడువను నిన్ను-వద్దుర మొగమాటం
ము ము ము ము ముద్దంటె చేదా-నీకా ఉద్దేశం లేదా
నిను ముద్దాడాలంటె కుర్రదానా
అసలు మనసంటు వుండాలె వెర్రిదానా
ఆడదాని ముద్దులోన వేడి వున్నదోయ్
ఆ వేడికి వెన్నలా కరిగిపోతావోయ్
మోజుపడకుంటె మగవాడె కాదు
గడసరి బిగువు సడలించనిచో- జవరాలె కాదు ॥ముము॥

## శంకరాభరణం

రచన: వేటూరి    గానం:ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, ఎస్.జానకి

ఓం... ఓం... ఓంకారనాదాను సంధానమౌగానమే
శంకరాభరణము
శంకరగళ నిగళము శ్రీహరి పదకమలము
రాగరత్నమాలికా తరళము శంకరాభరణము
శారదవీణా రాగచంద్రికా పులకిత శారద రాత్రము
నారద నీరద మహతీ నినాద గమకిత శ్రావణగీతము
రసికులకనురాగమై రసగంగలో తానమై
పల్లవించు సామవేదమంత్రము శంకరాభరణము
అద్వైతసిద్ధికి అమరత్వలబ్ధికి గానమె సోపానము
సత్యసాధనకు సత్యశోధనకు సంగీతమే ప్రాణము
త్యాగరాజ హృదయమై, రాగరాజ నిలయమై
ముక్తినొసగు భక్తియోగ మార్గము మృతియె లేని
సుధాలాపస్వర్గము శంకరాభరణము
ఓంకారనాదాను సంధానమౌగానమే శంకరాభరణము
పా.. దా..ని.. శంకరాభరణము
పమగరీ - గమపదని శంకరాభరణము
సరిసా-నిదపా-నిసనీ-దపమా-గరిగా-పమగా-
పమదప నిదసనిగరి శంకరాభరణము
దపా-దమా-మాపాదపా ... మా పాదపా
దపా-దమా-మదపామగా ... మద పామగా
గమమద-దనినిరి-మదదని-నిరిరిగ-నిరిరిగ-గమమగ-
సరిరిస-సనినిదదప శంకరాభరణము
రీససాస-రిరిసాస-రీసాస సనిస రీససని రిసని దనీనీనీ
దాదనీని-దదనీని-దానీని దనిస దనిసద నిసదని దగరిసాని
దస దాదాదా
గరిగా మమగా-గరిగా మమగా-గరిగమస-గామపద-
మదసమ-గరిసరి
సరిగసరీ-గరిమగపమ దప మగప దపనిద-పమదప నిదసని
రి స గరిసా-గరిసనిద-రీసా-రిసనిదప-సా
గరిసనిద-రిసనిదప-సనిదపమ-రీసానీ-రిసనిదప-నీదా
సనిద పమపా-రిసనిదప-సనిదపమ-దపమగరి-గామాదా
నిదని పదమాప-రిసనిదప-రీ-దపమగరీ-
రిసని దప-మగరిసని శంకరాభరణము... శంకరాభరణమూ

## శంకరాభరణం

గానం:యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, యస్.జానకి

సా రిగరీ గప దాపా। సరిగపదా పగరీ। రిగపదసా నీదాపా॥
గపద పదప గపదపదప। గపదప। రిగపగపగ। రిగపగపగ।రిగపగ॥
సరిగ। రిగప। గపద। పదరిసా। రిగప। గపద। పదస। దసగరీ॥
ససరిరి గగపప। రిరిగగ పపదద। గగపప దదసస॥
పపదద ససరిరిసా। రిసా। రిసా। రిసా॥
గపద। పగరి। రిగప। గరిస॥
దసరి పదసా। గపదా రిగపా॥
దసరి పదసా। గపదారిగపా॥
సానిద। నీదప। దాపగ। పదప॥
పదసరీగరి। రిగపదాపదా॥
సారీ। గాపా। దాపా॥

## ముత్యాల ముగ్గు

రచన: ఆరుద్ర గానం: సుశీల

ముత్యమంతా పసుపు ముఖమంత చాయ
ముత్తయిదు కుంకుమ బతుకంత చాయ
ముద్దు మురిపా లొలుకు ముంగిళ్లలోన
మూడుపువ్వులు ఆరుకాయల్లు కాయ
ఆరనయిదోతనము ఏచోట నుండు
అరుగులలికేవారి అరచేత నుండు
తీరయిన సంపద ఎవరింట నుండు
దినదినము ముగ్గున్న లోగిళ్ల నుండు ॥ముత్య॥
కోటలో తులిసెమ్మ కొలువున్న తీరు
కోరి కొలిచేవారి కొంగు బంగారు
గోవు మాలక్ష్మికి కోటిదండాలు
కోరినంతా పాడి నిండుకడవల్లు ॥ముత్య॥
మగడు మెచ్చిన చాన కాపురంలోన
మొగలిపూలా గాలి ముత్యాల వాన
ఇంటి ఇల్లాలికి ఎంత సౌభాగ్యం
యింటిల్లిపాదికి అంత వైభోగం ॥ముత్య॥

## కన్నె మనసులు

రచన: ఆచార్య ఆత్రేయ గానం: ఘంటసాల

ఈ ఉదయం నా హృదయం
పురులు విరిసి ఆడింది
పులకరించి పాడింది... ॥ఈ ఉదయం॥
పడుచుపిల్ల పయ్యెదలా
పలుచని వెలుగు పరచినది
కొండల కోనల మలుపుల్లో
కొత్త వంపులు చూపినది.. ॥ఈ ఉదయం॥
చిగురాకులతో చిరుగాలి- సరసాలాడి వచ్చినది
చక్కలిగింతలు పెట్టినది
వేసవికే చలి వేసినది... ॥ఈ ఉదయం॥
సరసున జలకాలాడే దెవరో-తేటిని వెంట తిప్పేదెవరో
రేయికి సింగారించే కలువో
పగలే వగలు రగిలే కమలమో ॥ఈ ఉదయం॥

## సుమంగళి

రచన: ఆచార్య ఆత్రేయ గానం: ఘంటసాల

సిగలోకి విరులిచ్చి చెలినొసట తిలకమిడి
సిగపూవు వాడకనే చెలిబ్రతుకు వాడెనయా
పరువానికి బలవంతాన పగ్గాలే వేస్తావా
మనసుమూసి మమతలు రోసి మనుగడ మసి చేస్తావా
తనువు చిక్కి శల్యంబైనా వలపులణిగి పోయేనా
ఇరవైలో అరవై వయసు ఎవరికైన వచ్చేనా
తీయనైన జీవితాన చేదువిషం తాగేవా
తోడునీడగా ఒకరుండి ఏకాకిగ బ్రతికేవా
కోరినది చేతికిచిక్కి ఆరుతున్నదొక దీపం
కోరినది చేతికిరాక ఆరకున్నదొక తాపం
ఆరకున్నదొక తాపం ॥సిగలోకి॥
అంధుని ఎదుట అందాలేలా
అడవిని పున్నమి వెన్నెలలేలా
అసమర్థుని కవకాశాలేలా
వృథా... వృథా... ఈ బ్రతుకు వృథా...

## తోడూ నీడా

రచన: ఆచార్య ఆత్రేయ గానం: పి. భానుమతి

ఎన్నో రాత్రులు వస్తాయి కానీ యిదియే తొలిరేయి
ఎన్నో బంధాలున్నాయి కానీ యిది శాశ్వతమోయి
పక్కన అతడు నిలబడితే పరువం ఉరకలు వేస్తుంది
వయసుకు తగ్గది ఆ మొగ్గు వల్లమాలినది ఈ సిగ్గు ॥ఎన్నో॥
వస్తాడమ్మా నీరేడు ఏమిస్తాడో రుచిచూడు
మల్లెల మంచం పిలిచింది ఉయ్యల త్వరలో రానుంది ॥ఎన్నో॥
ఎవరో చెబితే విన్నాను విన్నది నీతో అన్నాను
నాకూ యింతే తెలిసినది నీకే తెలియును మిగిలినది ॥ఎన్నో॥

## ఆస్తిపరులు

రచన: కొసరాజు గానం: సుశీల

సోగ్గాడే చిన్నినాయనా - ఒక్క పిట్టనైన కొట్టలేడు సోగ్గాడూ
కట్టె తుపాకెత్తుకొని కట్టమీద నడుస్తూంటే
కాలుజారి పడ్డాడె సోగ్గాడూ
పగటివేసగాడల్లె పల్లెటూళ్లొ తిరుగుతుంటే కుక్కపిల్ల భౌ అంది
పడుచుపిల్ల పక్కుమంది ॥సోగ్గాడే॥
కళ్లజోడు వేసుకొని, గళ్లకోటు తొడుక్కొని
పిల్లగాలికొచ్చాడే సోగ్గాడూ
చిట్టివలస వాగుకాడ పిట్ట తుర్రుమంటేను
బిక్కమొగమేశాడు - చుక్కలంక చూశాడు ॥సోగ్గాడే॥
మూతిమీసం గొరుక్కొని - బోసి మొకం పెట్టుకొని
యాటకోసం వచ్చాడే సోగ్గాడూ
బుల్లిదొర వచ్చెనని కుక్కపిల్ల ఎక్కిరిస్తే
ఎల్టిమొగం వేశాడు - బిక్కిబిక్కి చూశాడు ॥సోగ్గాడే॥

## ఆత్మబంధువు

రచన: సి. నారాయణరెడ్డి గానం: ఘంటసాల, సుశీల

ఆ: అనగనగా ఒకరాజు అనగనగా ఒకరాణీ
రాజు గుణము మిన్న రాణి మనసు వెన్న ॥అనగనగా॥
అ: ఆ రాజుకు ఏడుగురు కొడుకు లున్నారు
వారు చదువు సంధ్యలుండిగూడ చవటలయ్యారు
ఒట్టి చవటలయ్యారు ॥అనగనగా॥
అ: పడకమీద తుమ్మముళ్లు పరచె నొక్కడు
అయ్యొ ఇంటిదీప మార్పి వేయనెంచె నొక్కడు
తల్లీ దండ్రులు విషమని తలచెనొక్కడు
పడుచు పెళ్లామే బెల్లమని భ్రమసెనొక్కడు ॥అనగనగా॥
అ: కొడుకులతోపాటు రాజు కుక్కను పెంచే
ప్రేమయనే పాలుపోసి పెంపు చేసెను
ఆ: కంటి పాపకంటె ఎంతో గారవించెను
దాని గుండెలోన గూడుకట్టి వుండసాగెను తానుండసాగెను
అనగనగా ఒకరాజు అనగనగా ఒకరాణీ
అ: నాది నాది అనుకున్నది నీది కాదురా
నీవు రాయన్నదె ఒకనాటికి రత్నమౌనురా
కూరిమి గలవారంతా కొడుకు లేనురా
జాలి గుండెలేని కొడుకుకన్న కుక్క మేలురా
ఇ: అనగనగా ఒకరాజు అనగనగా ఒకరాణీ
రాజు గుణము మిన్న రాణి మనసు వెన్న

## ఏకవీర

రచన: దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి గానం: ఘంటసాల, బాలసుబ్రహ్మణ్యం

ప్రతి రాత్రి వసంత రాత్రి
ప్రతిగాలి పైరగాలి
బ్రతుకంతా ప్రతినిముషం
పాటలాగ సాగాలి
బ్రతుకంతా ప్రియా... ప్రియా...
పాటలాగ సాగాలి
నీలో నా పాట కదలి
నాలోనీ అందె మెదలి
లోలోన మల్లెపొదల
పూలెన్నో విరిసి విరిసీ
మనకోసం ప్రతి నిముషం
మధుమాసం కావాలి ॥ప్రతి॥
మనకోసం ప్రియా... ప్రియా...
మధుమాసం కావాలి
ఒరిగింది చంద్రవంక
ఒయ్యారి తారవంక
విరజాజి తీగసుంత
జరిగింది మావిచెంత
నను జూచీ నిను జూచీ
వనమంతా వలచింది
నను జూచీ ప్రియా... ప్రియా...
వనమంతా వలచింది ॥ప్రతి॥

## మంచిమనసులు

రచన: దాశరథి గానం: ఘంటసాల, సుశీల

ఆ: నన్ను వదలి నీవు పోలేవులే
ఇదీ నిజములే
పూవు లేక తావి నిలువలేదులే...
అ: తావిలేని పూవు విలువ లేనిదే
అదీ నిజములే
నీవులేక నేను లేనె లేనులే...
ఆ: నా మనసే చిక్కుకునే నీ చూపుల వలలో
నా వయసు నా సొగసు నిండెను నీ మదిలో
చిరకాలపు నాకలలే ఈనాటికి నిజమాయె
దూర దూర తీరాలు చేరువైపోయే ॥నన్ను॥
అ: సిగ్గు తెరలలో కనులు దించుకుని
తలను వంచుకునీ
బుగ్గ మీద పెళ్లి బొట్టు ముద్దులాడ
రంగులీను నీ మెడలో బంగారపు తాళిగట్టి
పొంగిపోవు శుభదినము రానున్నదిలే... ఓ... ఓ... ఓ... ॥నన్ను॥
అ: తొలినాటి రేయి తడబాటు పడుతు
మెలమెల్లగా నీవురాగా
నీ మేని హొయలు నీలోని వగలు
నాలోన గిలిగింతలిడగా
ఆ: హృదయాలు కలిసి ఉయ్యాలలూగి
ఆకాశమే అందుకొనగా
పైపైకి సాగి మేఘాల దాటి
కనరాని లోకాలు కనగా
ఇ: అహో... ఓహో... ఊహూఁ ... ఆ... ఆ... ఆ...
ఓ ఓ ఓ ఓ ఓ ఓ ఓ ఓ ఓ ఓ ఓ ఓ ॥నన్నువదలి॥

## స్వాతి కిరణం

రచన: సి. నారాయణరెడ్డి గానం: వాణీ జయరామ్

ప్రణతి ప్రణతి ప్రణతి
ప్రణవనాద జగతికి
ప్రణుతి ప్రణుతి ప్రణుతి
ప్రథమ కళాసృష్టికి
పూల మెదలలో పులకలు
పొడిపించే భ్రమర రవం ఓంకారమా
సుప్రభాత వేదికపై
శుకపికాది కలరవం ఐంకారమా
పైరు పాపలకు జోలలు
పాడే గాలుల సవ్వడి హ్రీంకారమా
గిరుల శిరసులను జారే
ఝరుల నడల అలజడి శ్రీంకారమా
ఆ బీజాక్షర వితతికి
అర్పించే జోతలివే
పంచభూతముల పరిష్వంగమున
ప్రకృతి పొందిన పదస్పందన - అది కవనమా
అంతరంగమున అలలెత్తిన స
ర్వాంగ సంచలన ఖేలన - అది నటనమా
కంటితుదల హరివింటి పొదల తళు
కందిన సవర్ణలేఖన - అది చిత్రమా
మౌన శిలల చైతన్య మూర్తులుగ
మలచిన సజీవకల్పన - అది శిల్పమా
ఆ లలిత కళాసృష్టికి
అర్పించే జోతలవే

## బుద్ధిమంతుడు

రచన: ఆరుద్ర గానం: ఘంటసాల

టా టా వీడుకోలు
గుడ్‌బై ఇంక సెలవు
తొలినాటి స్నేహితులారా
చెలరేగే కోరికలారా
ప్రియురాలి వలపులకన్నా నును
వెచ్చని దేదీ లేదని
నిన్ననునాకు తెలిసింది - ఒక
చిన్నది నాకు తెలిపింది
ఆ ప్రేమనగరుకే పోతాను
ఈ కామ నగరుకు రాను - ఇక రాను ॥టాటా॥
ఇచ్చుటలో వున్నహాయి - వే
రెచ్చటనూ లేనే లేదని
లేటుగ తెలుసుకొన్నాను - నా
లోటును దిద్దుకున్నాను -
ఆ స్నేహనగరుకే పోతాను
ఈ మోహనగరుకు రాను - ఇక రాను ॥టాటా॥
మధుపాత్ర కెదలో ఇంక - ఏ
మాత్రం చోటు లేదని
మనసైన పిల్లే చెప్పింది - నా
మనసంతా తానై నిండింది
నే రాగనగరుకే పోతాను
అనురాగనగరుకే పోతాను - పోతాను




జూన్ 21 కె.వి. మహదేవన్ తొలి వర్ధంతి సందర్భంగా

సంగీత ప్రియులందరి తరపున నివాళులర్పిస్తూ హాసం

